



ముఖచిత్రం : దీపశ్రీ

2, 3, 4 కవరుపేజీ చిత్రాలు జంబూలోక చరిత్ర కథలోనివి.

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

ఈ పండుగ వేళలలో... ఆకర్షణీయమైన క్రొత్తదనాలు

KIRON/APCO/821/F.




ఆప్కో
చేనేతలు కొనండి

ఆప్కో
చేనేతలు

పోచంపల్లి, ధర్మవరం.
నారాయణపేటల ప్రకాశవంత
మైన సిల్కుతయారీలు గద్వాల,
వెంకటగిరి–జాలువారు
జరీలు తళుకులొలుకు
ఆప్కో సృష్టి అందాలు
రండి! ఆప్కోవారి అద్భుత
వస్త్రశ్రేణి నుండి మీరు
కోరుకొన్నవి ఎన్నుకొనండి.




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 46 నవంబరు 1982 సంచిక 5

ఆంధ్రప్రదేశ్‌లో కొత్త మంత్రిమండలి సెప్టెంబరు 20వ తేదీన ఏర్పాటయింది. ఈ మంత్రిమండలి నాయకుడు, పార్లమెంటు సభ్యుడు కె విజయభాస్కరరెడ్డి. వీరు ఒకానొకప్పుడు రాష్ట్ర మంత్రిమండలిలో వున్నవారే పరిపాలనా వ్యవహారాలలో అనుభవం వున్నవారే. అందుచేత, ప్రభుత్వ వ్యవహారాలకు కొత్త కాదు; రాష్ట్ర రాజకీయాలకు కొత్తకాదు కాని, రాష్ట్ర శాసనసభ్యులలో అందరినీ విడిచిపెట్టి, పార్లమెంటు సభ్యుడుగావున్న వీరిని రాష్ట్ర ముఖ్యమంత్రి పదవికి కేంద్రనాయకులు ఎన్నిక చేశారంటే, వచ్చే ఎన్నికలలో తమ పార్టీని విజయవంతంగా నడపగల నాయకుడు ఎవరూ రాష్ట్ర శాసనసభ్యులలో కేంద్రనాయకులకు కనపడనట్టే కదా!

అసలు, చెన్నారెడ్డిగారిని తొలగించి అంజయ్యగారినీ, అంజయ్యగారిని తొలగించి భవనం వెంకటరాంగారినీ, భవనం వెంకటరాంగారిని తొలగించి విజయభాస్కరరెడ్డిగారినీ రాష్ట్ర ముఖ్యమంత్రులుగా నియమించడం, రెండున్నర

సంవత్సరాలలో జరిగింది. ఇంత స్వల్పకాలంలో నలుగురు ముఖ్యమంత్రులు మారడం ఏ రాష్ట్రానికి మంచిదికాదు. పైగా, ఆఖరు ముఖ్యమంత్రి పదవిలో వున్నది ఆరున్నరమాసాలు. శాసనసభలో మూడింట రెండువంతులకు పైగా బలంవున్న పార్టీ నాయకత్వాలలో ఇన్ని మార్పులు, ఇంత స్వల్పకాలంలో జరగవలసివచ్చిందంటే, ఆ పార్టీ సభ్యులలో ఏకీభావం ఏమాత్రం లేదని స్పష్టమౌతున్నది.

ముఖ్యమంత్రి మారినప్పుడల్లా తనకు ఆ పదవి రావడానికి మద్దతు ఇచ్చినవారికీ, ఇకముందు మద్దతు ఇవ్వరేమో అనుకున్నవారికీ, కేంద్ర నాయకులలో కొందరికి యిష్టమైనవారికీ మంత్రిపదవులను ఇవ్వవలసి వచ్చేటప్పటికి, మంత్రిమండలి సభ్యులసంఖ్య విస్తారంగా పెరగడం జరుగుతుంది. అంజయ్యగారి మంత్రిమండలిలో 61మంది మంత్రులు వున్నారంటే అంతకన్న విడ్డూరం మరొకటి లేదు. ఈ విధంగా ఏర్పాటయిన మంత్రిమండలులవల్ల, ఈనాడు దాదాపు 150మంది మాజీ మంత్రులు నేటి శాసనసభలో వున్నారు. "జ్ఞాతాస్వాదో వివృత జఘనాం కా విహాతుం సమర్థః" అన్నట్టుగా, మంత్రిపదవిని ఆస్వాదన చేసినవారెవరూ, ఆ పదవిని వదిలిపెట్టటానికి ఇష్టపడరు. ఒకవేళ బలవంతంగా వారిని తొలగించినా లేక మార్పులలో వారిని చేర్చుకోకపోయినా, వారు ఆ పదవికోసం తంటాలుపడుతూనే వుంటారు. వీరుకాక, పదవిని ఆస్వాదించని వారున్నారు. వారికీ ఆ ఆస్వాదన కావాలి. అంచేత, వారూ ఆ పదవులకోసం తంటాలుపడుతూ వుంటారు. వారి మాటేమిటి? ఆ లెక్కలో పార్టీ సభ్యులందరికీ మంత్రిపదవులను ఇవ్వడం సాధ్యమౌతుందా!

ప్రజాసేవకు కంకణం కట్టుకున్నవారికి పదవీవ్యామోహం వుండకూడదు. కాని, యీనాడు ప్రజాసేవ ఎవరికి కావాలి? పదవీస్వీకారమే కావాలి. ఏ పార్టీ అయినా అంతే. ప్రజాసేవ చెయ్యడానికీ, ప్రజలను వుద్ధరించడానికీ నన్ను ఎన్నుకోండి అని చెప్పేవారెవరినీ నమ్మకూడదు. శాసనసభ్యుడు కాకుండా, మంత్రి కాకుండా, ప్రజాసేవ చెయ్యడం ఏ వ్యక్తికీ సాధ్యంకాదా?



శ్రీ కె. విజయభాస్కరరెడ్డి.

పటిష్టమైన పార్టీ నాయకుల బాధ్యత అక్కడే వుంది. మా పార్టీలో చేరినవారందరికీ పదవులు వుండవు; నాయకుల నిర్ణయప్రకారం నడుచుకొనేటట్లయితేనే మా పార్టీ అభ్యర్థిగా నిలబెడతాం ; అనే పద్ధతిలో పార్టీ అభ్యర్థులను నిలబెట్టి వారిలో సమర్థులైనవారినీ, పార్టీకి అప్రతిష్ఠ తెచ్చే పనులను చెయ్యని వారినీ పదవిలో పెడితే ఆ పార్టీకి దేశానికి మంచిది.





# నవ్వండి!-నవ్వించండి!!

"ఏమిటే మీనాక్షీ! ఈ నెక్లెస్ ఇంత నల్లగా వుంది?"

"అదికాదే కామాక్షీ! దాన్ని బ్లాక్‌మనీ పెట్టి కొన్నాం!"

—కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు

## దొంగ

"శాస్త్రీ! మీ ఇంటిలో దొంగతనం జరిగిందా?"

"అవును స్వామీ! మీ మహిమ తెలుసుకొని ఇక్కడకొచ్చాను."

"ఫరవాలేదు! ఈ విభూది ఇస్తాను, ఆ దొంగవెధవ ఎక్కడున్నాడో వెదికి వెదికి వానిపై చల్లు, అంతే నీ ధనం తప్పక ఇస్తాడు."

—కమల్, సూర్యాపేట.

శాస్త్రి బావమర్ది, శాస్త్రినిలా అడిగాడు—

"ఏమిటోయ్? మీ ఆవిడకి మెళ్ళోకి, చెవులకి చేయించకుండా ముందు ఘల్ ఘల్ మంటూ గజ్జలు చేయించావేమిటి?"

"అవును మరి! లేకపోతే చదివేప్పుడు లేకుండా నా రూమ్‌లోకొచ్చేస్తుంది! ఇప్పుడైతే ఎంచక్కా ముందుజాగ్రత్త తీసుకోవచ్చు." అన్నాడు శాస్త్రి.

— పుచ్చా లక్ష్మీనారాయణ, వర్సిటీ.

## ఒకేమారు

"రవాణా సదుపాయాలు, కుటుంబ నియంత్రణా కార్యక్రమాలు ఒకే మారు అమలుజరిపే ఏకైక సంస్థ ఏది?" అడిగాడు రాము.

"భారతీయ రైల్వేలు" చెప్పాడు సోము.

— దాశరథి లక్ష్మి, కొలన్‌పాక.

తండ్రి: ఏరా! నే చూసిన అమ్మాయికి ఏం తక్కువని ఆ అమ్మాయి నచ్చలేదంటున్నావ్? ఆ అమ్మాయి ధనవతి, రూపవతి, అభిమానవతి. నోర్మూసుకుని ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకో తెలిసిందా?

కొడుకు: నీవు చెప్పినవాటితో బాటు ఆ అమ్మాయి గర్భవతి అని కూడా తెలిసింది నాన్నా. —యస్ శ్రీనివాసమూర్తి నెల్లూరు.

# యువ

## 1982 దీపావళి ప్రత్యేక సంచిక

దీపావళికి ముందు వెలువడుతుంది. విడి ప్రతి రు. 10-00. కావలసినవారు రు. 10-00 + రిజిస్టర్డ్ పోస్ట్ చార్జీలు రు. 2-75 పంపి కాపీ తెప్పించుకోవచ్చు. లేదా మీ దగ్గరలో వున్న యువఏజంటుకు చెప్పి రిజర్వు చేసుకోండి.

ఇండెంట్లు పంపని ఏజంట్లు, తమ ఇండెంటుతోపాటు కమీషన్ సొమ్ము మినహాయించుకుని, డి.డి.తోపాటు ఇండెంట్లు అక్టోబర్ 10వ తేదీ లోపల మాకు చేరేట్లు పంపాలి.

—సర్క్యులేషన్ మేనేజర్,
యువ.

మీ నూతన గృహానికి పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపరా?



Yuva (Telugu Monthly)



# గెలుపు

మల్లాది వెంకట కృష్ణమూర్తి



విజయవాడ,
1-11-1981.

డియర్ రంగ.

మేము క్షేమం అని తలుస్తాము. ఇక్కడ మీ నాన్న, అమ్మ, చెల్లాయ్ కులాసా. నీనుంచి వుత్తరాలు వచ్చి చాలాకాలం అయిందని చెప్పారు మీ నాన్న. ఎలా వున్నావ్? బాగా చదువుతున్నావా? హాస్టల్ జీవితం ఎలా వుంది? వివరంగా జవాబు రాయి. మీ చెల్లాయ్‌కి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు.

నీ
మామయ్య

అన్నట్లు ఈ ఉత్తరంతోపాటు ఏభై రూపాయలనోటు జత చేస్తున్నాను దీన్ని రిజిస్టర్డ్ పోస్ట్‌లో పంపుతున్నాను. ముట్టగానే జవాబు రాయి. నీ ఖర్చుకి వుంచుకో.

కాకినాడ,
3-11-1981.

డియర్ మామయ్యా,

నీవు రాసిన వుత్తరం అందింది. నేను బాగానే చదువుతున్నాను. చెల్లాయ్‌కి పెళ్ళిసంబంధాలు చూస్తున్నారని చదివి సంతోషించాను. నాకు వచ్చే నెల ఇరవై ఏడునుంచి పరీక్షలు. ఆ హడావుడిలో వుత్తరాలు రాయలేదు. నీ వుత్తరం రిజిస్టర్డ్ పోస్ట్‌లోనే వచ్చింది. కాని

దాంట్లో ఏభై రూపాయలనోటు పెట్టడం మర్చిపోయినట్లున్నావ్.

యువర్స్ ఎవర్
రంగ.

విజయవాడ,
5-11-1981.

రేయ్ రంగా,

పుత్తరం రాయాలంటే నీకు తగని బద్ధకం. నే రాసే పుత్తరానికి జవాబివ్వవని నీ చెల్లాయ్, ఇస్తావని నేను పాతిక రూపాయలు పందెం వేసుకున్నాం. కావాలనే ఏభై జతచేయకపోవడంతో నేను అనుకున్నట్లే పుత్తరం వెంటనే రాసావ్. పందెంలో నన్ను గెలిపించావ్. థాంక్స్.

నీ
మామయ్య.

ఇది మామూలు పోస్టులోనే పంపుతున్నాను. ఏభై జత చెయ్యలేదు కాబట్టి.

—

సెప్టెంబరు నెల భావపరిచయ పోటీ

రు. 25.00 బహుమతి పొందిన వ్యాఖ్య

''రొయ్యమీనం ఆరాఫుటం
పొద్దుతిరుగుడుపువ్వు వాటం''

—పినిశెట్టి శ్రీనివాసరావు,
వరంగల్.

కేప్టెన్ కథ (సీరియల్)

అంకితం

నా కథా కథనంలో నా కక్షరాలు నేర్పిన నా (కథల) సాహితీ గురువు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారికి వినయంగా — (ఆయన అంగీకారంతో).

—వీణాదేవి.


ఇంతకీ ఎందులో జాబ్ చేస్తున్నాడు ?
రేషన షాప్‌లో!!
శేఖర్


అవును సుమా. ఇరవై ఏళ్ళ క్రితం మనిద్దరికే పది హేనేళ్ళు.

# శాంతిపాప జాతక చక్రం



దివ్యప్రభాకర్

శవం ఊరేగింపు కదిలింది. రోడ్డునిండా సందులేకుండా జనం ట్రాక్టర్ వెనక ట్రయిలర్‌మీద చెక్కలు పరిచి, దాని మీద శవాన్ని పడుకోబెట్టారు. శవం తల వేపు ఎత్తుగా అమర్చటం వల్ల శవం ముఖం అందరికీ స్పష్టంగా కనిపిస్తోంది. దండలూ, పూలూ ముఖాన్ని కప్పెయ్యకుండా కార్యకర్తలు ఎప్పటికప్పుడు సర్దుతున్నారు. ట్రాక్టర్ మెల్లిగా కదులుతోంది.

ముందు చావు మేళం నౌబత్‌ఖానా దాని ముందు పెద్ద పెద్ద డ్రమ్ములు ధన్ ధన్ మని గుండెలవిసేట్టు మోగుతున్నాయి. ఇంకా ముందు పలుగురు కుర్రాళ్ళు తారాజువ్వలు వెలిగించి పైకి వదులుతున్నారు. పదిపది హేనుమంది బాగా తాగి తూలిపోతూ చిందులు వేస్తూ గుండ్రంగా తిరుగుతున్నారు. మరో ఇరవైమంది కుర్రాళ్ళు నినాదాలు రాసిన అట్టకట్టిన కర్రలు పట్టుకుని రెండు వరసలుగా నడుస్తున్నారు. అందరి ముఖాల మీదా విషాదం, దుఃఖం—కొందరు కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు.

శవం బతికుండగా దాని పేరు సత్యం.

"సత్యాన్ని చంపినవాడు చావాలి, లేదా చంపాలి."

"డబ్బుకోసం, అధికారం కోసం ఆడదాన్ని అమ్ముకునే నపుంసకులు నశించాలి."

"సింహాలమేడలోని వరాహాల మెడలు కత్తిరించాలి."

"నల్లడబ్బు కుక్కల, పెప్పు రక్తం కక్కాలి."

—ఇలా ఉన్నాయి అట్టలమీద రాతలు!

మరి కొందరు నినాదాలు చేస్తున్నారు. జనం వాటిని ప్రతిధ్వనిస్తున్నారు.

"మరణానికి.... మరణం"

"ప్రాణానికి....ప్రాణం."

"రక్తానికి... రక్తం."

"శవానికి.. శవం"

"హంతకుడెవడూ?....అడుగోవాడే!"

కంట్లో పొడిచినట్టు చూపుడువేళ్ళతో జనమంతా ఓ దిక్కుగా చూపిస్తున్నారు. కానీ అక్కడెవడూ లేడు.

శవ శకటం మెల్లిగా కదులుతోంది. జనఘోష తీవ్రంగా రేగుతోంది. ఉద్రేకం ఉప్పెనలా పొంగుతుంది.

ట్రాక్టర్ మీద శవం పక్కగా మైక్ చేత్తో పట్టుకుని ఓ యువకుడు నిల్చున్నాడు. అతని పేరు క్రాంతినాధ్. అతను నినాదాలు ఇవ్వటంలేదు. ఏడ్చి ఏడ్చి, కన్నీరు కార్చి కార్చి అతని కళ్ళు ఉబ్బి నెత్తురు చిమ్ముతున్నాయి. అయినా అతని ముఖం మాత్రం ప్రశాంతంగా వుంది. అతని ముఖం శవం ముఖమంత ప్రశాంతంగా వుంది. కానీ శవం ముఖంలా లేదతని ముఖం!!!

"సోదర సోదరీమణులారా!" అన్నాడతను

"ఓయ్ ఓయ్...." జనం అరుపులు, కేకలు, గోల, గగ్గోలు.

"అన్యాయానికి ఏడవటమంటే న్యాయాన్ని ప్రేమించటం కాదని మీ కందరికి తెలుసునని మీ ఉద్రేకాన్ని చూస్తే అర్థమౌతోంది. మీ ఉద్రేకం. మీ బిగిసిన పిడికిళ్ళు మిమ్మల్ని ఉగ్ర నరసింహమూర్తులుగా చేస్తున్నాయి— చూస్తున్నాను. మీకే సింహం పంజా వుంటే ఎంత మదించిన ఏనుగునైనా ఇప్పుడు తుత్తునియలు చేయగలరు. మీ అందరి గుండెలూ రగులుతున్నాయి. గుండెల్లో మంటలు రేగుతూ వుంటే నోట్లోంచి వచ్చేది నిప్పురవ్వలే—నాకు తెలుసు. కానీ....మనది గాంధీ పుట్టిన దేశం. బుద్ధుడు పుట్టిన దేశం. జైనదేవుడు పుట్టిన దేశం, వీళ్ళంతా పుట్టిన దేశంలో మనమూ పుట్టాం! పురుగులు చస్తాయని దీపాలు వెలిగించం. నోటికి చేతికి మధ్యలో రాబందు దూసుకుపోతే 'ఖర్మ' అనుకుంటాం. రోజంతా పనిచేయించుకుని కూలి ఇవ్వకుండా కాలితో తంతే 'బానిస' నంటూ వెనక్కి పడతాం. వల్లడబ్బు మూలగబెట్టి, తెల్లబట్టలు కట్టుకుని, ఎర్రగా నవ్వితే 'అదృష్టవంతులు' అనుకుంటాం. చిటికెన వేలితో చిటికెడు మెతుకులు విదిలిస్తే చర్మంతో చెప్పులు కుట్టిస్తాం. ఎందుకు? మనం గాంధీపుట్టిన దేశంలో పుట్టినందుకు! శాంతి, సహనం, అహింసల్ని మన రక్తంలో కెక్కించుకున్నందుకు.. అందుకే, అందుకే మీ ఉద్రేకం పెదవులకే బాధ! మీ పరుగు మీ కాళ్ళకే నెప్పి!"

"కాదు, కాదు, కాదు" అరుపులు, కేకలు, గోల, గగ్గోలు.

"వినండి, అంతా వినండి. జరిగిందంతా మళ్ళీ మళ్ళీ వినండి."

"వింటాం... వింటాం...."




"అరుగో, మన సోదరులు. ఓ ప్రేమ లేఖ ఫోటోస్టాట్ కాపీల్ని పంచిపెడుతున్నారు. తీసుకోండి. చదవండి.... చదివించుకోండి....వినండి..." క్రాంతినాథ్ అగాడు. కుర్రాళ్ళు కాపీలు అందరికీ పంచిపెడుతున్నారు. కలకలం సద్దుమణిగిన తర్వాత క్రాంతినాథ్ కథ చెప్పటం మొదలుపెట్టాడు.

• • •

సత్యం, క్రాంతినాథ్, మరో పదిమంది ఆ వూరి కుర్రాళ్ళు ఒకే సంవత్సరం కాలేజినుంచి బయటికొచ్చారు. కాలేజినుంచి బయటికి రావడానికి, ఏదైనా ఆఫీసులో అడుగుపెట్టడానికీ మధ్య ఎన్నేళ్ళు గడుస్తాయో తెలీదు. ఈలోగా ఏదో చెయ్యాలి ఏం చెయ్యాలి? దేశాన్ని బాగుచెయ్యాలన్నారు కొందరు. 'అది మనవల్ల కాదు_ మన ఊరు సంగతి చూసుకుంటే చాలు' అన్నారు మరి కొందరు.

ఆ రోజుల్లో సత్యానికి ఓ కల వొచ్చింది, ఆ కలలో ఓ పెద్ద షాపు కనిపించింది. లోపలంతా ఏవేవో ఉన్నాయి, అతను లోపలికెళ్ళాడు. అక్కడో దేవత లాంటి అమ్మాయి నిల్చుంది. "ఏంకావాలి?" అనడిగింది. "ఏముంటా యిక్కడ?" అనడిగాడు సత్యం. "అన్నీనూ!" అంది ఆ దేవత. సత్యం కొంచెంసేపు ఆలోచించి అడిగాడు: "నా దేశం సుభిక్షం కావాలి. నా ప్రజల్లో సమానత్వం కావాలి. నా ప్రజలకి సుఖశాంతులు కావాలి..." అంటూంటే ఆ దేవత అతన్ని ఆగమని చెయ్యెత్తి "అబ్బాయ్! ఇక్కడ పళ్ళు అమ్మరు.

వి త్తనాలు మాత్రమే ఉంటాయిక్కడ. కావాలంటే తీసుకెళ్ళ" అంది. అప్పుడు సత్యం వీరుడాల మీద పేర్లన్నీ చదివి 'కృషి', 'దీక్ష', 'ధైర్యం', 'క్రాంతి' అనే విత్తనాలు కొనుక్కుని బయట కొచ్చేశాడు.

సత్యం తన కొచ్చిన ఈ కలని అందరికీ వివరించాడు యువకులంతా ఉత్తేజితులయ్యారు. సంఘం పెట్టారు. ఆ చిన్న పట్టణంలో సరుకులు దాచినవాళ్ళ పని పట్టారు. రూపాయి వస్తువుని రెండు రూపాయలకి అమ్మేవాళ్ళ భరతం పట్టారు ప్రజల్ని క్యూలో నిలబెట్టారు. నిలవసరుకు నంతటినీ, నిర్ణీతమైన రేట్లకు అమ్మించారు. 'ఇలాంటి పన్లు చెయ్యమనేగా ప్రజలంతా అడుగుతున్నారు. ఇలాంటి బాధ్యత వహించమనేగా ప్రభుత్వంయువతరాన్ని ప్రబోధిస్తోంది' అని అడిగారు-అడ్డం వచ్చినవాళ్ళని! దాహానికి గ్లాసుడు నీళ్ళు చాలు. కానీ ధనదాహానికి! ఇటునుంచి అటు తిరుగుబాటుకి ప్రతిగా - అటునుంచి యిటు తిరుగుబాటు మొదలయింది! జీర్ణశక్తికి మించిన తిండిగలవాళ్ళంతా — తిండికి మించిన జీర్ణశక్తి గలవాళ్ళ మీదికి తిరుగుబాటుకు తయారయ్యారు.

నరహరి 'కాయకొంయ' వ్యాపారి. కాయకొంయ అర్జించి బజార్లకి బజార్లు కొన్నవాడు. — 'నరహరి' అంటే నరసింహం కాదురా, నరులను హరించుహాడని! 'అని కుర్రాళ్ళు అర్థం చెప్పుకున్నారు. నరహరే కాదు, ధనహరి, మానహరి, ప్రాణహరి — అని కూడా వ్యాఖ్యానించుకున్నారు. 'పందులు బలిసే చోట గొర్రెలు చిక్కిపోకేందేస్తాయి' అని తిట్టుకున్నారు. కాని నరహరి అంత లావు వ్యాపారి అయి, రాజకీయం చెయ్యగలడని చాలా ఆలస్యంగా తెలుసుకున్నారు!

ఓ రోజు నరహరి చెల్లెలు పద్మిని సత్యాన్ని చూసి నవ్వింది. నిరుపేద సత్యాన్ని చూసి గొప్పింటి పద్మిని నవ్వింది.

—కథ అంతవరకు చెప్పి "సత్యం ఫొటో కాపీలు వొచ్చాయా!" అనడిగాడు క్రాంతినాధ్.

"వొచ్చాయి, వొచ్చాయి."

"చూడండి, మన ఫొటోస్టూడియో మిత్రుడు, సత్యం ఫొటోల్ని రెంటిని పక్కపక్కన ప్రింటుచేశాడు. మొదటి ఫొటో నరహరి యింట్లోకి వెళ్ళిన సత్యానిది! రెండోది ఊరిబయట మనకి దొరికిన సత్యం శవానిది! సోదరులారా! ఉద్రేకపడకండి .... మనది గాంధీ పుట్టిన..." అంటూ క్రాంతినాధ్ మళ్ళీ కథ మొదలుపెట్టాడు! కానీ జనం అరుస్తున్నారు

"పద్మిని నవ్విందా? .... పద్మిని సత్యాన్ని ప్రేమించిందా?.... దావర్

ఏదవ!.... ఛూత్ చెల్లెల్ని....” అరు పులు, కేకలు, గోల.

“కాంతి, కాంతి, వినాలి........”

............

'మాయలో పడుతున్నావురా సత్యం' అని అతని మిత్రులు, మిగతా సంఘ సభ్యులు హెచ్చరించారు. 'ఆమె అంద గత్తె- కనక ప్రేమించాను. ఆమె అదది- కనక జయించాను' అన్నాడు సత్యం సత్యం రాజకీయంలో సత్యం కోసం వెదికాడు. నరహరి సత్యంకోసం రాజకీయం నడిపాడు.

“ఎందుకొచ్చిన సంఘ వోయ్, ఉద్యోగం చేసుకోక!” అన్నాడు నరహరి.

“దొరకొద్దా?”

“నువ్వు ముందా రొంపిలోంచి బయటపడు, మర్నాటికి ఉద్యోగం వేయిస్తా....”

“అలా కాదండి. నేను ఉద్యోగానికి వెళ్ళినా సంఘంమాత్రం ఉంటుందండి.”

“ఉండదు. నువ్వే నాయకుడివి. సమ ర్థుడివి” అన్నాడు నరహరి.

“ఏదోవి ఉద్యోగం చెయ్యరాదా- అన్నయ్య చెప్పినట్టు” అంది పద్మిని తోటలో సన్నజాజి పందిరికింద.

“సంఘం సంగతి నువ్వు మాట్లా డకు. నన్ను పెళ్ళిచేసుకుంటానన్నావు. మీ యింటికి వొస్తున్నా. చేసుకోవంటే రాను. అంతే!” అన్నాడు సత్యం వికసించిన్నగా.

“రానంటు. నిన్ను చూడకుండా ఉండలేను” అంది పద్మిని.

ఆ రోజుల్లోనే ఓ రోజున రాజకీయ నాయకులు నరహరికి గెస్టులుగా వొచ్చారు తిన్నారు. తాగారు. తిన్నారు గనక తేన్చారు. తాగారు గనక తూలారు. తేన్చుతూ తూలుతూ ఏమేమో వాగారు. ఆ వాగుడులో ఇంకేదో కావా లన్నారు. కావాలన్నదేదో నరహరికి తెలి సింది. వాళ్ళనుంచి నరహరికి కావాల్సిం దేదో నరహరికి తెలుసు. నిమిషాలమీద నౌకర్లనీ, చాకర్లనీ, బేరర్లనీ, డాఫర్లనీ పొమ్మన్నాడు. అందరికి ఉద్యోగం తనే అందిపుచ్చుకున్నాడు.

పద్మిన్ని పిల్చి 'కాపేపు వాళ్ళెదు రుగా చిరునవ్వులు చిందిస్తూ కబుర్లు చెప్పు' మన్నాడు! పద్మిని రానంది. సత్యం చంపుతానన్నాడు. 'పద్మిని నా భార్య' అని కూడా అన్నాడు. ఈ మూడు ముక్కలూ అతన్ని ఆ బంగళా నుంచి బయటికొస్తూ విన్నాడు- లక్ష్మణ అనే ఒక్కపక్టే ఓ భ్రతమనిషి. విన్నది విన్నట్టు సంఘంలో చెప్పాడు.

అంతే, అంతవరకే తెలుసు ప్రపం చానికి! అంతవరకే చెప్పాడు క్రాంతి నాధ్.

• • •

“కానీ.... సోదరులారా! పొద్దున్నే .... సత్యంశవం, ముఖం కాలిపోయి గుర్తుపట్టటానికైనా వీల్లేని సత్యంశవం

ఊరిబయట కాలవలో నీటివారగా.... చూశాం.... మనందరం చూశాం...."

"చూశాం.... చూశాం...."

"సత్యం ముఖం ఎందుకు కాలిపో యింది? సత్యం ప్రాణం ఎందుకు పోయింది? అని మీ అందరి ప్రశ్న- నాకు తెలుసు."

"అవును- మాకూ తెలుసు."

"అవును- మీకూ తెలుసు. అందుకే మీరు 'ప్రాణానికి ప్రాణం' అని ఇందాక నినాద మిచ్చారు."

"అవును.... ప్రాణానికి.... ప్రాణం; రక్తానికి.... రక్తం! శవానికి.... శవం" జనం గోల, గగ్గోలు!

"కానీ సోదరులారా! మనం గాంధీ, బుద్ధుడు...." క్రాంతినాధ్ అలా కొన సాగిస్తున్నాడు.

ఊరేగింపు నాలుగురోడ్ల కూడలికి చేరుకుంది. సెంటర్లో సిగరెట్ల కంపెనీ వారు పోలీసులకి విరాళమిచ్చిన గొడుగు కింద పోలీసు లేడు. సెంటరంతా జనంతో నిండిపోయింది. సెంటర్లో తూర్పువేపు పెద్ద భవంతే నరహరి తల దాచుకునే కొంప. ఆ కొండంత కొంప వరండాపైపే జనమంతా చూస్తున్నారు. అరుస్తున్నారు — "ప్రాణానికి.... ప్రాణం; శవానికి.... శవం; హంతకు డెవడు?.... అడుగో, వాడే!" కంట్లో పొడిచినట్టు చూపుడువేళ్ళతో జనమంతా ఆ దిక్కుగా చూపిస్తున్నారు. అందరి చూపుడువేళ్ళూ చూపుతున్న లక్ష్యం .... ఆ బిందువు.... ఆ బిందువే— నరహరి!

ఎలా వున్నాడయ్యా ఆ నరహరి?

చెక్కుచెదరని చిరునవ్వు! ప్రజలను ప్రేమతో ప్రశాంతంగా చూస్తున్న చూపులు! కారుచీకట్లనయినా కమ్మి వేయగల తెల్లని బట్టలు! ఏమాత్రం చలించని చక్కని అకుచెప్పుల పాదాలు! చేతుల్లో చెమ్కీ చుట్టిన చేమంతిపూల దండ!!!

"హంతకుడెవడు?.... అడుగో వాడే!" గగ్గోలు!

నరహరిగారి చుట్టూ చుట్టి నిలిచిన ఫోటోనాయకుల ముఖాల్లో ఆందోళన! వాళ్ళు ఆయనవంక తొంగిచూశారు. చూసి, ఆయన చిరునవ్వు చెదరక పోవటం చూసి ధైర్యం తెచ్చుకున్నారు. ఒక భక్తుడు మైకు తెచ్చి ఆయన నోటి దగ్గిర పట్టుకున్నాడు.

"ప్రియమైన పట్టణవాసులారా! నమస్కారం." ప్రహరీ గోడమీద అమర్చిన స్పీకరులోంచి ఆయన గొంతు గంభీరంగా, విషాదంగా వినిపించింది.

నెత్తుటి పొరల్లోంచి చూస్తున్న జనానికి హంతకుడు ఓ మాంసపు ముద్దలా కనిపిస్తున్నాడు.

జనంలో మౌనం. ఆ మౌనంతో జనం పేలబోయేముందు పెద్దబాంబులా... నిశ్చలంగా.... సముద్రంలో కెరటాలు ఎక్కడివక్కడ ఆగిపోయినట్టు!



వరహరి, ఆతనితోపాటు మైకు నోటిదగ్గరగా పట్టుకున్న భక్తుడు, వారితోపాటు అనుచరవర్గం వరండా నుంచి కదిలి వీధిగేటు వరకూ వచ్చారు. వస్తూన్నప్పుడే నరహరి చెప్తున్నాడు.

"మన ప్రియతమ యువజన నాయకుడు, మన యువకిశోరం, సత్యమూర్తి, సౌజన్యమూర్తి, శాంతిమూర్తి, అమేయ శక్తి, అనంతశక్తి..." ఇలా సాగింది ఆ సన్మానపత్రం. చివరికి "నేడు....

ఈ దుర్దినంనాడు. మనందరి పాలిట పాపిష్టిదినంనాడు " అంటూం టే అయ్యన కళ్ళు వర్షించటం మొదలెట్టాయి.

"పద్మిని ఏనాడూ రెండుమూడొందల రూపాయలకి తక్కువ ఖరీదుచేసే చీర కట్టదు. రకరకాల రాళ్ళు పొదిగిన హారం మెళ్ళో మెరుస్తుంటుంది ఎప్పుడూ జడనిండా పూలరాశి పేర్చినట్టుంటుంది! ఇంట్లో కూడా చెప్పుల్లేకుండా వేసు కుని తామా, భూదేవి కూడా చెక్కు చెదరకుండా నడుస్తుంది!

పద్మిని- జుట్టు విరబోసుకుని, ఏ అభరణం లేకుండా, తెల్లటి చీరె కట్టు కుని, చెప్పులు లేకుండా పరుగెత్తు తూంటే ఎలా వుంటుందో! ఎవరి ఊహకి అందుతుంది?

కానీ.... సరిగ్గా అదే తీరుగా, పాకత్తూ- నిలువెల్లా వికలమై అ ఇంట్లోంచి పరుగెత్తుకొచ్చి ఉపన్యాసం చెప్తున్న అన్నగారిని, అతని అను చరుల్నీ నెట్టిపారేసి, గేటుదాటి, రోడ్డు మీదున్న ట్రాక్టరెక్కి సత్యం శవం మీదపడి గోడుగోడున ఏడ్చేస్తోంది. అంతా- అరనిమిషంలో.... ఏం జరుగు తోందో కళ్ళు మెదడుకి చెప్పేలోగా జరిగిపోయింది.

"పద్మిని, పద్మిని...." జనం!

"పద్మినీ, పద్మినీ!...." నరహరి.... చరచర నడిచాడు ట్రాక్టరు దగ్గిరికి, కిందనుంచే చెల్లెలి చేతిని గట్టిగా ఒక్క గుంజు గుంజాడు.

అంతే!

ఎక్కడిది వక్కడ అగిపోయిన సముద్రపు కెరటాలు ఒక్కసారి పెళ్ళున విరుచుకుపడ్డాయి. యుద్ధం చేస్తున్న సైనికులంతా ఏ మంత్రానికో శిలలైపోయి, మళ్ళీ వెంటనే మనుషు లుగా మారి యుద్ధం చేస్తున్నట్టుంది.

ఎవరు ఎవరిని ఏం చేస్తున్నారు? ఏం జరుగుతోంది? కాలం అగిందా? నడుస్తోందా? ఎంత నడిచింది? ఎవరికి లెక్క?

తుపాకులు ధనధనా పేలుతున్నాయి.

"సోదరులారా మనదేశంలో గాంధీ, బుద్ధుడూ...."

ధన్ ధన్ ధన్!

ట్రాక్టరూ, దానిమీద శవం, దాని మీద వికలంతువూ, ఆ పక్కన మైకు చేతబట్టిన క్రాంతినాథ్.... అలా ఉండి పోయారు. కాదు, మిగిలిపోయారు. ఇక ఆ సెంటర్లో తుపాకులు పట్టిన పోలీ సులు తప్ప మరొక ప్రాణి లేదు. నాలుగు రోడ్లూ నిర్మానుష్యమైపోయాయి, ఏదా జనసముద్రం?

ట్రాక్టర్ముందు .... రోడ్డుమీద ఎండలో, ఎర్రగా పరుచుకుని పాకు తున్న నెత్తుటి పాములు! మెలికలు తిరిగి పాకుతున్న ఆ పాముల మధ్య మాంసపు

ముద్దలు... తలలాంటి ముద్ద! చెయ్యి లాంటి ముద్ద.... కాలులాంటి ముద్ద.... అక్కడొకటీ అక్కడొకటీ... ! కారు చీకట్లనైనా తమ్మివేయగల ఆ తెల్లటి బట్టల పేలికలు, పాలికలు—ఎర్రరపూలతో, ఎర్రంచులతో—రోడ్డునిండా!!!

రక్షకభటులకూ కూడా ఆశ్చర్యమే! భీతి! కనుగుడ్లు కదలని చూపులు!

ఎవరో ఏడుస్తున్నారు! 'నాయనా!' అంటున్నారు. ఎవరో అరుస్తున్నారు, 'నాదేవుడో!' అంటున్నారు! ఎవరో తలబాదుకుంటున్నారు. జుట్టు పీక్కుంటున్నారు. వెర్రికేకలు వేస్తున్నారు. అప్పుడు చూశారు చుట్టూ రక్షకభటులూ, క్రాంతినాథూ!!

అంత పెద్ద సెంటర్లో ఎన్నో శవాలు! ఎవరివో! సంఘసభ్యులా? సానుభూతి పరులా? సామాన్య ప్రజలా? ప్రేక్షకులా? ప్రతీకారం చూడాలని వొచ్చిన వాళ్ళా? ఎవరో? అమాయకులు! సాహసికులు! అమరవీరులు!!!

ఒక్క దుష్టుణ్ణి శిక్షించడానికి వంద మంది బలి! వందమంది బలిదాన ఫలితం ఒక్క దుష్టుడికి శిక్ష! ఇది నరజాతి చరిత్ర. నర-నరరూపరాక్షస సమరం.

చరిత్రలో ఏ కాలాన్ని గురించి ఏమీ వ్రాసివుంచదో—ఆ కాలంలో ప్రజలు సుఖంగా ఉన్నట్టు అర్థమట! మరి నడుస్తున్న చరిత్రలో ప్రతిక్షణం ఒక మహా చరిత్రేనే!

యుద్ధానికి లక్ష్యం శాంతి అయినప్పుడు ఇప్పుడా యుద్ధం తరువాత మిన్నంటుతున్న రోదనలలోనుంచి 'శాంతిపాప' పురిటి కేరింతలు కొడుతున్నట్టే! ఆ పాప కేరింతలకి ఇటు క్రాంతినాథ్, అటు పోలీసులు తృప్తిగా నిట్టూర్చారు.

ఒక దుష్టుడూ. వందమంది త్యాగులూ ఎక్కడున్నారో వెదకడానికి ముందడుగు వేస్తున్నాడు క్రాంతినాథ్!

లక్షలమంది ప్రజానీకంలో వంద మంది త్యాగులనబడే దోషులెక్కడున్నారో తుపాకులతో వెదుకుతూ పోతున్నారు పోలీసులు

ప్రేతాల చెవుల్లో ప్రేమ ఊపిరులు ఊదుతున్నారు, ప్రేమబంధాలూ, పేగు పోగులూ తెగిన నిర్భాగ్యులు!

నకనకలాగే పొట్టలతో నక్కలు వేటకొచ్చే సమయమయింది. కుందేళ్ళు గోళ్ళకు పదును పెట్టుకుని బలైపోయే వేళయింది. మరో శాంతిపాపకి జాతక చక్రం వేసే వేళయింది.



# నెత్తుటిపొత్తిళ్ళలో అక్షరం

జయధీర్ తిరుమలరావు

గతచరిత్రని ఔపోసన పడుతున్నాను
శిథిల స్తంభాలకు జీవంపోయాలని

పేలుతున్న పెల్లెలపీడల్లో ఎదుగుతున్నాను
వర్తమాన చైతన్యశకటాలకు పెట్రోలుబంకు కావాలని

మండుతున్న క్షణాల టాబ్లెట్లను
రక్తనాళాల్లో జీర్ణించుకొంటున్నాను
కాలనాళికల్ని తయారుచేయాలని

జనసంగీతం చైతన్యగీతంగా రూపొందడంకోసం
నేనింకా టాబ్లెట్లు మింగుతునే ఉన్నాను

ప్రజాశత్రువుల ప్రతిపరాజయాల దగ్గర
ఒక్కో విజయసంకేతంగా
ఒక్కో కాలనాళికను
గతంగా మలిచి
భవిష్యత్కోసం నిక్షేపించాలని
నెత్తుటిపొత్తిళ్ళలో అక్షరాలను సాకుతున్నాను

# పతనం పునాదిపై ప్రమద



బి భాను

'తారా! బస్సు వస్తుంది.... తప్పుకో'

అని కంగారుగా ఒక స్త్రీ గొంతు అదుర్దాగా విన్పించింది.

ఆ మాట విని స్కూలుకు వెళ్తున్న పురుషోత్తం కాళ్ళకు బంధాలు వేసి నట్లుగా ఆగిపోయి, వెనక్కి చూశాడు. బస్సు వెళ్ళిపోయింది. తొమ్మిదేళ్ళ నన్నవి పిల్ల రోడ్డు ప్రక్కనుండి వెళ్తున్నది. తెల్లరంగుగా ఉన్న పిల్ల! తొమ్మిదేళ్ళ పసిమొగ్గ!

ఈ తార ఆ కనకతార కాదు!

ఆ తార నల్లని కలువపువ్వు!

సుతారంగా నవ్వుల రాగాలు మ్రోగే సితార!

మనసులోని మూగబాధని కూడా పైకి చెప్పుకోలేని సిగ్గరి!

తన కంటిముందే సమస్యగా మిగిలి పోయిన పజిల్!

పురుషోత్తం మనస్సులో ఎప్పుడో జరిగిన సంఘటనలు ఒక్కటొక్కటిగా తరంగాలుగా అంతరంగంలో మంతనా లాడాయి—

—'ఊ....నురుగు వచ్చిందిగా.... వీళ్ళు పొయ్య....'

'అబ్బా! అంత వేణ్ణీళ్ళు పోస్తావేంటె సరూ! చన్నీళ్ళు తోలుపు.'

'అరే! మరీ చన్నీళ్ళా!....నీ కసలు తల ఇక్కడ లేదా!'

సన్నగా నవ్వుతున్న సవ్వడి!

'సంతోషించాం గాని....మూగ మొద్దులా మాట్లాడకుండా చిరునవ్వులా పైగా.... అఁ....వీపు తోము.... అన్నీ చెప్పాలా!'

చేతులు వీపును రుద్దుతున్నవి. ఆ వేళ్ళలో ఏదో వణుకు! పురుషోత్తానికి ఏమిటో కొత్తగా ఉంది. స్టూలు మీద నుంచి తల తిప్పి చూస్తే, వీపు రుద్దు తున్నది అర్ధాంగి కాదు! కనకతార! పెదాలు బిగబట్టి నవ్వును ఆపుకొంటున్న పదహారు వసంతాల మెరుపుతీగ!

'నువ్వా తారా! మీ అత్తయ్య ఏదీ?' అని లేచి నుంచొని చేతులు ఛాతికి అడ్డం పెట్టుకొన్నాడు.

'ఇంట్లోకి వెళ్ళింది మామయ్యగారూ... ఇంతకు ముందే.'

'మరి....నువ్వెందుకు.... పులుసు పోస్తున్నావు?' అన్నాడు చిరుకోపంతో.

'తప్పా మామయ్యగారూ!' అని తల వంచుకొన్నది.

'అరే...తప్పని కాదు తారా! నాకే సిగ్గు .. మీ అత్తని పిలు....'

అంతలో భార్య సరళ తిరిగివచ్చింది. తార సరళ వెనుకకు వెళ్ళింది.

'ఏంటీ? పులుసు పోసే పని తారకు అప్పగించి, మెల్లగా ఇంట్లోకి చెక్కే-శావ్? ఎంతసేపైంది నువ్వెళ్ళి?'

'అబ్బే! ఇప్పుడేనండీ... మొదటి సారి వడ్డిస్తున్నప్పుడు తల వెళ్ళలేదు గదూ? మీరే వడ్డించుకుంటున్నారా? అంతలోనే పప్పు మాడినవాసన వస్తే, వచ్చిన తారకు ఈ పని పురమాయించి వెళ్ళాను ... ఇంతలో ఏమైంది?'

'ఏమీ కాలేదులే....తార వడ్డిస్తుంటే వళ్ళు సిగ్గుపడిపోతుంటే, నువ్వు కాదని పించింది... అంతే!'

'అహా....తారా! నువ్వు వద్దిగే మహా ఇదైపోతున్నారట మామయ్యగారు ....ఇహ నేను చూస్తాలే....నువ్వెళ్ళు... అల్లం గుమ్మందగ్గరుంచాను....మీఅమ్మ చూస్తుంటుంది.' అని సరళ అంటే చిరు నవ్వులు చిందిస్తూ వెళ్ళింది కనకతార.

ఇంకో రోజు—ఆరోజు ఏదో పండుగ! తలంటుకొన్నందువల్ల నల్లని ముంగు రులు ముఖంమీద అల్లలాడుతుంటే, నల్లరంగు వోణీ వేసుకొని, కళ్ళకు కోసగా కాటుక తీర్చుకొన్న తారను చూడగానే నీలాన్ని నగిషీ పెట్టినట్లుగా ఉంది!

చేతిలోని పాత్రలో అమృతకలశాన్ని హస్తంలో పట్టుకొన్న దివ్యకాంతలా ఉంది!

తార తెచ్చిన పాయసాన్ని గ్లాసులో పోసి ఇవ్వగా రుచి చూసి, 'ఓహో! మధురాతి మధురంగా ఉంది తారా!' అన్నాడు పురుషోత్తం.

'నిజంగా....బావుందా మామయ్య గారూ!' అన్నది.

అవును... వస్తుగా ఉంది తారా! మీ అత్తయ్యకి కూడా ఇట్లా చేతకాదనుకో ... నువ్వా.... ఇట్లా పాయసం చేసే దానివి, ఎందుకు చదవలేకపోయావో అర్థంకావడంలేదు. వాళ్లో తరగతి పుస్తకాలు ఇచ్చానుగదూ చదువు తున్నావా? లేదా? మీ నాన్న మిషన్ నేర్పిస్తున్నాడని చెప్పావనుకో.... మంచిదేకాని....చదువుకూడా అవసరమే తారా! ఎందుకంటే ఇంట్లోగాని బయట గాని సంస్కారవంతంగా మాట్లాడ డానికి, మన అభిప్రాయాలు చెప్పడానికి చదువు ముఖ్యం. అందుకని మూడో

తరగతి వరకు చదివావు కాబట్టి నెమ్మదిగా చిన్న చిన్న కథలపుస్తకాలు చదువుతుంటే భాష వస్తుంది... అర్థంకాక పోతే మీ అత్తయ్యనిగాని, నన్నుగాని అడుగు....రోజుకో గంట ఎట్లాగో తీరికచేసుకొని చదవాలి. నీకు ఉపయోగపడుతుంది ముందు ముందు' అని సలహా ఇచ్చాడు పురుషోత్తం।

'అలాగే మామయ్యగారూ। తప్పకుండా చదువుతా' అని వెళ్ళింది తార.

— వెనుక నుండి లారీ హారన్ మోగగానే ఆనాటి సంఘటనల తంతువు తెగిపోయింది. అయినా పురుషోత్తం కలలో తార తల్లిదండ్రులు, వాళ్ళ ప్రవృత్తులు గుర్తుకొచ్చాయి.

తార సవతితల్లి నాగమ్మ; తండ్రి పుల్లయ్య. పురుషోత్తం ఉన్న పేటలో, అతని ఇంటికి దగ్గరగా అద్దెఇంట్లో ఉండేవాళ్ళు. నాగమ్మ బొద్దుగా, దబ్బపండు రంగుతో, హుందాగా, కంటికి విందుగా ఉండేది. పుల్లయ్య పల్లగా, పుల్లలాగా ఉండేవాడు.

చెంబు సరసన ముంతలాగున్నాడని చెప్పవచ్చు.

పుల్లయ్య దర్జీపని చేస్తూ బాగానే సంపాదిస్తున్నట్లు కనబడేవాడు. కనక తారను కన్నుల్లో పెట్టుకొని చూసుకొనే వాడు. సలహాలు ఇవ్వగల పెద్దమనిషని అందరూ అనుకొనేవాళ్ళు. అయితే ఇంటిలోని ముఖ్యమైన విషయాల్లో నాగమ్మ మాటే పైచేయిగా ఉంటుందట। ఉన్న దానితో సంతృప్తిపడే తత్త్వం పుల్లయ్యలో కనబడేది. అందుకు విభిన్నంగా జీవితాకాశంలో బ్రతుకనే అంతస్థుల్ని తేలిగ్గా పెంచుకోవాలనే తహతహ నాగమ్మలో ముమ్మరంగా కనబడేది. సొంత ఇల్లు। కొంత బంగారం। వంటి మీద మెరిసే వస్త్రాలు। చేతినిండా రెవరెపమనే నోట్లు। ఇటువంటి తలకు మించిన ఖరీదైన కోర్కెలు ఆమెలో అంతర్గతంగా ఉన్నట్లు మాటలవల్ల వ్యక్తమయ్యేది.

మధ్యతరగతి కుటుంబీకుల కోర్కెలు కళ్ళాలు తెగిన గుర్రాలు। ఎన్నటికీ తరగని మారాలు। కాబట్టి నాగమ్మ కోర్కెలు అసమంజసం కాదనే భావంతో పురుషోత్తం నవ్వుకొనేవాడు. సుఖంగా బ్రతకాలనే ఆరాటం ప్రతి మనిషి సహజ లక్షణం. కానీ ఆ సుఖంకోసం జీవితాన్ని కోర్కెల కొలిమిగా చేసుకోడం అవివేకమే అవుతుంది. అశ్వమేధం గుఱ్ఱాన్ని విచ్చలవిడిగా వదిలేస్తే ఎదురయ్యే పర్యవసానాలు ఎటువంటి విషాదాన్ని ఆహ్వానిస్తాయో అనుభవంతోగాని తెలుస్తుందని పురుషోత్తం ఉద్దేశం. అటువంటి తన ఉద్దేశాన్ని పుల్లయ్య దంపతుల దగ్గర ఎన్నడూ ఎత్తలేదు. పైపెచ్చు నాగమ్మ ఆ అవకాశం ఇవ్వనూ లేదు।

కొన్ని నెలలైన తర్వాత అక్కడ










సరిగా గిట్టుబాటు కావడంలేదని, నీళ్ళు సరిపడడంలేదని, పుల్లయ్య దంపతులు విద్యానగర్ కాలనీలోకి మారిపోయారు. మారిపోయే సందర్భాన తార పురుషోత్తం ఇంటికి వచ్చి, అప్పుడప్పుడు వాళ్ళ ఇంటికి రావలసిందిగా అభ్యర్థించి వెళ్ళింది. తార ప్రదర్శించిన ఆప్యాయత, గౌరవం పురుషోత్తం దంపతుల్ని కదిలించివేశాయి.

ఆ తర్వాత కొన్నిసార్లు పురుషోత్తం పుల్లయ్య ఇంటికి వెళ్ళాడు భార్యతో కలసి. వాళ్ళు ఎంతో సాదరంగా ఆహ్వానించారు. తార అయితే వాళ్ళ రాకతో పండుగ జరిగినంత సంబరపడేది. క్రమంగా వాళ్ళల్లో ఏదో మార్పు వస్తున్నట్లు పసికట్టాడు. దానికితోడు బాగా మార్పు కనబడింది తారలోనే! తార ఒళ్ళుచేసింది. కంటికి కమనీయంగా కనబడుతున్నది. శరీరంలోని ఎత్తుపల్లాలు చిత్తాల్లో దాగుడుమూత లాడుతున్నాయి. 'ఉఫ్' అంటే ఎగిరిపోయే రంగురంగుల జిలుగు వస్త్రాలు ఆమె అందాన్ని దాయడానికి వృథాశ్రమపడుతున్నాయి. నల్లని మెరుపుతీగలాగా ఉన్న తార ఎర్రని కోర్కెల్ని ఎగజిమ్ముతున్నది!

కొంతకాలం గడచిన తర్వాత, ఒక నాటి సాయంత్రం....

పురుషోత్తం స్కూలునుండి వస్తుండగా రిక్షాలో నాగమ్మ, తార ఎదురయ్యారు. రిక్షా ఆగింది. నాగమ్మ దిగింది. తార తలవంచుకొన్నది. కాని ఆమెలోని అందం తలఎత్తి చూస్తున్నది. తలలో కుడివైపున అరవిచ్చిన గులాబిపువ్వు! వాలుకన్నుల్లో షోగ్గా తీర్చిన అంజన రేఖలు!

'అమ్మాయిని డాక్టరు దగ్గరికి తీసు

కొని వెళ్తున్నాను.... అన్నయ్యగారూ ...' అని నాగమ్మ అన్నప్పుడు పురుషోత్తం ఆశ్చర్యపడ్డాడు.

ఎన్నో ప్రశ్నలు నాలుక చివరిదాకా వచ్చి, పర్యవసానం తెలియక వేసుకోవాలి అని ఆగిపోయాయి. నాగమ్మ ఆ మాట అంటున్నప్పుడు ఇంకా తల దించుకొంటున్న తార తీరు గమనించి, చెప్పగూడనిది కాబోలు అని అనుకున్నాడు. ఆ సంగతే భార్యతో అంటే ఆమె పెదవి విరచింది.

అదేవిధంగా కొన్నిసార్లు తల్లితో తార తటస్థపడింది. తల వంచుకునే కూర్చునేది కాని పురుషోత్తాన్ని కన్నెత్తి చూచేది కాదు. ఒకనాడు సన్నిహితంగా పలకరించిన తార, రాతిబొమ్మలా అయిందేమిటా అని పురుషోత్తం ఆలోచనల్లో కొట్టుమిట్టాడి, ఆ సంగతే భార్య దగ్గర ప్రస్తావిస్తే, 'తార పెద్దదవుతున్నదనే మాట మరచిపోతే ఎట్లా?' అన్నది.

ఒకనాడు పుల్లయ్యతో నడచివస్తున్న తార ఎదురైంది. ఇదివరకటి కంటే ఆమెలోని అందం ద్విగుణీకృతమైంది. చూచేవాళ్ళ 'పులికన్నులకు' లేడిలాగా కనబడుతున్నది తార. ఆమె ఆరోగ్యం మాటేమిటి?

చిరునవ్వుతో ఆగాడు పురుషోత్తం. కంగారుగా నిలబడ్డాడు పుల్లయ్య.

'అమ్మాయిని డాక్టరమ్మ దగ్గిర చూపిస్తున్నామండి....' అన్నాడు పుల్లయ్య. అతని గొంతులో ఏదో అడ్డు










పడినట్లుగా అనిపించింది.

'అసలు ఏమైంది తారకు? ఏమంటున్నది డాక్టరమ్మ?' అని ఆదుర్దాగా అడిగాడు పురుషోత్తం. ఆ మాట అడుగుతుండగా తార నాలుగు అడుగులు వెళ్ళి,

పమిట నిండుగా కప్పుకొని, తల వంచుకొని అటుతిరిగి నిలబడింది. పురుషోత్తానికి మండిపోయింది. మాటాడితే నోటి ముత్యాలు రాలిపోతాయా అనుకొన్నాడు.

'ఏంటంటె అదేనంట కేన్సరు ఎడంపక్క ఛాతిలో పుంట బాబుగారు...' అన్నాడు పుల్లయ్య ఊపిరి బిగబట్టుకొని.

పురుషోత్తానికి నెత్తిమీద పిడుగు పడినట్లైంది. 'భగవంతుడా! ఏమిటి నీ లీల!' అని మనస్సులో అనుకొన్నాడు. అతని మనస్సు సిక్ అయిపోయింది. 'అందానికి మచ్చలుపెట్టే భగవంతుడా! ఇంతకన్నా ఏం చెయ్యగలవులే!' అని మళ్ళా దేవుడిమీద ద్వేషం కనపర్చాడు.

'పుల్లయ్యగారూ! అదుగో రిక్షా.... ఎక్కండి' అన్నాడు తారను ఆపాద మస్తకం చూస్తూ. వెళ్తున్న రిక్షాలో నుండి తార ఒక్క క్షణం చూసినట్లని పించింది. పురుషోత్తం గుండెలో ఎక్కడో, ఏదో బాధ కలుక్కుమంది. ఇంటికి వెళ్ళి భార్యతో ఈమాట అంటే ఆమె కన్నులు ఆర్ద్రమైనాయి.

ఎందుకనో ఆరోజు తర్వాత తారతో ఆమె తల్లిదండ్రులు అదివరకులా కన బడలేదు. దానికి తోడు పురుషోత్తం దంపతులు, పుల్లయ్య కుటుంబాన్ని గురించి విడ్డూరమైన విషయాలు విన వలసి వచ్చింది. వాళ్ళు ప్రస్తుతం ఉన్న ఇంటిని, ఇంటి పక్కన ఉన్న స్థలాన్ని కొన్నారని ఒకరంటే, తార, నాగమ్మలు తా ళ్ళహా రా ల తో తులతూగుతున్నారని ఇంకొకరన్నారు. తల్లీకూతుళ్ళు కట్టని బట్టలు లేవని ఒక అమ్మ అంటే, పైసా లేని నాగమ్మ ఇప్పుడు వడ్డీకి డబ్బులు తిప్పే 'నాపసాని' అయ్యిందని మరొక రన్నారు.

నాగమ్మ ఆశలు నెరవేరాయన్న మాట! సంతోషించదగిన వార్తే! అంత భాగ్యం అమరడం ఎలా సాధ్యమైంది, పుల్లయ్య టైలరింగ్‌వల్ల అంత డబ్బు గడించడం కల్ల! తక్కువ వ్యవధిలో అంత డబ్బు సంపాదించ గల్గడం నిజంగా విశేషమే! తారకు అటువంటి భయంకరమైన వ్యాధి అని వింటున్న సమయంలో ఈ వార్త తెలియడం ఎండా, వానలాగా ఉంది! అయినా విన్నదంతా యదార్థమేనా!

అదే సమయంలో పురుషోత్తానికి అక్కడనుండి ఇంకో ఊరికి బదిలీ అయ్యింది. దానికి తోడు సరళ గర్భవతి కావడంచేత, తారను పరామర్శించడానికి కూడా పుల్లయ్య ఇంటికి వెళ్ళడానికి వీలుకాలేదు. లోకులు అనుకొంటున్న అవాకులు చెవాకుల్ని గురించి నిర్ధారణగా తెలుసుకోడానికి అవకాశం కల్గలేదు. అదుగో పులి అంటే ఇదుగో తోక అనే మనస్తత్వం లోకానిది, అపత్యాన్ని నమ్మడం కూడా అపరాధమే! అటువంటి వాటికి దూరంగా ఉండాలి అనే ఉదాసీన భావానికి లోనయ్యాడు అప్పటికి

పురుషోత్తం. అయినప్పటికీ గుండెలో, ఏమూలనో స్పష్టాస్పష్టంగా కదులుతున్న సన్నని సందేహరేఖ!

మరల, ఇప్పుడు ఐదు సంవత్సరాల తర్వాత అదే ఊరికి బదిలీ కావడంవల్ల తారను ఆమె తల్లిదండ్రులను గురించిన ఆలోచనలు పురుషోత్తం మస్తిష్కంలో దాగుడుమూత లాడుకొంటున్నవి.

—ఈ ఆలోచనలతో మునిగితేలుతూ స్కూలుకు వెళ్ళాడు. పురుషోత్తం సాయంత్రం పుల్లయ్య ఇంటికి వెళ్ళాలి అని నిర్ణయం తీసుకొన్నాడు.

ఆ సాయంత్రం పుల్లయ్యఇంటికి వెళ్ళాడు.

అలికిడి లేదు. తలుపు తట్టాడు. పుల్లయ్య తలుపు తీసి, పురుషోత్తాన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

'ఆఁ.... మీరా? రండి బాబుగారూ రండి.... కూర్చోండి' అని అక్కడ ఉన్న కుర్చీ చూపింది, లోనికి వెళ్ళి ఒక నిముషం ఉండి వచ్చాడు. పురుషోత్తం, అతణ్ణి పరిశీలనగా చూశాడు. అతను శారీరకంగా, మానసికంగా ఎంతో క్రుంగిపోయినట్లు కన్పించాడు. ఏదో అంతర్గతమైన వ్యథ అతనిలో ఉన్నట్లనిపించింది. తాను ఒకప్పుడు విన్న విషయాలకు, ఇప్పుడు చూస్తున్న వాటికి ఏమీ పొంతనలేదే అనుకొన్నాడు.

'పుల్లయ్యగారూ! మిమ్మల్ని చూసి చాలా కాలమైంది. మళ్ళా ఈ ఊరికే బదిలీ అయ్యింది.. మిమ్మల్ని చూడాలనిపించి వచ్చా. అంతా బాగున్నారా? ఏమున్నా విశేషాలుంటే చెప్పండి' అన్నాడు పురుషోత్తం.

'చాలా సంతోషం బాబుగారూ! మిమ్మల్ని మేము గ్నాపకం చేసుకొంటుంటాం. మా తారమ్మ మరీను. దానికి మీరూ, మీ కార్యక్రమం అంటే ... ఇదీ. మీరు మంచోళ్ళు. కలకాలం ... మేమూ ఉన్నాం. ఏమీ నెత్తురు లేకుండా బతుకుతున్నాం. ...మీద ... బాబూ.... మా జీవితాలు. ఇందుకే ఇలాగున్నాం. ఏం చెప్పమంటారు? తారకు పెళ్ళి అయింది. ఇళ్ళెపట్నం అత్తారిది. అదీ ఏడుస్తూ కాపురం చేస్తా వుంది. నాగమ్మ.. ఇప్పుడు.. ఇక్కడ.. ఉండటంలేదు. ఎక్కడుందో ఏమో!! అంతా తీసుకుపోయింది. నా దగ్గ మిగిలి పోయింది. ఇలాగ ... ఏడుస్తూ, వాడుతూ బతుకుతున్నాం' అన్నాడు. అతని కన్నులు తడిశాయి.

పురుషోత్తం తెల్లబోయాడు. ఏమి మాట్లాడాలో ఎలా ... చెప్పాలో తోచ లేదు. ఏవో ఓదార్పు మాటలు చెప్పి వచ్చాడు. కాని మనసులో అసంతృప్తి! ఏనో ప్రశ్నలు వేసి, విషయాలు రాబట్టుకుందామనుకున్నాడు. సందేహాల నివృత్తి చేసుకొందాము అనుకొన్న పురుషోత్తం ప్రయత్నం సఫలం కాలేదు. సందిగ్ధంగా ఉన్న సంఘటనల

చిక్కుముడులు ఇంకా అట్లాగే ఉండి పోయాయి.

మూడు రోజులైన తర్వాత పురుషోత్తానికి విశాఖపట్నంనుండి ఉత్తరం వచ్చింది. అది రాసింది కనకతార!

మామయ్యగారికి— తార వ్రాయునది. మీరిచ్చిన సలహా ప్రకారం చదువుకొన్నందుకు నేను ఉత్తరంలో నా కథ వ్రాయగలుగుతున్నాను. మీరు రెండు రోజుల క్రిందట నాన్నగారి దగ్గరకు వచ్చినప్పుడు అక్కడే ఉన్నాను. కాని మీకు నా ముఖం చూపించే ధైర్యంలేక మీ ఎదటికి రాలేదు. క్షమించవలెను. నేనొక పిరికిదాన్ని. పిరికితనం మూలంగా జీవితాన్నే నాశనం చేసుకున్నాను.

ఒకప్పుడు— నా సవతితల్లితో, నాన్నతో వెళ్తున్నప్పుడు మీతో మాట్లాడలేకపోవడానికీ, మీ ఇంటికి రాకపోవడానికి, మీ మంచితనం ముందు నిలబడే శక్తిలేని పిరికితనమే! నా సవతితల్లిని ఎదిరించలేకపోవడం కూడా అదే కారణం! అందుకు ఎంత ఏడ్చేదాన్నో దేముడికే తెలుసు.

నా సవతితల్లిని నేను తల్లిగానే చూసుకొన్నాను. ఆమె నన్ను తన పిల్లగా చూసుకోకుండా ఒక బొమ్మగా చూసుకొన్నది. ఆ నాగమ్మ విషవలయంలో నేను, మా నాన్న బందీ మైపోయాం. ఆమె తో రెక్కల అగ్ని గుండంలో సమిధలమైనాం. చివరకు మా ఇద్దర్ని అసమర్థులుగా చేసి, నాగమ్మ తన ఇష్టంవచ్చిన వాడితో లేచిపోయింది. డబ్బూ, బంగారం పట్టుకుపోయింది

అప్పుడు ఆమె మాటకు ఎదురు తిరిగితే, రాక్షసిలాగా మా మీద విరుచుకొని పడేది. మా నాన్న తనకు పనికిరానివాడని పదేపదే ఆడిపోసుకొనేది. నేను నాగమ్మ మాట వినకపోతే మా నాన్నను చంపేస్తాననేది. అర్భకుడైన మా నాన్నకోసం, ఆ మాయలాడి ఆగడం కోసం నేను హారతైపోయాను. స్థలాలు, డబ్బూ, బంగారం— అంతా నా శరీరాన్ని పణంపెట్టి సంపాదించినవే! ఏమైనా ఆ సవతితల్లి నా జీవితానికి విషవల్లి అయ్యింది.

ఇంకో సంగతి— నాకే జబ్బు లేదు. కేన్సర్ లేదు; పాడూ లేదు. అట్లా చెప్పమని నాగమ్మ ఆజ్ఞ! డబ్బున్నవాళ్ళకు నన్ను అప్పజెప్పి, డబ్బు గుంజడమే ఆమె ఏకైక లక్ష్యం! మా నాన్నను ఓ మూల కూర్చోబెట్టింది. తర్వాత నన్ను ఓ రౌడీకి కట్టబెట్టి కసి తీర్చుకొన్నది. తన దారి తను చూసుకొన్నది

తాగుబోతు మొగుడితో వేగుతూ ఇద్దరి పిల్లల్ని కన్నాను. ఏమైనా నా భర్తను మార్చుకొంటాను. పిల్లల్ని బాగా పెంచుకొంటాను. నేను నాకుగా పతనం కాలేను. కాని ఆ పతనమే పునాదిగా చేసుకొని జీవితాన్ని గట్టిపరచుకొంటాను.

మామయ్యగారూ! మీ కన్నా దగ్గర వాళ్ళు, మీరు తప్ప నా క్షేమం కోరే వాళ్ళు ఎవరూ లేరు. అందుకనే నా జీవితాన్ని మీ ముందు ఉంచుతున్నాను. మీరు క్షమిస్తే నాకు ధైర్యం వస్తుంది. నేను నా జీవితంలోని మరకల్ని చెరిపేసుకొని, తల్లిగా ఇల్లాలిగా బ్రతుకును తీర్చుకొంటాను. పాత మిషను లాగా ఉన్న మా నాన్నను ఓదార్చండి.

మామయ్యగారూ!

నన్ను దీవించండి.

అత్తయ్యగారికి

నమస్కారాలు.

ఇట్లు

తార.



పురుషోత్తం గుండెలో రక్తం ఒక్క లిప్తపాటు ఆగింది. కన్నుల్లో నీరు తిరిగాయి. అతణ్ణి కలవరపర్చిన పజిల్‌కు సమాధానం దొరికింది. అది సంతోషమో, విచారమో తెలియని నిర్వికార స్థితి! మనస్సు జీవిత సమస్యల సుత్తిదెబ్బలతో అల్లాడిపోయిన స్థితి! మానవ జీవితంలోని ఉచ్చనీచాలు సమానంగా భావించిన ఉత్కృష్ట స్థితి!

'తారా! తప్పు బురదలో తోయబడిన నువ్వు, తప్పు చేసినట్టు కాదు. నువ్వు పశ్చాత్తాపం అనే అంగారంలో పరిశుద్ధం చేయబడిన బంగారానివి! తారా! నువ్వు పతనంలోనే పైకి ఎదిగిన పవిత్రతవు. నీ ఆశలు, ఆశయాలు నిర్విఘ్నంగా నెరవేరాలని మనస్ఫూర్తిగా కోరుకొంటున్నాను' అని లోలోపల అనుకొని కన్నులు మూసుకొన్నాడు పురుషోత్తం.

——



యంఢో

వెంకట రమణారావు

---

**ఉదయం 4 గంటలు**

---

నీగ్రో యువతి నగ్నదేహంలా నిగనిగలాడుతూ, నల్లటి నిగారింపు యొక్క విలక్షణమైన అందాన్ని వెదజల్లుతూ ఉంది ఆ పట్టణపు రాజమార్గం।

రాజులు లేరు కాని, వారు నడిచిన (ఆనాడు ఏనుగుల మీద) మార్గంలోనే వెళ్దామని పురజనుల ఆకాంక్ష। అందుకు మరి రాజమార్గం ఉండాలి కదా?

కనుచూపుమేర వరకూ విశాలంగా, వెడల్పుగా, గతుకులు లేకుండా, అందంగా ఉందీ మార్గం —

ఇది సెంటరు- కేంద్రం- కూడలి-

ఇక్కడ ఈ రాజమార్గాన్ని మరో రాణీమార్గం ముద్దుపెట్టుకొని, కలిసి, తన దారిన తాను పోతోంది.

ఇప్పుడు సమయం ఉదయం నాలుగు గంటలు-

నియాన్ దీపాలు ఇప్పుడే ఆర్పబడ్డాయి -

ఇప్పుడీ రోడ్డు ఏ బంధాలూ, బాధలూ లేని ఋషిపుంగవుడి మనఃఫలకంలా, ఏ బొమ్మా లేని కాన్వాసులా, పంచరంగుల నటులు లేని సినీతెరలా బోడిగా ఉంది—

ఇంతలో పురపాలకసంఘంవారి స్వీపర్లు వచ్చేరు- చీపుళ్ళు పట్టుక దుమ్ము దులిపేరు- బర్రు .. బర్రు.... బర్రు— ధూళీ సిగరెట్టు పెట్టెలు, విన్న వాడి విసరేసిన వస్తుసముదాయపు అస్తిపంజరాలూ మీదకెగసి మళ్లా కిందపడ్డాయి- రెండు చక్రాల తోపుడుబళ్ళు నాగరికత జీవనపు అవశేషాలని మోసుకపోయేయి- తరవాత పైపులు తగిల్చి నీళ్ళు చిమ్మేరు హైడ్రెంట్స్ నించి-

మనిషి దైనందిక జీవనలీలలో తన పాత్ర నిర్వహించడానికి రోడ్డు తయారయిపోయింది-

మొట్టమొదటి సిటీబస్సు, యుద్ధంలో పాత టాంకు చేసేటంత శబ్దం చేసుకుంటూ. విప్పంటుకొని కాలిపోతున్న ఇంటిలా పొగ వదుల్తూ వచ్చి ఆగింది. బస్సు ఖాళీగా ఉంది. బరువు ఇంకా పడని ముసలి లొడ్డిల్లా ఉంది.

ఈ బస్సుకోసమే కాచుకొని ఉన్న ఒక వాద్యబృందం ఒక నైట్‌క్లబ్ లోంచి పరుగున వచ్చి బస్ ఎక్కేరు.

వారి ముఖాలు చీలికపాలికలయిన బిచ్చగత్తె పాతచీరలా ఉన్నాయి. వారి ముఖాలలో ఆనందమూ లేదు విషాదమూ లేదు. బతకాలి కాబట్టి బతుకుతున్నాం... చావాలంటే వస్తాం అన్నట్టున్నాయి. రసం పీల్చేసిన మామిడి టెంకలా ఉన్నాయి. వెల్లపోయిన గోడలా ఉన్నాయి.

కాని ఈ రసం, రంగూ, రుచీ లేని మనుషులే రాత్రి నైట్‌క్లబ్‌లో ఆరిపీరుల్లా వాద్యాలు కొట్టేరు. మాంచి హుషారుగా కనిపించేరు. సూట్లలో, మెరిసే టైలలో, పాలిష్‌కొట్టిన జోళ్ళతో, చిరునవ్వులు తగుల్చుతున్న ముఖాలతో మేళతాళాలు వాయించేరు. డ్రమ్ములు కొట్టేరు. బాకాలు ఊదేరు.

వీరు తమ ప్రావీణ్యతతో ఉత్తేజపరచగా, అర్ధనగ్నంగా, సగ్నార్ధాలు ప్రేక్షకులకి తెలిసేలా గెంతింది డెల్లీ డేన్సరు. శివాలెత్తినట్టు పిరుదు తిప్పుకుంటూ గెంతులేసింది.

ఆమె జఘనం, తొడలూ లైట వెలుగునీడలలో నీడం వెలుగుల్లా కనిపించేయి. అందమైన రొమ్ములు పిలికలాంటి మెరుగుల బ్రాలోంచి బంతుల్లా తుళ్లితుళ్లి పడ్డాయి. అవి వచ్చి తమ వడిలో పడవా అంటూ ఆబగా చూసేరు తాగుడుమైకంలోని ప్రేక్షకులు.



ఫలానా యంగ్ లయన్స్ వాద్యం కొట్టగా, ఫలానా యంగ్ లయనెస్ తన సింహమధ్యం గిరగిరా తిప్పి మిమ్మల్ని అదరకొట్టి, నిద్ర చెదరకొట్టి, ఎద ఎగరకొట్టి ఆనందింపజేస్తుంది రండొహో! అని ప్రకటన పేపర్లో ఏదో మారుమూలని పడగా ఎర మింగడానికి చేపలు వచ్చిపడ్డాయి. రసికులు రసాస్వాదనకోసం ఉవ్విళ్ళూరుతూ ఊడిపడ్డారు. రూపాయి సరుకులని పదిరూపాయల కమ్మి, పెగ్ విస్కీలో మరో పెగ్గు నీళ్ళు కలిపి డబల్ పెగ్గని అమ్మి, ఈ గిమ్మిక్కులన్నీ లేకుండా పగటి వెలుగులో నిలబెడితే అరటిపండు తొక్కలా కనిపించే ఓ వయసుమళ్ళిన వనితని వయ్యారిభామగా చూపి పెట్టి వింపుకున్నాడు రాత్రి క్లబ్బు స్వంతదారు. ఒంటికి పట్టిన జబ్బు వదలగా ప్రేక్షకులు రాత్రి ఏ రెండుకో మూడుకో ఇళ్ళకి పోగా, బస్సు దొరక్క అక్కడే కునుకుపాట్లుపడ్డ దప్పుల, తమరకుల, బాకాల బృందం ఇప్పుడు బస్సెక్కారు. ఇప్పుడు యంగ్ లయన్స్‌లా లేరు. ముసలి మేకల్లా ఉన్నారు.

వీరి వాద్యాని కనుగుణంగా ఒళ్ళు హూనమయినట్టు గెంతిన నాట్యకత్తె మాత్రం వీరితో లేదు. అటు గెంతుతూనే ఒక ముసలి సరసుడి ఒడిలో కూర్చొని... ఒప్పందం కుదుర్చుకుంది. ఆమె నాట్యం చేస్తూనే ఎవడికి గేలం తగుల్తుందో, ఎవడి జేబులో బాగా డబ్బుందో గ్రహించగలదు. డబ్బు ఉన్నవాడు పెద్ద పొట్టకలిగి ఉంటాడు. మధ్యవయసువాడై ఉంటాడు. విదేశీ మదువు ఆర్డర్ చేస్తాడు. అపురావురుమని చూడడు అందానికేసి. ఎంతటి దాన్నయినా కొనగలడన్న ధీమా ఉంటుంది. యువకులనీ, స్టూడెంట్ కుర్రాళ్ళనీ ఆమె వేరుచేసేస్తుంది. చెరిగిపారేస్తుంది. వారంతా డబ్బున్నవాడితో నన్నా వస్తారు, లేదా ఇక్కడా అక్కడా డబ్బు దక్కిరి, ఓ వంద కూడవేసి ఓ నలుగురు గుంపుగా వస్తారు. అపురావురుమని తనకేసి చూపులు కత్తులుగా మార్చి విసరగా ఆ కత్తులని తప్పించుకుంటుంది. ప్రేమా! అది ఎంత దూరంగా తనకుంటే అంత మంచిది! ఈ మరవంటి, తోలుతిత్తివంటి దేహాన్ని, మరో ఐదేళ్ళ కాలానికి పూర్తిగా యవ్వనం అనే దేవత వదిలేయక ముందే, రావల్సిన డబ్బు రాబట్టడానికి ఉపయోగించ నిశ్చయించుకుంది. ఒక బరువైన వ్యక్తితో కారెక్కిపోయింది ఒక షో అయిపోగానే మరో షోకి.

మొదటి బస్సు వెళ్ళిపోయింది.

అటునుంచి మరో బస్సు వచ్చి ఆగింది.

అందులోంచి దిగేరు, మానవ నాగరికత అనే పల్లకి యొక్క

పోయీలు- వారు లేనప్పుడు నవీన నాగరికత అడుగు ముందుకు కదలదు-

వారంతా పెద్దా, చిన్నా హోటళ్ళలోని డిష్ వాషర్లు, సెర్వర్లు, బస్సుల, కారుల డ్రయివర్లు, ఆయాలూ, పనిమనుషులూ, చిన్నా, పెద్దా పనులు చేసేవారు- అసలు వీరంటూ ఉన్నారని, ఇంద రున్నారని ఎవరికి తెలుసు? వీరి లోని ప్రతి ఒక్కరికీ కష్టాలున్నాయనీ, ప్రతి ఒక్కరూ మానవ జీవిత చరిత్రకి పునాదిరాళ్ళనీ ఎవరికీ స్ఫురించదు- వీరి చరిత్రలు ఏ పుస్తకాలలోకీ ఎక్కవు-

ఈ మానవాకారాలు దిగేయి- నిశ్శబ్దంగా తమ తమ నియమిత స్థానాలకు పోయేయి- ఎందుకు పని చెయ్యడం? బతకడానికి- ఎందుకు బతుకు తున్నావు? పనిచెయ్యడానికి-

ఇదే వారి ఫిలాసఫీ-

వారి రంగులేని జీవితం రంగులున్న జీవితాలవారికి అంకితం.

## 05-30 గంటలు

తెలతెలవారుతోంది కాని ఎండ పడడం లేదింకా-

రాజమార్గం రాచరికాన్నింకా పుంజుకోలేదు.

పేవ్ మెంట్ నే ఇంటిగా వాడుకుంటున్న మానవ సంసారాలు నిద్రలేవడం ప్రారంభించేయి-ఇంత సందడి రోడ్డుమీద జరుగుతున్నా తమకి పట్టనట్టే కొన్ని మానవాకారాలు చిరుగుల బట్టలు కప్పుక నిద్రపోతున్నాయి-

లేచిన మనుష్యులు ఆవులించేరు- దగ్గేరు- తుమ్మేరు- పేవ్ మెంట్లనే ఇళ్ళుగా మార్చుకొని ఎక్కళరబడీ సంసారాలు స్థాపించి విస్తరింపజేసి,ఏలుబడి ఏలుతున్న మానవులు వీరంతా-

ఒక మగాడు, ఒక ఆడది జతకలిసి, ముగ్గురు నలుగురు పిల్లల్ని కని, దాగరంతా జాగాలోనే కాపరం ఉండిపోతున్నారు- ఒక జీవితంకాలం లాగి చేస్తున్నారు.

బద్ధకం బద్ధకంగా లేచింది ఆడది- ధనవంతురాలు చలవగదిలో, డన్లప్ పరుపుమీంచి లేచినంత బద్ధకంగా లేచింది- ఆమె పైటజారి, రవిక విడిపోయి, రొమ్ములు లోకానికి అగుపిస్తున్నా ఆమె లెఖ్ఖచెయ్యలేదు- ఆ తీరుబడి లేని లోకంలో ఎవరూ తనని గమనించరని ఆమెకి తెలుసు- గమనించినా ఏం చెయ్యగలరు? ఆమె లేవగానే పిల్లలూ లేచేరు ఒక్కొక్కరు-

"అయ్యని లేపరా! పనికెళ్ళదేటి గొల్లిగాడు! రాతిరి తాగొచ్చి తందనాలాడి

వాడు! ఏళ కెళ్ళకపోతే వాడికి కొద్ది నెగమను!" కొడుకుని పురమాయించింది.

కళ్ళలోకి వడే జుత్తుతో బొమ్మకుక్కలా అగపడే కుర్రాడు అయ్యని లేపేడు. "అయ్యా! లెగురా! అమ్మ నెగమంటున్నాది!"

"బాడుకావ్ నంజకొడకా!" అంటూ పడుకున్న మానవుడు చెయ్యి విసరగా అది ఎనిమిదేళ్ళ కుర్రాడుకి తగలగా అది కెవ్వుమని ఏడుపు లంకించుకుంది.

ఆ సైరన్ అరుపుకి మగాడు లేచి కూర్చొని అందరినీ బూతులు తిట్టడం ప్రారంభించేడు.

"ఎందుకురా తిడతావు! నాను నంజనయితే అడు నంజకొడుకవుతాడు!"

"నువ్వు నంజవే! నమ్మికే." అరిచే

"ఇంకా తాగుడు మైకం దిగ్గేదేట్రా కైరాతి నంజకొడకా! నన్ను అంటావా! నువ్వెవడికి పుట్టినావురా? సీతమ్మోరు విన్ను కందేట్రా ఇటాచోర్ నంజకొడకా" నెగంయిమని లేచింది ఒంటికాలుమీద.

ఆ తిట్టుకి ఫెడేల్ మని అతదాని వీపుమీద ఒక గుద్దు గుద్దేడు మగాడు. దాంతో కడడి బూతులు లంకించుకుంది. దాంతో మగాడు తగ్గేడు.

"పోలీసోడొచ్చి లాటీతో వడుమురిసిందాకా నెగవా? పన్లో కెల్లవేటి!"

"థూట్! దొంగయెదవ పని? నారిలోకి బస్తాలు మోసిమోసి యీపు యిమానం మోత మోగిపోనాది! యింతకన్న బి ఫతక్కువ పని జూసుకోవాల!" బీడీతీసి ముట్టించేడు మగాడు.

పెద్ద బజారులో, లారీలలోంచి సరుకులు గోడౌన్ లలోకి చేరవెయ్యడం అతని పని. ధరలు పెరిగేక అవే బస్తాలు మళ్ళా లారీలలోకి వెళ్తాయి. లాభంవల్ల బజారు వ్యాపారిది. అతనికి రోజు కూలీయే దక్కుడు. కూలీ రోజుకి మూడు.

ఈ కూలీలందరికీ ఒక ఏజెంటున్నాడు. ఆ ఏజంటు కింద ఓ యాభై కూలీ లున్నారు. పెద్దబజారులో ఎత్తడం, దించడం పని ఆ ఏజెంటే చేయిస్తాడు. రోజుకి ఆ ఏజంట్లకి దొరికేది కూలీ ఒక్కొంటికి ఐదు. కూలీ జబ్బుపడి రాకపోతే జీతం దొరకదు, ఎక్కువ కూలీ అడిగితే పని పోతుంది.

ఓసారి, ఒక రాజకీయనాయకుడి ప్రోత్సాహం మీద కొంతమంది కూలీలు ఒక సంఘంలా ఏర్పడుచుకొన్నారు. వచ్చిందంతా సమానంగా పంచుకుందాం అనుకున్నారు. కాని కూలీసరఫరా ఏజంట్లు ఎత్తుకి పైఎత్తు వేసేరు. వారివేళ్ళతోనే వాళ్ళ కళ్ళు పొడిపించేరు. సంఘంలో లేని తక్కిన కూలీలచేత స్ట్రయిక్ చేయించేరు. తమకి చెందవలసిన పని వారు కాజేస్తున్నారు కాబట్టి, ఆ కొత్త యూని

యన్ని వర్తకులు తిరస్కరిస్తేనే కాని తాము పనులోకి వెళ్లమని, సమ్మె చేసిన వారం రోజులూ ఏజంట్లు సమ్మెచేస్తున్న కూలీలకి జీతం ఇచ్చేరు- బజారులో పని ఆగిపోయి వర్తకులకి నష్టం- ఓ పదిమంది గూండాలని పెట్టి ఆ కొత్త యూనియన్ నాయకుల్ని ఉతికించేసేరు ఏజెంట్లు- తరవాత కూలీ కోపరేటివ్ యూనియన్ రూపురేఖలు లేకుండా పోయింది-

"ఒరే సత్తిగా! బేగెళ్ళి అరకప్పు టీ ఒట్టుకరా!" అవులించి లేచి, కొడుకుని ఆదేశించేడు పేవ్‌మెంట్ కూలీ నిద్రలేచి-

"డబ్బు లియ్యి!" పదేళ్ళ కొడుకు అడిగేడు కుండ బద్దలుకొట్టినట్టు.

"లమ్డీకే! నీకాడ నేదట్రా సిల్లర? పాలిస్ జేసి అర్జించిన డబ్బులేం జేసేవ్‌రా?" చెయ్యెత్తేడు కొట్టడానికి.

"అదికాదెక్కడుంది? రూపాయెట్టకపోయి నిన్న రేతిరి తాగేసినావు గావా? ఆ డబ్బు లేదనుకున్నావు?" అడది కల్పించుకుంది.

"నువ్వెవుడితోనన్నా తొంగొని అర్జించినా వనుకున్నానే!"

"ఓరి ముదనష్టపోడా! నానే వంజకూతుర్నయితే నీకాడెందుకుందున్రా? అవాడు ఒయసుండగానే సెంద్రమ్మ కంపెనీల సేరిపోయిందును!" చిన్న మూటలోంచి దువ్వెన తీసి తల గబగబా దువ్వుకొని లేచింది- చీర సర్దుకుంది- రవిక ముడివేసుకుంది-

అరిగిపోయిన అల్యూమినియమ్ గిన్నెలూ, కంచాలూ ఒక చిన్న మూటగా కట్టింది- పాత గుడ్డలమూటతో పాటు, వీటినీ తీసుకెళ్ళి ఒక పెద్ద ఆఫీసుకున్న కాంపౌండు గోడకి అన్చిపెట్టింది- వాటి నెవ్వరూ ముట్టుకోరు- ఏ దొంగా వాటి జోలికి పోడు.

"ఓ లమ్మా! బూట్ పాలీస్ డిబ్బాలయిపోనాయి! రూపాయెట్టి ఎర్రదీ, నల్లదీ కొనాల!" సత్తిగాడు డబ్బు కావాలని నోటిపిచ్చేడు-

ఇంతలో కూతురంది.... "రొట్టికి డబ్బులియ్యి! ఆకలేత్తంది!"

"ఎవురి కాకల్నేదే? అందరికీ ఆకలేస్తాది- దొరసానికి ఏస్తాది, దొమ్మర సానికీ ఏస్తాది! దొరసానికి బువ్వ నోటికాడ కొస్తాది! మనం బువ్వ నెతుకోక్కోవాల!" వనిత చెప్పింది వేదాంతం- "సత్తిగా! ఒక రూపాయెట్టుగెళ్ళి అన్నం, పులుసు ఒట్టుకపోరా!" ఒక మకిలిపట్టిన అల్యూమినియమ్ గిన్నె నిచ్చింది.

సత్తిగాడా గిన్నె పట్టుకొని పక్కసందులో ఉన్న జనతా హోటల్‌కి

పరుగు తీసేడు- అదీ పేవుమెంట్ హోటలే- ఎక్కడో వండబడి తేబడ్డ అన్నం, పులుసు, కూర ఏడుగంటల వరకూ అమ్మకం- తరవాత ఆ హోటలు మరి ఉండదు- అన్ని గంటలో చెల్లిపోతాయి- కూలినాలి చేసుకుంటున్న వారంతా కొనుక్కు- తిని పనిలోకి పోతారు.

రూపాయికి రెండు పెద్దకప్పుల ఉప్పుడు బియ్యం అన్నం, రెండు గళా సుల పులుసూ గిన్నెలో వేయించి తెచ్చేడు-

సంసారమంతా గిన్నెచుట్టూ మూగి రెండేసి, మూడేసి ముద్దలు తిన్నారు. మరో గిన్నెతో నీళ్లు తెచ్చింది ఎనిమిదేళ్ళ పిల్ల- అన్నం తిన్నాక చేతులు కడుక్కుని నీళ్ళు తాగేరు-

సత్తిగాడు అమ్మదగ్గర రూపాయి తీసుకొని పాలిష్ సామగ్రి (బ్రష్‌లూ, కర్ర పుట్‌రెస్టు, క్రీమ్ ఇత్యాది) పట్టుకొని అక్కడికి కిలోమీటరు దూరాన ఉన్న బస్‌స్టాప్ దగ్గరికి పోయేడు.

అక్కడున్న స్నేహితుడికి సామానప్పగించి, సందులో ఉన్న సినిమా హాల్ దగ్గరకు పోయి, అక్కడి గూర్ఖాకి పది పైసలిచ్చి, పాయిఖానాకి పోయేడు- తరవాత అక్కడే ఉన్న టీ బడ్డీకి పోయి ఒక బన్ తిని టీ తాగేడు- ఆ బాకీ సాయంత్రం చెల్లు కొడతాడు- మధ్యాహ్నం భోజనం కూడా అక్కడే.

సత్తిగాడు వెళ్లగానే ఈ సంసారానికి యజమానయిన మగాడు మరి తనకీ సంసారంతో సంబంధంలేనట్టు పనికిపోయేడు-

ఆడది ఇద్దరు కూతుళ్ళనీ వెంటపెట్టుకొని ఒక బస్సెక్కింది- అక్కడికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక కాలనీలో ఇంటిపని చేస్తోంది. ఇద్దరు కూతుళ్ళూ తల్లికి సాయంచేస్తారు- ఆమె తిండి ఆ ఇళ్లల్లోనే అయిపోతుంది. ఇంటికి పాతిక చొప్పున నెలకి ఆమె ఆర్జన వంద- ఆ ఆర్జనలో సగభాగం ఆ ఇళ్లల్లోని ఓ అమ్మగారి దగ్గర దాచుకొంది-

“యెందుకు దాస్తావే డబ్బు, జెల్సాగా కర్చుజెయ్యక?” అన్నాడోసారి మొగుడుగా వ్యవహరిస్తున్న మొగాడు.

“నువ్వెప్పుత్తిని మరిగి నన్నొగ్గస్తావో ఎవుడి కెరుక? యీ ఆడగుంటలకి పెల్లి సెయ్యొద్దా?”

మొగాడు పకపకా నవ్వేడు.... “పెల్లా? నర్రా! నవర్తాదినాక యే కంపెనీ కన్నా అమ్మేస్తే గుంట ఒక్కొర్తికి మూడువేల్దారుకుతయ్యని నాను నెక్కలు గడుతున్నాను!”









"ఏ జిమ్మడ! సిగ్గూ సరం నేదట్రా? నా పేనం పోవాలగాని అట్టా జరగనిస్తావా?"

"నువ్వు జరగనిచ్చేదేటి! అల్లు నా బిడ్డలు! నా యిష్టమొచ్చినట్లు జేసుకుంటాను!"

"నానన్నా సవ్వాల! నువ్వన్నా సవ్వాల గాని అట్టా జరగనిస్తానేటి?"

ఆ సంగతి మీద వాదోపవాదాలు, పిలకలు పట్టుకోవడం, తగువు నిత్య కర్మ.

పేవ్‌మెంట్ కాపురస్తులంతా పనులకి పోయేక, వారి ఆస్తిపాస్తులన్నీ ఆ రోడ్డు పక్కనే ఎక్కడో ఒక చోట పడుంటాయి-

ఆ ఆస్తిని ఎవరూ ముట్టరు—దొంగలకి మనీపర్సులు. బంగారం కావాలి కాని పాడుబడ్డ అల్యూమినియమ్ గిన్నెలు ఎవరిక్కావాలి?

వారి బతుకులే దోచుకోబడ్డాయి- వీటిగురించి వారికి చింతలేదు-

పోలీసులున్నారంటే వారు తమకోసం కాదని వారికేనాడో తెలుసు-

"డబ్బు దొంగతనం ఐపోనాది బాబూ!" అంటే....

"నీకాడబ్బెక్కడిదిరా లంజాకొడకా! ఎక్కడన్నా కన్నమేసేవా?" అంటూ తిరిగి దమాయింపు-

"నా కూతురు సార్ మర్యాద రామన్నగారింట పన్జేస్తంది సార్- ఆ

బాబు పుట్టింటికి పారియని పంపి, నా కుతుర్ని బొలహాంతం జేసేడుసార్!"
అంటూ ఏడ్కాడిస్తే....

"ఓరి అబద్ధా- నా కొడకా! నీ కూతుర్నా బాబు బలహాంతం జేసేదా? ఎట్లా నీ కూతురు సావిత్రా... అనసూయా... సీతాదేవా? నీ కూతుర్నెవడికి ఇంతోరకూ కార్చనేదేట్రా! రగడాయించి రగడాయించి దొక్కుడవలా జేస్తుంటారు! నువ్వే నీ కూతుర్నాడిమీడి కొడిటుంటావు! అది కాదనగానే అడిమీదే తిరగబడేవావు!" తిరిగి చార్జి!

పేదవాడు హత్య చెయ్యబడితే, ఆ హత్యచేసిందీ చేయించిందీ పెద్ద వాడయితే, పోలీసులు రొటీన్‌గా వచ్చి, శవ పంచాయితీ జరిపించి, మరో పేద వాడ్ని అనుమానంమ్మీద ఎరెస్ట్‌జేసి, విజాన్ని తప్పుదారివ పట్టిస్తారు-

అందువల్ల పోలీసులూ, ఐ.పి.సి., సి.ఆర్.పి.సిలూ పేదవాడికోసం మాత్రం కావన్నది వారికి తెలుసు-

ఆస్తులూ, దస్తావేజులూ, బ్యాంక్‌లో డబ్బూ వారి కెలానూ లేవు- అందు వల్ల వాటి కొమ్ములు పట్టే ఈ అంగాల అవసరం వారికి లేనేలేదు-

రాజ్యాంగం ఇచ్చే హక్కులవి ఉపయోగించుకొని బాగుపడుతున్నది దరిద్రుడు మాత్రం కాదని వారికి తెలుసు- వ్యాపారలోకం నిర్దాక్షిణ్యంగా దోచుకుంటుంది- చదువుకున్న డాక్టరూ, ఇంజనీరూ దేశంకోసం, ప్రజలకోసం పాటుపడకండా పై దేశాల్లో ఉద్యోగం చేస్తున్నారు ధనార్జనకి- అందువల్ల పేద వారికి పోయేదీ లేదు, వచ్చేదీ లేదు-

## 06-00 గంటలు నించి 07-00

ఉదయం ఆరునించీ ఏడువరకూ రాజమార్గం ముష్టిరాజులా ఉంది-

నియాన్ దీపాల వెలుగు లేకపోవడంవల్ల భవనాల ముఖాలకి అంటించిన ప్రకటనలు మేకప్‌లేని నటుపుదానిలా ఉన్నాయి.

ఇరవై అడుగుల పొడవూ, పది అడుగుల వెడల్పూ ఉన్న సినీ ప్రకటనలు చచ్చిన తిమింగిలాలలా కనిపిస్తున్నాయి.

వాటిలో అగుపించే హీరోయిన్ ఏనుగు తలకాయంత రొమ్ములతో, మర్రిచెట్టు మొదలంత వలంపటి తొడలతో, హీరోనే కాక ప్రేక్షకులని అదర కొడుతోంది- తుపాకి చూపే విలన్‌ని బెదరకొడుతోంది-

ప్రేక్షకులు వంద రోజులు చూస్తేనే కాని, అభిమాన సంఘాల ద్వారా

ఎత్తితేనే కాని సామాన్య తారా, చంద్రుడూ, మహాతారా, మహానటుడూ కాలేవట్టు, నగరవాసులు వీధుల పడితేనేకాని, కారులూ, బస్సులూ, ఆటోలూ, స్కూటర్లూ ముమ్మరంగా ఉంటేనే కాని, ఈ మార్గం నిజమైన రాజమార్గంగానూ, ఈ ప్రకటనలు జీవకళ ఉన్నవిగానూ అగుపించవు.

పేవ్‌మెంట్ల ప్రక్కని 'టీ' దుకాణాలూ, ఫలహారశాలలూ తెరుచుకున్నాయి. రోడ్లు రద్దీగా ఉన్నప్పుడు అవి ఎవరి కంటా పడవు. కోడిగుడ్లు పగలేసి ఆమ్లెట్లు తాజాగా గరమ్‌గరమ్‌గా అప్పటికప్పుడు చేసి ఇస్తారు. పకోడాలు వేచి ఇస్తాడు. పూరీలు వేచి, మసాలా కూరవేసి ఇస్తాడు. వెల సరసం.

జనాలు మూగి ఫలహారాలు కానిస్తున్నారు. హాఫ్ చాలు తాగుతున్నారు. బీడీలు ముట్టించి పనులలోకి పోతున్నారు.

ఉదయం ఆరుగంటలకి రోడ్డుమీద రద్దీ ఎక్కువయింది.

మ్యునిస్పల్ చెత్తలారీలూ, సరుకులు మోస్తూ ట్రక్కులూ వస్తున్నాయి వెళ్తున్నాయి. బస్సుల సంఖ్య ఎక్కువయింది.

కొన్ని బస్సులు ఇక్కడాగేయి. కండక్టర్లూ, డ్రయివర్లూ వారి వారి అభిమాన టీ దుకాణాల దగ్గర నిలబడి, దుకాణదారు తక్కువ కష్టమర్లని లెక్క చెయ్యకుండా వీరికోసం స్పెషల్‌గా కలిపిన స్పెషల్ టీ తాగి, ఆ పక్కనే ఉన్న కిళ్లీ దుకాణంలో తమకు కావల్సిన కిళ్లీ కట్టించి, ఒక చవక బ్రాండ్ సిగరెట్టు ముట్టించి, స్టార్టింగ్‌లోనే ఉన్న బస్‌ని బర్రుమని లాగించుక పోగా వారిమట్టుకు ఆ రోజు పనులు ప్రారంభం ఐనట్టే.

పేవుమెంటులమీద రాత్రి అద్దెలేని ఇల్లు ఏర్పరచుకొని పగలు పనులకు పోయి ఆ చోట వారు ఖాళీ చెయ్యగా, పేవుమెంట్ హాకర్లు వచ్చి ఆక్రమించుకున్నారు. పేవుమెంటుని ఉపయోగించే పాంథులని ఇది దారికాదు ఉరి.... పెట్టుక పొమ్మన్నారు.

బుట్టలలోనూ, ట్రంకుపెట్టెలలోనూ, మూటలలోనూ మోసుకొచ్చేరు సామాను. వాటిని ఓపిగ్గా పేర్చేరు పేవుమెంట్లమీద.

కాళ్లకి జోళ్లు, కళ్లకి జోళ్లు.

చేతిరుమాళ్లు పిన్నులు, పెన్నులు.

రంగురంగుల రిబ్బన్లు.... దారాలు.... సూదులు.

ప్లాస్టిక్ చెప్పులు రబ్బరు సాండిల్సు.

మగాళ్లు నడుముకి కట్టుకుందుకి తోలు పటకాలు.

ఆడవాళ్ల తోలుకి రంగుకొట్టే లిప్‌స్టిక్‌లూ, నకిలీ స్నోలూ, పౌడర్లూ....
కట్ బనియన్లూ, కట్ కాని లుంగీలు, లంగాలూ....
ప్లాస్టిక్ సంచులు.... హేండ్‌బ్యాగులు.... బ్రీఫ్‌కేసులూ-
ఇవన్నీ పేవుమెంటుమీద పరచుకున్నాయి-
రాజమార్గం నిద్ర లేచి అందచందాలను దిద్దుకుంటోంది-
ఇంతలో పేపరమ్మే కుర్రాళ్లొచ్చి పడ్డారు!
ప్రపంచంలో నిన్న జరిగిపోయిన ట్రాజడీలూ, కామెడీలు....
ఆరంభమయిన యుద్ధాలూ, ఆరంభంకాని ప్రచ్ఛన్న యుద్ధాలూ, కుట్రలూ కుతంత్రాలూ....
దేశాలమధ్య మోసాలూ. వెన్నుపోట్లూ.
నాయకుల వాగ్దానాలు....
వీటిగురించి కేకలేస్తున్నారు హాకర్ కుర్రాళ్లు—
"చదవండి సార్! తాజావార్తలు!
"నిన్న జరిగిన ఎన్నికల్లో పాతనాయకుడు పడిపోయి కొత్తనాయకుడు పుట్టుకొచ్చేడు.
"వాడు చెయ్యంది వీడు చేస్తానంటున్నాడు!
"వాడు కట్టింది వీడు పడగొడతా నంటున్నాడు!
"వాడి కట్టుడుపళ్లు వీడు ఊడదీస్తానంటున్నాడు!"
అన్ని పేపర్లనిండా అవే వార్తలు-
పదిపేజీల పేపరులో తొమ్మిదిపేజీలు ఎడ్వర్‌టైజ్‌మెంట్లు-
ఒకపేజీలో ఎవరూ చదవని, చదివినా పట్టించుకోని సంపాదకుని సోది!
కాని పక్కనే ఓ రాజకీయ వ్యాసం- ఇలా ఐతే.... అలా ఐతే అంటూ!
పాఠకుల గోడు.... లేఖలద్వారా- పాత సంపాదకీయాన్ని పొగుడుతూ రాసే లేఖల్నే వేస్తుందో పత్రిక-
ఒక పేజీకి మాత్రం సరిపోయే వార్తలు ముందుపేజీలోనూ, లోపటి పేజీలలోనూ పంపకం- తక్కినవన్నీ వ్యాపార ప్రకటనలు, సినిమా ప్రకటనలు.
ఒక్క ప్రకటనా పేదవాడికి కాని, దిగువ మధ్యతరగతివాడికి కాని పనికిరానిది-
నూటికి ఐదుశాతం ప్రజలు మాత్రమే కొని వాడగలిగే వస్తువుల ప్రకటనలు- ఆ ప్రకటనలపట్ల ఆసక్తి కలిగించడానికి అందమైన యువతీయువ




కుల హావభావాలతో బొమ్మలు. టి.వి.సెట్లు, రేడియోగ్రామ్‌లు, స్టీరియోలు....
మాటికి తొంభై శాతం ప్రజ ఏవాడూ వాడని సౌందర్యసాధనల ప్రకటనలు.

ఎక్కడ చూసినా కుడిఎడమల దగా దగా!

పేపర్లు వేస్తున్నవి మోసం ప్రకటనలు. వ్యాపారులు ఇస్తున్నవి మోసం ప్రకటనలు.

బట్టతలలు జుత్తుతలలుగా మారును మా తైలం వాడితే!

యోగిగారి ఆశ్రమం సమస్త రోగములూ కుదుర్చును.

పదిరూపాయలకి పదిబేండ్ల రేడియో.

పువ్వు పేరుతో జాబు రాయండి మీ అదృష్టం పదిరూపాయలకి వి.పి.లో మిమ్మల్ని వరిస్తానంటూ వస్తుంది.

వంటలకి మా తైలమే వాడండి. తీపి మరింత తీపిగానూ.... హాటు మరింత హాటుగానూ ఉండును!

వారపత్రికలూ, మాసపత్రికలూ అందాల సినీతారల కవర్ పేజీలతో పాఠకుడి మీదకి మూకుమ్మడిగా దాడిచేస్తూ హాకర్ల ముందు గుట్టలుగా పడిఉన్నాయి.

హాకర్ల అరుపులు మిన్నుముడుతున్నాయి.

మీ అభిమాన రచయిత ప్రేమ్‌నాథ్ రాసిన బ్రహ్మాండమైన, భయంకరమైన "ప్రేమపిశుంజం!" సీరియల్ ప్రారంభమయింది చదవండి!

మీ అభిమాన రచయిత్రి "మీననేత్రి" రాసిన ఉర్రూతలూగించే నవల "సూర్యబింబి" చదవండి! అలపించిన ఆశాభంగం! మీ కాపీ రిజర్వు చేసుకోండి!

లోన ఉన్నాయి నొప్పించని, తా నొవ్వని పలాయన కథలు- ఎవరి జీవితంలోనూ ఎదురవని ఎడ్వెంచర్ కథలు-

సెక్స్‌ని సమపాళ్ళలో సెంటిమెంట్‌తోనూ, సాడిజమ్‌తోనూ కలిపి వడ్డించే వరాల వింగు కథలు-

వీటిపక్కనే వేడివేడి బూతుకథల పుస్తకాలు, బూతుసైటిల్స్‌తో.... బూతుబొమ్మలతో-

అంతా సాహిత్యమే!

స్త్రీ వ్రతాల పుస్తకాలండీ! అయ్! పాటలపుస్తకాలండీ! ఘంటసాల పాటలండీ- సుశీలా బాలసుబ్రహ్మణ్యం యుగళగీతాలండీ!

యోగిగారి మహిమల పుస్తకాలండీ!

సాహిత్య కాలక్షేపంకోసం కాలక్షేప సాహిత్యం!

బస్‌లకోసం లైన్‌లు కట్టే ప్రయాణీకులకి సాహిత్యం అమ్ముదామని పేపరు కుర్రాళ్ళు-

పర్సులు ఎలా కొడదామా అని జేబులమీద కన్నువేసే జేబుదొంగలు-

అమ్మాయిల అందాలని చూపులతో చెరుస్తూ, చేతలతో భ్రష్టపరచడానికి పథకాలు వేసే రోడ్‌సైడ్ రోమియోలు-

వీరందరితోనూ నిండు పేరోలగంలా ఉంది రోడ్డు-

యమ రద్దీగా ఉంది-

వందలకొద్దీ బస్సులనీ, కార్లనీ స్కూటర్లనీ, వేలకొద్దీ మానవులనీ, తుక్కులనీ, ఆవులనీ, పోతుల్నీ రిక్షాలనీ, బళ్ళనీ, లారీలనీ, కన్వేయిర్ బెల్టు వస్తువులని లాగేసినట్టు లాగేస్తోంది రోడ్డు-

పీక్ అవర్ దగ్గర పడింది.

పీకలు త్తరించే పీకవరు- బస్సులకి బల్లుల్లా అంటుకొని ప్రయాణీకులు- పనులకు చేరుకుందుకి ప్రాణాలకు తెగించి ప్రయాణం-

ఇంతలో పెద్ద ఊరేగింపు-

ట్రాఫిక్ బంద్!

---

## 08-00 గంటల నుంచి 9-00 వరకు

---

ఊరేగింపు జెర్రిపోతులా ఉంది-

"జిందాబాద్! జిందాబాద్!"

"కుక్కుటేశ్వర్రావుకి జై!.... అంజనేయమూర్తికి జిందాబాద్!"

వర్షం పడ్డాక కప్పల అరుపుల్లా ఎలక్షనయేక పార్టీమెంబర్ల బెకబెకలు!

కర్రలకు తగిల్చి జెండాలు- బేనర్లు-

ఎర్రటోపీలూ, తెల్లటోపీలూ ధరించిన వలంటీర్లు-

మూడువేలకి పైగా ఊరేగింపుదారులు-రెండు లైన్లుకట్టి నిలబడి నడవటం వల్ల ఊరేగింపు పొడవు మూడు కిలోమీటర్లుంది-

ఆ ఊరేగింపు మధ్యని ఒక లారీ పూలమాలలతో అలంకరించబడి గంగి రెద్దులా ఉంది-

ఆ లారీలో ఒక సింహాసనం వంటి కుర్చీ కుషను సీటుతో-

ఆ కుర్చీలో ఆసీనుడయి ఉన్నాడు ఈ ఊరేగింపుకి కారణం అయిన నాయకుడు-

పూలల్లో మునిగిపోయిన నాయకుడు, వినాయక చవితినాడు ఊరేగింపుగా వెళ్ళే వినాయకుడి విగ్రహంలా ఉన్నాడు- వినాయకుడిలా తినడానికైతే తయారే కాని, ఆ పొట్ట లేదు- ఉప్పుని ఊదుతే వెళ్ళి బొంతులదిబ్బమీదో, బంగాళాఖాతం లోనో పడేటంత సన్నంగా ఉన్నాడు-

లారీ కదిలినప్పుడల్లా అతడి ఒళ్ళు సాతాని శవంలా ఊగుతోంది-

ప్రేతకళ ఉట్టిపడేలా చిరునవ్వు నవ్వుతున్నాడు-

ఆ ప్రేతకళే జీవకళ అనుకొని భ్రమపడి అతడి అనుచరులంతా మరింత ఉత్సాహంగా జయజయధ్వానాలు చేసేరు-

"కుక్కుటేశ్వర్రావుకి జై! మన ప్రియతమ నాయకుడికి జిందాబాద్!"

నిన్న జరిగిన ఎన్నికలలో కుక్కుటేశ్వరుడు గెలిచేడు! అతడి కుక్కుట పార్టీ గెలిచింది! జన్మలో గెలుస్తామనుకోని వారంతా గెలిచిపోయేరు! ఎవరు కేనాడూ వస్తామనుకోని పార్టీ పవరుకి రావడం, కుక్కుటేశ్వరుడి వంటివాళ్ళు గెలవటం జరిగింది-

ప్రజకి పాతపార్టీ, పాత నాయకులతోనూ బోర్ కొట్టి, పరవాకి మరో పార్టీకి వోటిచ్చేరు- ఎవరూ ఉద్ధరించేదేంలేదని వారికి తెలుసు-

రేపు కుక్కుటేశ్వరుడు మంత్రిగా పదవీప్రమాణం స్వీకరించ బోతున్నాడు-

మేడల మీంచి పూలవర్షం కురుస్తోంది-

నినాదాల దుందుభులు మ్రోగుతున్నాయి-

"ఎవ్రీ డాగ్ హేజ్ ఇట్స్ డే!" అంటూ వ్యాఖ్యానించేడు ఒక ప్రేక్షకుడు.

అతని స్నేహితుడు దాన్ని తిరగేసి, "ఎవ్రీ డే హేడ్ ఇట్స్ డాగ్!" అన్నాడు.

"కుక్కంటే ఇష్టం కాబట్టి తెల్లవాడా సామెత పుట్టించేడు. మనకి గాడిదలంటే ప్రేమ కాబట్టి "ఎవ్రీ ఏస్ హేజ్ ఇట్స్ డే!" అందాం!

"గాడిద మంచి జంతువే. బరువులు మోస్తుంది. దానిని మన దేశీయ జంతువుగా గుర్తించాలి!"

"ఊ! గాడిద దొంగ గాడిద నేస్తం! బరువులు మీద పడేంది మోస్తాను అంటుంది కాని దగ్గరికి వెళ్ళినట్టయినా వెనక రెండుకాళ్ళూ ఎత్తి కిక్ కొడుతుంది. అపడదూరాన వెళ్ళి పడతావు."

"బాగా చెప్పేవు!"

"ఓండ్ర పెట్టి దానినే హిందూస్తాన్ సంగీతం అనుకోమంటుంది. కదలక మెదలక ఒకేచోట పడుంది అదే ప్రగతి పథం అని కేకలు వెయ్యమంటుంది! ఏ ఆడగాడిద కనిపించినా ఈ అడ్డగాడిద వెంటపడుతుంది. దానినే ఇరుగు పొరుగుతో స్నేహసంబంధా అనుకోమంటుంది."

నాలుగు రోడ్ల కూడలికి వచ్చి ఊరేగింపు ఆగిపోయింది.

ఆనంద పారవశ్యంతో మూకలోని యువకులు రాక్ ఎండ్ రోల్ చేస్తున్నా.

మంత్రిగా కొన్నాళ్ళు చేసేక అదృష్టం వరించి ఇతగాడు ముఖ్యమంత్రి అవొచ్చు. ఉన్నవాడిని పదభ్రష్టి.

అలా దేవేంద్ర పదవి దొరికిపోయేక ప్రజలు ప్రజలే.... దేవేంద్రుడు దేవేంద్రుడే—— ఏం దర్శనం ఇచ్చినా ఇవాళే! ప్రజాపే ఏ వేడుకలు జరుపు కున్నా ఇవాళే. రేపట్నుంచి ఎవరి దారి వారిదే! తనింక ఇటువంటి ముష్టి వెధవ లారీలో ఊరేగుతాడా? విమానాలే కదా? ఐదేళ్ళ వరకూ తఖరు లేదు కదా? ఐదేళ్ళ తరవాత చూసుకుందాం?

ఈ మధ్యలో తన మూడు తరాలకి సరిపడే సంపత్తి సంపాదించడా?! తన బంధువులనీ, శిష్యులనీ కీలక స్థానాలలో పెట్టడా?

అన్నట్టు విదేశాలనన్నింటినీ ప్రజల డబ్బుతో చూసిరావడమే కాదు....



తన రోగాల నన్నింటినీ నయం చేయించుకుని యయాతిలా యవ్వనం పొంది తిరిగిరావాలి.

ఇన్ని పనులు ఈ ఐదేళ్ళ కాలపరిమితిలో చెయ్యాలంటే మాటలా? మరింక తన పనుల్లో తను మునిగిపోవాలి. ఈ ప్రజల నెవడు నమ్మమన్నాడు? ఐదేళ్ల తరవాత వారిముందు నిలబడితే రాళ్లు విసురుతారు. జోళ్ళెవరూ విసరరు.... జోళ్ళు ఖరీదైనవి.

పుచ్చు గుడ్లూ, పుచ్చు టొమేటోలూ విసర్రు– ఈ దరిద్ర దేశంలో పుచ్చువాటికీ గిరాకీ ఉంది– పుచ్చు బియ్యం, పుచ్చు కూరలూ, పుచ్చు పప్పులూ, పుచ్చు మనుషుల పుచ్చు రాజకీయాలూ, పుచ్చు మనసులు.

"ఈ ఊరేగింపు వేగం ఆఖరయి, నన్ను వీళ్ల వేగం వదుల్తే బావుణ్ణు." అని మనసులో తిట్టుకుంటూ పైకి చిరునవ్వు నవ్వుతున్నాడు ప్రజలపాలిటి పెన్నిధి.

కాని ఈ యువతరం ఒక పట్టాన తనని వదిలేటట్టు లేదు. మరింత హుషారుగా రాక్ ఎండ్ రోల్ గెంతులు గెంతుతున్నారు.

ఈ మానవుడు ఈ ప్రజల ప్రియతమ నాయకుడని తెలీక, పూలదండలో ఇరుక్కున్న ఒక చిన్నారి చీమ కాటు వేసింది. ప్రజలకైతే ప్రియతముడు కాని చీమలకి కాదుగా? కుక్కుటేశ్వర్రావు చీమని నలిపిపారేసేడు చీమని నలిపినట్టు.

విన్నావే ఆ చీమ అతడ్ని కుట్టింది ఏమీ చెయ్యలేకపోను. కాని ఇవాళ అతడు చీమా, దోమా కాదు! ఏనుగుకన్న బలవంతుడు!

"కబడ్దార్ చీమలూ! నా జోలికొచ్చేరో మీ పని సరి!" అనుకున్నాడు ప్రస్తుతానికి చీమల రాజకీయంలోనే ఉన్న అతడు.

రేపట్నుంచి రాజకీయాలు ఏనుగు సైజుకి ఎదిగిపోతాయి.

ఎండ పేల్చేస్తోంది! చిరాగ్గా ఉంది ఎండవల్ల కలిగిన చెమటవల్ల.

ఒక యువతి భుజం తట్టి ఆమె చెవిలో ఏదో ఊదేడు.

ఏమిటో ఆమెతో అన్నాడు. ఏమిటి చెప్మా అని ప్రజలు అబ్బురపడ్డారు.

"నా దగ్గర పెర్సెటరీగా ప్రయివేట్‌గా ఉంటావా?" అన్నాడా?

జోకు వేసేడా? బూతు మాటన్నాడా ఊసుపోక?

రహస్యం వెంటనే బట్టబయలయింది.

ఆ యువతి తన పక్కనున్న హిప్పీజుత్తు హీరో చెవిలో గుసగుసలాడింది.

అతడు మరొకడి చెవిలో ఊదేడు.

ఒక దుకాణంలోకి ఇద్దరు పరుగుతీసి, నాయకుడు కోరిన వస్తువుని ఎత్తుకొచ్చేరు. ఒకటి కాదు.... పది! రుసుము చెల్లించకుండానే!

ఇంతకీ ఆయనేం కోరేరుట?

ఎండ నెత్తి మాడ్చేస్తోంది! ఒక ఛత్రం కావాలమ్మాయ్ అన్నాడు!

నాయకుడి నెత్తిమీదికి నీడొచ్చింది.

సూర్యుడు తప్పుకున్నాడు.

నల్లటి నీడలో జీవితం అలా ప్రారంభమయింది కుక్కుటుడుకి!

ఈ ఊరేగింపు దాటి వెళ్ళేసరికి పదిగంటలు కొట్టింది ఎక్కడో వాచీ.

## 10-00 గంటలు

పీక్ అవర్ పీకలు తరించేస్తోంది.

దూదిని పంపులోకి కూరినట్టు బస్సుల నిండా జనం.

పీకమొయ్యా లోడయిన బస్సులు వచ్చి పొగతోబాటు మనుషులనీ కక్కుతున్నాయి.

దిగేవారికన్న ఎక్కేవారే ఎక్కువ!

ఎక్కినవారిని ఎక్కనివ్వకుండా ఆగినట్టే ఆగి స్పీడెక్కించి పోతు న్నాయి బస్సులు.

అలా జరుగుతుందని తెలిసిన ప్రయాణీకులు, బస్సు స్లో ౨ అవుతూ ఉండ గానే బయటకు కప్పగంతులు వెయ్యగా, బయటివారు లోనికి కుప్పిగంతులు వేస్తున్నారు.

బస్సులో కాలు ఆనించడానికి అరఅడుగు చోటు దొరుకుతే అక్కడ ఆరుగురు నిలబడిపోతున్నారు. ఒక ఇనప గజం దొరుకుతే ఆరు పిడికిళ్ళు దానిని పట్టుక వ్రేలాడుతున్నాయి.

కొందరు బస్సు వెనక నిచ్చెనని పట్టుక వ్రేలాడితే, మరికొందరు టాపెక్కిపోయేరు.

ఇక్కడ మరి ఆడామగా తారతమ్యం లేదు.

మగాళ్ళ మధ్య నలిగిపోతున్నారు స్త్రీజనం. వంపులు సరళరేఖలుగా మారి పోతున్నాయి.

"నేను ఆడదాన్ని! అబలని!" అనుకుంటే బస్సే ఎక్కలేరు లలనలు.

సెక్సుని మైనస్ చేసి "సర్వం జగన్నాథం" అని ఎంట్రెన్సు గేటులోకి ఒక్క ఉరుకు ఉరుకు!

నువ్వు మగాడివయితే, పట్టుకుందుకి ఊత దొరక్కపోతే కిందపడతావు.

నువ్వు ఆడదానివీ, యువతివీ ఐతే పది మగచేతులు నిన్ను ప్రేమగా అందుకొని లోనికి లాగేస్తాయి.

మగ నాసికలు ప్రేమగా నీ జడలోని పూలని వాసన చూస్తాయి.

వారి వ్రేళ్ళు తుమ్మెద రెక్కలవంటి నీ ముంగురులని తాకుతాయి.

రవికలోని నీ అందాలని తొంగిచూస్తాయి కళ్ళు. అంచనా కడతాయి.

మానవుల బరువుని మొయ్యలేక మొయ్యలేక పొగలు కక్కుతూ బస్సులు వెళ్ళిపోతున్నాయి.

వీరి గమ్యం ఏమిటి? ఎటునించి వస్తున్నారు? ఎటు పోతున్నారు?

బతకడానికా? చావడానికా?

కార్యాలయాలకీ, మిల్లులకీ, ఫాక్టరీలకి ఉరుకులూ పరుగులూ.

రోజుకు ఎనిమిది గంటలు అర్జనకి వినియోగం.

పనికి పోడానికీ, రాడానికీ మరో మూడుగంటలు.

కూరా, నారా, బట్టా, పాతా, ముంతా చెంబూ, దినుసులూ గినుసులూ కొని

ఇంట పడేదానికి మరో రెండు గంటలు వినియోగం. పదళ పదిగంటలు. ఇంక జీవించే కాలమేముంది?

ఏమయ్యా? నువ్వు మనిషివా? మరవా?

మరమనిషివి.... మనిషనబడే మరవి!

నీకు నీదంటూ ఒక బతుకు లేదా?

ఎందుకు లేదు సార్?

ఎప్పుడో ఓ నాటు దేశవాళీ సినీమా.

ఓ పుస్తకంలోని జోకు జోకు.

వార మాస పత్రికల్లోని సీరియల్ కథలు....

చదివి చదివి.... ఏడుపొస్తే ఏడ్చి.... నవ్వొస్తే నవ్వి.... సీరియల్ లోని హీరోని/హీరోయిన్ని నేననుకొని....

వాలో అణగారి విద్రాణమైన కోరికలని వారి ద్వారా తీర్చుకొని....

అదే జీవితమని భ్రమపడి....

నిజంగా బతకడమంటేనే మరిచిపోయి.... ఎప్పుడో ఓనాడు అకస్మాత్తుగా చస్తాను....

కాని ఆ బస్సుకోసం నిల్చున్నది ఇవాళ నేనే!

## 11-00 గంటల నించి 13-00

పీక్ అవర్ దాటిపోయింది.

బస్సులు సగం బరువుతో వెళ్తున్నాయి. కాళీసీట్లు బోసిగా ఉన్నాయి. కార్లు తగ్గేయి ప్రయివేట్ ఓనర్లవి. టేక్సీలు ఎక్కువయ్యేయి. టేక్సీలతో పార్టీలు.

కార్యాలయాలు కార్యాచరణలో పడ్డాయి కాబట్టి, క్లయింట్లు టేక్సీలలో బ్రీఫ్ కేసులు పట్టుకొని బేరాలు సాగించడానికి.... మంతనాలు నడపడానికి.... యాం.... యాం వట్టుకొనయారు!

ఆర్డర్లు ప... ంచవద్దా?.... సంతకాలు పెట్టించవద్దా?

కిందనున్న జమేదార్ దగ్గర్నించి, గుమాస్తాలూ, ఆఫీసర్లూ కలుపుగొని, మంత్రిగారి వరకూ అందరికీ యాం... యాం!

మంత్రాలకి చింతకాయలు రాల్తాయా?

చింతకాయలు రాలకపోవచ్చు కాని మంత్రులే రాల్తారు మంత్రాలకి చింత




"పుస్తక ప్రపంచం"

---

కాయల్లా. ఉత్తర దక్షిణాలు కలిపే ఈ ఆఫీసులలో, ఉత్తర దక్షిణలు మంత్రాలకన్నా శక్తివంతంగా పనిచేస్తాయి.

అధికారం కలవారిని అది లేనివారు బంగారు బాటలోకి లాగి, నోటంట ముత్యాలు రాలేలా మాట్లాడుకొని పనులు జరుపుకుంటారు.

బ్యాంకు పుస్తకం, వనితా, విత్తం పరహస్తం అధికం ఫలం!

కార్లూ, టాక్సీలూ కార్యాలయాలకి పరుగులు.

రాజమార్గంలోని షాపులూ, షోరూములూ, షోకేసులూ తెరుచుకున్నాయి.

షోకేసులలోని షోపీసులన్నీ దుమ్ము దులపబడి జిగజిగా మెరుస్తున్నాయి.

"టాటా" కంపెనీ జోళ్ళషాపులు- డయింగ్ డయింగ్ అంటూ ఎప్పటికీ చావని బట్టల షాపులు, వెండీ బంగారాల దుకాణాలు-

కొనడం మీ ధర్మం! అమ్మడం మా ధర్మం! వ్యాపారం మానవ ధర్మం- రండి సార్! రండి! రండి!

మీ డబ్బు ఇక్కడ అన్‌లోడ్ చేసి, మా వస్తువులు లోడ్ చేసుకొని సరదాగా ఇంటికి వెళ్ళి మీ భార్యాపిల్లలతో.... సుఖజీవనం చెయ్యండి!

కెమెరాలు.... రేడియోలు.... స్టీరియోలు.... టీ.వీలు.... టేప్ రికార్డర్‌లు.... వీడియోలు....

స్టీలు సామాన్లు.... గ్రైండర్లు.... మిక్సీలు... ప్రెషర్ కుక్కర్లు....

రిఫ్రిజిరేటర్లు.... రూమ్ కూలర్లు.... వాటర్ కూలర్లు....

కార్లు, లారీలు, స్కూటర్లు, సైకిళ్ళు....

సుఖం కావాలనుకున్న వారికోసం షాపులు—

ఇవి పెద్దలకోసం షాపులు—

ఇంక పిన్నలకోసం పేవుమెంట్ హాకర్లు.... ఒకే తెకతెక....

"బాబూ! కొనే బాబూ! భలే మంచి చవక బేరం! బేరాల లోకంలో ఇంత చవగ్గా సారమున్న వస్తువులు! ఇప్పుడు కొనకపోతే తరవాత విచారిస్తారు! స్టాక్ లిమిటెడ్! త్వరపడండి!"

రుమాళ్ళు కొనండి— బనియన్‌లు కొనండి— బ్రాసరీలు కొనండి— అండర్‌వేర్లు కొనండి.... లంగాలు కొనండి— లుంగీలు కొనండి— లంగోటీలు కొనండి—

పార్కర్ కలం సార్! ఓన్లీ టెన్ రుపీస్ సార్! పోనీ ఐదిప్పించండి సార్— ఇవ్వరా? దీన్తో నవలలూ, కథలూ, నాటికలూ రాస్తే మీరు మహా రచయితగా మారిపోతారు సార్— అవి చదివిన ప్రేక్షకులు.... సారీ! పాఠకులు ఏడుస్తారు సార్ ఎగ్జయిట్‌మెంట్ భరించలేక! ఎంతిస్తారు సార్? రెండా? సరే ఏం చేస్తాం? తీసుకోండి సార్!

సెంట్లు సార్! ఈవినింగ్ ఇన్ పారిస్ అత్తరండి! నైట్ ఇన్ న్యూయార్క్ అత్తరండి— మార్నింగ్ ఇన్ మాస్కో లవండరండి! కొనండి సార్! ఇది పులుముకుంటే చాలు ఆడది నరవాసన తగిలిన ఆడపులి లాగ తమదగ్గరి కొచ్చేస్తుందండి! అమ్మాయిలు అడక్కుండా మిమ్మల్ని ఆలింగనం చేసుకుంటారండి!

వెల స్వల్పం? ఫల మధికం! ఓన్లీ ట్వెంటీ సార్! ఇవ్వరా? పోనీ పది? అదీ ఇవ్వరా? పోనీ ఐదు? సార్ ఇంపోర్టెడ్ సెంటండి! స్మగుల్డండి!

పోనీ నాలుగూ కలిపి పదికి పట్టుకపోండి! థాంక్స్ సార్! వాడి చూడండి తెలుస్తుంది ప్రతిభ!

వ్యాపారం మందకొడిగా సాగుతోంది!

---

## 13.00 గంటలు

---

ఒంటిగంట తంగున మోగేసరికి పనులు ఎక్కడివక్కడ ఆపేసి వీధిన పడ్డారు మానవులు— లంచ్ అవర్ మరి!

తినేవాళ్ళు తినడానికి, తిననివాళ్ళు గాలి పీల్చుకుందుకి.... గాలి అవసరం లేనివాళ్ళు కబుర్లకి.... అరకప్పు టీ కి.

పేవుమెంట్లు 'లంచర్ల'తో కిటకిట లాడుతున్నాయి.

పేవుమెంట్లమీద అప్పటికప్పుడు లేచిన టీ, టిఫిన్ హోటళ్ళు.

కిరోసిన్ స్టవ్‌మీద పెనం పెట్టి, గుడ్లుకొట్టి అప్పటికప్పుడు వేసే ఆమ్లెట్లు– మరో పొయ్యిమీద ఒక కుర్రాడు వేసివేసి పకోడీలు తాజాగా వేస్తున్నాడు– ఇంకోచోట, వేడినూనెలో బుస్సుమని పొంగుతున్నాయి పూరీలు.

పీరిమట్టూ ప్లేట్లు పట్టుకొని మూక, తినడానికి– కడుపులోని జఠరరసం మెదడుని తొందరచేస్తోంది. లాలాజలంని ఉత్పత్తి చేస్తోంది నాలుక, పకోడీలు కావాలి, ఆమ్లెట్లు కావాలంటూ.

"ఆమ్లెట్లకి డబ్బు చాలదు, పకోడీలతో సరిపెట్టుకుందూ!" అంటోంది మెదడు, నాలుకతో.

"నో! నో! పనికిరాదు! నాకు కోడిగుడ్డట్టే కావాలి' వాడికి ఆరవు పెట్టు! రేపిస్తావను!" జిహ్వా మొరాయించింది.

మిరపకాయల బజ్జీలు వేసేచోట వ్యాపారం జోరుగా ఉంది.

మరోచోట అన్నీ పచ్చివి– పచ్చి శెనగలు, పచ్చి బఠానీలు, పచ్చి పెసలు.

మరోచోట పళ్ళు– బొప్పాయి.... మామిడి.... జామ– మసాలా జల్లి, ఉప్పు జల్లి ఇస్తున్నాడు ఈవెలుగా కోసి.

రెస్టారెంట్లలో ఇసక వేసినా రాలని జనం– వేపుళ్ళ ఘుమఘుమ– కప్పుల, ప్లేట్ల రణగొణధ్వని.

"ఏం కావాలి సార్?"

"ఏముంది?"

"ఉల్లిగారె.... మసాలాగారె ... మినపట్టు.... పెసరట్టు.... మసాలా దోసె.... రవ్వాదోసె.... పకోడా, మిక్చర్, బోండా...."

"స్వీటు?"

"రసగుల్లా, లడ్డూ, గులాబ్‌జామ్, బర్ఫీ, జాంగ్రి, బాద్‌షా...."

ఆర్డరివ్వగానే అరుపు.... "రెండూ మసాలేయ్!"

అపరాలు పొలాల్లో పండి, బళ్ళమీద బజార్లకు పోయి, అక్కడ్నించి

హోటళ్ళకి వచ్చి, నాని, రుబ్బబడి, టిఫిన్ల రూపం ధరించి, వేడివేడిగా బతుకుల కడుపుల్లోకి పోయి, మానవసేవ చేస్తున్నాయి.

ఒంటిగంట కొరంట పోయిన లంచవరు ఒంటిగంటన్నర దాటినా ఆగక రెండు వరకూ నడిచింది.

ఇప్పట్నించీ సీటుకి వెళ్ళి మాత్రం ఏం చెయ్యాలి? కారులలో ఇళ్ళకు పోయిన దొరలు మూడువరకూ రారు కదా? తింటూ కబుర్లు చెప్పుకుంటూ మెల్లమెల్లగా కాలాన్ని ఖర్చుచెయ్యి.

ఇంటిదగ్గర భార్యా పిల్లలూ, తెచ్చిన పావుకిలో కూరలలోనూ సగం గృహయజమానికి పెట్టి తక్కిందే తాము తింటారు. ఆమెకీ, పిల్లలకీ, రెండు పూటలా తెచ్చిన దానిలోంచే పచ్చడీ, చారూ, నీళ్ళమజ్జిగా, మెతుకులూ. ఇక్కడేమో ఈయన పాపం జిహ్వాచాపల్యాన్ని అకలిమిషతో తీర్చుకుంటున్నాడు.

ఏవో ఉబ్బితప్పాలు.

"ఏంటివిటి సార్ కబుర్లు?"

"ఏమున్నాయండీ మీరే చెప్పాలి?"

"అమితాబచన్‌కి జయకీ విడిపిపోయిందట విన్నారా?"

"మీరు పాతకబుర్లు చెప్తున్నారు సార్."

"ఎన్టీఆర్ సినిమా రేపు రిలీజట? మావాడు సాయంత్రం పోయి లైన్ కడతాడుట. సినిమా టికట్‌కి కాక రాత్రి ఫలహారానికి టీ డబ్బు లివ్వమంటున్నాడు."

"మా వాడు ఏ.యన్.ఆర్ భక్తుడు- వచ్చే వారం అతన్ది రిలీజౌతుందిట."

"బతికేరు. వచ్చే వారం వరకూ మీకు టయిముంది."

"ఏమండీ మన ఉచ్చ మనం తాగడం ఆరోగ్యానికి మంచిదిట!"

"'మందు మాని' ఉచ్చ తాగమంటున్నారు మన పెద్దలు."

"ఇది మరీ బాగుంది సార్. ఇంక నెక్స్ట్ ఏమిటంటే అపరేషన్ లేకుండా బర్త్‌కంట్రోల్ చెయ్య.... అందుకు పెళ్ళాం మొహం చూడకు అనేలా ఉంది."

"'తాగకు.... బూతు వినకు, చూడకు, మాట్లాడకు.... పస్తులు పడుండు. మేం మాత్రం మీ తరపున అన్నీ చేస్తాం.' ఇదండీ మన పెద్దల ఫిలాసఫీ."

ఇలా వెళ్ళాయి హస్కు-కబుర్లు.... ఊకదంపుడు....

## 14.00 గంటలు

రెండు నుంచి నాలుగు వరకూ రాజమార్గం కునుకుతీసింది. దుకాణాలు చాలామట్టుకు నాలుగు వరకూ క్లోజు.

కాని సెంటరు దగ్గరున్న సినిమాహాల్సన్నీ హౌస్‌ఫుల్ బోర్డులు పెట్టేశాయి.

అన్ని హాల్సూ చలవ పందిర్లు. ఎండాకాలంలో హాయ్ హాయ్.

హాల్సు యొక్క ఫాయిర్లలో సీతకోకచిలకలు, తుమ్మెదలు ఝుమ్మని ఎగురుతూ. రెక్కల రంగులు ప్రదర్శిస్తూ. చీరల రెపరెపలు, చూపుల తూపులు, కళ్ళ టపటపలు, చిరునవ్వులు. అంగాంగ ప్రదర్శనలు. ఎవరి వినోదం వారు వెతుక్కుంటూ.

"టికట్ సార్. టికట్. బాల్కనీ అరండీ. డి.సి. ఏదండీ." హౌస్ ఫుల్లున్న బోర్డు అఫీషియల్- ఇది అన్‌అఫీషియల్.

"అంత నలుపే."

"హాలువాడిది పాతికపైసలండి, పోలీసుకి పదిపైసలండి, మదుపుపెట్టిన వాడిది రూపాయండి— మిగిలింది నాదండి.

"వినోదం కూడా వలుపేనా?"

"నీలి కూడా సార్। పక్కసందులో ఓ హోటల్లో బ్లూఫిల్ము మరో అరగంటలో పోతోంది। చూస్తారా సార్। ఒక హీరోకి పదిమంది హీరోయిన్లూ, ఒక హీరోయిన్‌కి అరడజన్ హీరోలూనండి। మంచి కుస్తీపట్లున్నాయండి। పాతికండి టిక్కెట్టు।"

"మాకు తెలుగు సినిమా ఉంది। మీ బ్లూఫిల్మెవడిక్కావాలి। మీ బ్లూఫిల్ములో అచ్చతెలుగు బూతులుంటాయా? పార్కుల్లోనూ, రోడ్లమీదా పాటలతో సంగీతంతో కుస్తీపట్లుంటాయా హీరోహీరోయిన్లకి? పాటల్లో రెండర్థాల బూతులు విరివిగా ఉంటాయా?"

"అవన్నీ ఉండవండి।"

"మరెందు కివ్వాలి పాతిక? ఐదురూపాయలకి మూడు గంటలు ఇవన్నీ వా తెల్గు సినిమా సరఫరా చేస్తుంది తెలుసా?"

మరో హాల్లో.... భయంకర భూతం సినిమా।

"ఈ సినిమా చూసాక హాలునుంచి ఇంటికి సెకెండ్‌షో తరవాత ఒక్కరూ వెడితే అతడికి వెయ్యి బహుమతి హాలువారి వించి।"

దెయ్యాల సినిమాలు.... మీ మెదడుకు షాక్ కలిగించి డబ్బులు లాగే ప్రొడ్యూసర్లు-

"ఇవన్నీ విదేశీవాడికి। సెక్సు సినిమాలు వాళ్ళ దేశంలో మరి ఉద్రేకం ఇవ్వడం మానీసేయి. అందుకు భయపెట్టి డబ్బు లాగుతున్నారు।"

"అదే నవలా సాహిత్యానికి పట్టిన దుర్గతండీ బాబూ అక్కడా.... ఇక్కడానూ।"

"మనం సెక్సు స్టార్ట్ నేషను। కామం స్టేజ్ ఇంకా దాటలేదు। దెయ్యాలొచ్చిపడ్డాయి ఇంతలో।"

"అడామగా సంభోగక్రియ మాత్రం చూపకండి। తక్కిందంతా చూపించుకోండి అవి ఒడిలిపెట్టేరండి సెన్సార్‌వాళ్ళు। దాంతో చూసుకోండి అదే విజృంభణ। అంతకన్న క్రియ చూపించటమే నయంకదండీ?"

"మా బాగా సెలవిచ్చేరు."

సినీహాల్సు దగ్గర తెగ రష్షు।

ఆ ఏంగ్లో ఇండియన్ పిల్ల ఎవరికోసం చెప్మా వించుంది- తొడలు కనిపిస్తూ మినీస్కర్టు- ఎత్తయిన వక్షాలని ప్రదర్శిస్తూ పలచటి బాడీ-

ఈమె ఆమేనా?

పడుతుందా గేలానికి?

రేటుందా?

ప్రేమికుడికోపం నిల్చిందా?

టిక్కెట్ దొరకని ప్రేక్షకులు ఆమెని చూస్తున్నారు.

ఉస్కో అంటే వెంటపడే మగకుక్కల్లా నాలిక వెలికిదీసి చొంగలు కారుస్తూ—

అందం చూడవయా! ఆనందించవయా!

కావల్సింది వినోదం! ఇది ఖర్చులేని వినోదం!

చూడడంలోనే అసలు ఆనందం ఉంది! అంధుడి సుందరిని చూసి ఆనందించలేడు కదా?

టికట్ దొరుకుతే సినీసుందరిని చూసి ఆనందిస్తాను.

లేనప్పుడు ఈ సుందరిని చూసి ఆనందిస్తాను!

నయ్యంటే.... నయ్యంటాను!

నయ్యంటుందా?

"కిస్! కిస్!.... కిల్! కిల్!" అది సినీమా.

"సిప్! సిప్! థ్రిల్! థ్రిల్!" ఇది అధరామృతం ఆమెది.

అమృతం అధరాలదేనా? కాదండి.... కాదు కాదు! ఆమె ఒళ్ళంతా అమృతమే!

దౌటా?

దౌటొస్తే కాళిదాసు నడుగు.... దేవదాసు నడుగు.

ఏమిటా ప్రేలాపన బ్రెయినూ?

ఆమెని గమనించే ప్రేక్షకుల బ్రెయిను వేడిఆలోచనలని రేపుతూ ఆమెను మానసిక రేప్ చేస్తోంది.

ఈమె సువర్ణమందరే! ఒక్కసారిగా రత్నాలు రాలేటట్టు చిరునవ్వు చిందింది!

అబ్బబ్బా! ఏమా నవ్వు! ఏమా సమ్మోహనం! ఎవర్ని చెప్మా చూసి కులుకుతోంది?

అదుగో ఆ హిప్పీవేషంగాడు కార్లోంచి దిగేడు! వాడిని చూసి అదే చిద్విలాసం.

కారెక్కింది! వెళ్ళిపోయింది!

వచ్చింది- క్షణకాలం నిలబడి ఎందరి ఎదలలోనో ఎన్నో అలలు రేపింది. ఊహలు నాటింది. కవ్వించింది. తరవాత అందరినీ....

దుఃఖసముద్రంలో ముంచి వెళ్ళిపోయింది.

ఈ జీవనయాత్రలో ఈ క్షణం ఇక్కడ కనిపించిన ఈ తరుణి మరి ఇక్కడ మళ్ళా ఎప్పుడన్నా కనిపిస్తుందా? ఈ మహానగరంలో ఎప్పుడన్నా ఎదురౌతుందా?

కల్ల! కల్ల!

కల! కల!

బయట ఎండ! వేడి! ఎయిర్ కండిషన్డ్ హాయర్ చల్లగా ఉంది.

జెంట్స్ టాయిలెట్ లవండర్ వాసన కొడుతోంది.

టిక్కెట్ దొరకనివారంతా ఎండలోకి పోలేక టాయిలెట్ లోకి పోయి క్యూలో నిలబడుతున్నారు. పది పింగాణీ చిప్పలు- ఒక్కో చిప్ప ముందు పదిమంది చొప్పున క్యూ.

సువాసన స్ప్రే చేస్తోందో యంత్రం.

తొందరేం లేదు సార్! తాపీగా కానివ్వండి! రాచకార్యం మరేం లేదుగా.

పత్రికలకి సీరియల్స్ హైలైట్ లా ఈ రాజమార్గానికి ఎయిర్ కండిషన్డ్ హాల్సు హైలైట్. అక్కడే కదా నాగరికత వెల్లివిరిసేది!

## 15-00 గంటలు

ఈ రెండే తమకి కావాలన్నట్టు, ఎండనే వెన్నెలగా భావిస్తూ హిప్పీలు!

ఆడా మగా జంటలు-

తెల్ల తొక్కలు మన దేశపు ఎండ కెండి.... వానకి తడిసి.... చలికి రాటుదేరి.... మట్టిరంగుకి మారేయి.

వారు వేసుకున్న 'జీన్సు' మాసి మాసి, నలిగి నలిగి, ధూళిపట్టి, చెమట పట్టి ఆ మాపునంతా ఓరుస్తున్నాయి.

వారి జుత్తు జనపనారలా అట్టలు కట్టింది. కొబ్బరిపీచులా రేగింది. కళ్ళని కప్పుతోంది. భుజాలని తాకుతోంది. గాలివేస్తే కిరీటంలా మీదకి లేస్తోంది.

ఆడదాని రొమ్ములు అగపడుతున్నాయి గుండీలు పెట్టుకోని లాల్చీగుండా. లోన బ్రాసరీలు వాడే అచారం వారికి లేదు కదా!

ఐనా ఆ స్త్రీల అవయవ సౌందర్యం ఎవరినీ ఆకర్షించలేదు. ఎవరిలోనూ కామాన్ని రేకెత్తించలేదు.

అందాన్ని కప్పుతేనే ఆకర్షణ. విప్పితే వికర్షణే.

వారు హిప్పీలు. వారికి సెక్స్ అంత ఆలోచించ తగ్గ ముఖ్యమైన సంగతి కాదు!

బాధ్యతా రహింతంగా! స్వేచ్ఛగా తిరగడం వారికి ముఖ్యం!

దారు తెగిన గాలిపటాల్లా గమ్యం లేకుండా పయనమే వారి లక్ష్యం!

ఆడా, మగా గంజాయి దట్టించిన బీడీలు కాలుస్తున్నారు.

వారి వీపులకి వ్రేలాడుతూ పెద్ద సంచులు. అందులో వారి సమస్త సంపదా!

దేశాలు పట్టిపోయేరు. ఈ దేశంలో వచ్చిపడ్డారు. ఈ నగరంని పట్టుతున్నారు. ప్రవాహంలోని రెల్లుగడ్డిలా ఈ మానవ ప్రవాహంలో తేలుతున్నారు.

సంపన్న దేశాలలోని వీరు, సంపదతో విసుగొచ్చి; ఆ జీవితపు వేగానికి సమస్యలకి తట్టుకోలేక దారి అగమ్యగోచరం కాగా, గమ్యం కోసం ఇక్కడ వాలేరు. ఇక్కడా చీకటే అని తెలిసిపోయింది. మరో దేశానికి పోతారు. ధన సమృద్ధి కలిగించే నిర్వేదంనించి విముక్తికి ప్రయత్నం!

వీరంటే వాణిజ్యలోకానికి ముందుండే గౌరవం పోయింది. ప్రజలకి అంతే!

“వాళ్ళా రిఫ్‌రేఫ్! ఏమీ కొనరు... అమ్మరు! ఏ హోటల్‌లోనూ బస పెట్టరు! రోడ్డుబతుకులు వాళ్ళవి!”

ఏ యాత్రాస్థలంలో నన్నా వీరే! కాశీలో వీళ్ళు.... కన్యాకుమారిలో వీళ్ళు— కాశ్మీర్‌లో వీళ్ళు.... గోవాలో వీళ్ళు!

మన వేదాంతులలా.... సాధు సన్యాసులలా, సంఘాన్ని వదిలిపెట్టి, బాధ్యతలని వదిలిపెట్టి.... కష్టాలని ఎదుర్కోలేక.... బతుకు బరువుని తప్పించుకొని పలాయనం!

పిడికెడు అటుకులూ బెల్లం చాలు— రెండరటిపళ్ళు చాలు.

పడుకుందుకి సత్రపు అరుగో, వీధి ఒడ్డో చాలు.

వారణాసి ఘాట్లమీద హిప్పీలు.... అవులకోసూ.... శవాలకోసూ ఒకటిగా—

గంగానది పడవలనిండా హిప్పీలు—

నాగరికతా పతనానికీ, నాగరికతా తిరోగమనానికి నాందీ ప్రస్తావన వీరు!

మనిషి సమాజాన్ని.... సంఘాన్ని వదిలేస్తున్నాడు.

సంఘాన్ని వదిలిన బుద్ధుడు మళ్ళా సంఘాన్ని ఆశ్రయించేడు. సన్యాసులూ, సన్యాసులూ సంసారులయ్యేరు అనాడు.

ఇప్పుడు మళ్ళా సంసారులు సన్యాసులౌతున్నారు.

హిప్పీ కల్ట్! మన దేశమే పుట్టినిల్లు.

"భవతీ భిక్షాం దేహీ!" రాగిచెంబు కల్చర్.

నాకో గోచి పాతది, నా భార్యకో చింకి చీరా చాలు. పడుకుందుకి నేల చాలు— ఈ పూట కాపూట గంజినీళ్ళు చాలు.

నువ్వు మేడలు కట్టు! ఏం అనం! నువ్వు మంత్రివయి దేశాన్ని దోచుకో! కిక్కురుమనం!

నువ్వెలా పోతే మాకేం?

అహం బ్రహ్మాస్మి! మాయా సిద్ధాంతం గురించీ ఆత్మ గురించీ చింతిస్తాం. మరే చింతా మా కొద్దు.

సంపదా వద్దు! దాని బంధాలూ వద్దు!

మమ్మల్నిలా పడుండనీండి!

నా దేవుళ్ళూ, నా స్వాములూ, నా బాబాలూ, నా గురువులూ నా కుంటే చాలా!

ఏదో ఇలా ముక్కుతూ మూల్గుతూ పడుంటాం!

---

## 16-00 గంటలు

---

— చెత్త లారీలు చెత్తని ఒక్కసారిగా బయటకు పంపినట్టు, పొలుగయిన దగ్గర్నించీ కార్యాలయాలు స్త్రీ, పురుష శరీరాలని రోడ్డుమీదికి విసర్జించేయి

మనిషి రోడ్డున పడ్డాడు.

రోజల్లా డెస్కుముందు సిరా ఖర్చుచేసి, ఇప్పుడు రోడ్డున పడ్డాడు మనిషి.

అరగంటలో, ఎనిమిదిగంటలో పని చెయ్యాల్సి ఉన్నా, రెండుగంటలు కబుర్లు చెప్పి, ఓ గంట ఆవులించి, చేతులు విరుచుకొని, ఓ పావుగంట బాస్‌చేత చీవాట్లు తిని, మరో గంట లంచ్ తిని, ఇంటికి పోయే సమయం రాగా, పని మనిషి చెత్తని విసిరేసినట్టు రోడ్డుమీద విసిరేయబడ్డాడు.

ఇంక వీరు ఆఫీసులకీ, కార్ఖానలకీ ఏమీ కారు.

ఇంటిదగ్గర మాత్రం వయసుబట్టి వేరే పాత్రలు ధరిస్తారు. ఆడదయితే భార్య, తల్లి, కోడలు, కూతురు. మగాడయితే మొగుడు, తండ్రి. అల్లుడు, కొడుకు. వీటిలో ఒకటి కాని, కొన్ని కాని పాత్రలు కలిగుంటారు.

ఆఫీసులో తన కిందివాళ్ళమీద ఎగిరిన అధికారి, ఇంటిదగ్గర భార్యదగ్గర పిల్లి! ఆమె వడ్డించే చీవాట్లకి తయారయి కారెక్కుతున్నాడు.

ఆఫీసర్‌చేత చీవాట్లు తిన్న గుమాస్తా, బస్సుకోసం క్యూలో నిల్చున్నాడు. ఇంటిదగ్గర పులి! పెళ్ళాం పిల్లలమీద విరుచుకపడతాడు.

పెళ్ళాంకి గులామ్ అయిన హెడ్‌క్లర్కు, ఆమెతో సరసం ఆడ్డానికి భయ పడేవాడు ఇవాళ ఆఫీసులోని టైపిస్టు అమ్మాయితో ఆడిన సరసాన్ని మననం చేసుకుంటున్నాడు.

కొత్తగా పెళ్ళయిన కుర్రాడు ఎంత వేగం ఇంటికిపోయి కొత్త భార్యని కౌగలించుకుందాం అని ఉవ్విళ్ళూరుతున్నాడు. హనీమూన్‌లోని హాయి ఇంకా పోలేదు. ఒక పిల్లడు పుట్టేక తేనె కరువు ఏర్పడుతుంది.

అమ్మాయిల క్యూ వేరు. అబ్బాయిల క్యూ వేరు బస్సులకి.

పెళ్ళయిన పడుచులు, కలలలోకంలోనే కాలం గడిపే కన్యలు....
ప్రేమికులున్నవాళ్ళు, లేనివాళ్ళు— ప్రేమంటే తెలిసినవాళ్ళు తెలీనివాళ్ళు-

కొందరికి ఇల్లు నరకం, ఆఫీస్ స్వర్గం. జీతం ఇంటికి పట్టుక వెళ్ళగానే కొట్టుకపోయే మొగుళ్ళు- కొంతయినా ఎలా వెనకేయడం అని ఆలోచిస్తూ! వంటా.... పనీ.... పిల్లలగొడవా... క్షణమైనా విశ్రాంతిలేక, దొరకని జీవితం!

"నా పెళ్ళిమాట ఏమిటి?" "ఎవరితో?" "నీతో!" "ముందు మన ప్రేమ ఫలించనీ! తరవాత పెళ్ళి!" "అదేం కుదరదు! పెళ్ళి సంగతి ముందు చెప్పు!" "నా నాన్ననీ అమ్మనీ అడగనీ!" "మీవాళ్ళకి కట్నము కావాలి. నా అర్జనా కావాలి!" "మవ్వే నా కట్నం!" "ఈ కబుర్లకేం? వారంరోజుల్లో తెల్చి చెప్పు!" ఇటువంటి కబుర్ల ప్లేటు వడుస్తున్న అమ్మాయిలూ ఉన్నారు క్యూలో-

పెళ్ళికాక చదువు- చదువయినా పెళ్ళికాక ఉద్యోగం- ఉద్యోగమైనా







పెళ్ళికాక నైరాశ్యం! పెళ్ళయేవరకూ మగ సంపర్కం లేని ఆడబతుకు! శీలం పోతే పెళ్ళి కాదన్న భయం! డబల్ స్టాండర్డ్స్- హిపాక్రసీ!

బస్సులు వస్తున్నాయి— మానవుల సజీవ కళేబరాలని మోసుక పోతున్నాయి—

ఔను! మేం సజీవ కళేబరాలం!

నౌకర్లం! బానిసలం!

యువర్స్ ఫెయిత్ ఫులీ! యువర్స్ మోస్ట్ ఒబీడియంట్ సర్వెంట్!

నౌకరీ ఇస్తూ కాగితం అందగానే జాయినయి మరలకి బానిసలగా, ఆఫీసులకో గులాములుగా, అధికారానికి తొత్తులుగా మారిపోతాం!

ఒక్క ఆర్డరు! యు ఆర్ హియర్ బై ఎపాయింటెడ్ టు ది పోస్ట్ ఆఫ్....

అది సంపాదించేందుకే కదా మేం ఇన్ని విద్యలు నేర్చింది!

ఓ జీవితపు బానిస బతుకు! నౌకరూ బానిసే.... ఆఫీసరూ బానిసే.... వర్కరూ బానిసే ... మేనేజరూ బానిసే!

మరలకి రక్తాన్నిచ్చి, ఫైళ్ళగుట్టల్లో కూరుకపోయి, ముసలయ్యాక పెంటకుప్పమీద విసరేయబడతాం-

పని చెయ్యి... ఆర్జించు.... తిను.... పిల్లల్ని కను.... పెంచు.... సంసా
రంలో బానిసవు....

ఆధునిక మానవ నాగరికత అనే రాక్షసచక్రంలో చిక్కుకున్న జీవులం-
మాకూ మానవలోకంలోని ఏ ఇతరులకి ఏమీ లేదు భేదం।

ఎలా అర్జనచెయ్యడం? ఎలా ఖర్చు చెయ్యడం- పిల్లల్ని ఎలా కనడం- ఎలా కనకుండా ఉండడం- ఎలా చావకుండా ఉండడం? పిల్ల మరల్ని, పెద్ద మరలగా ఎలా మార్చడం- ఇవే మా ఆలోచనలకి పరిధులు-

మా ఆలోచనలని మలిచేది మా మతగ్రంథాలూ, చదువులూ, పేపర్లూ, రాజకీయాలూ- అన్నింటిదీ ఒకటే ధ్యేయం- ముసలితనం వొచ్చి చచ్చేవరకూ ఎలా బతకటం?? మరణం వరకూ జీవన సంగ్రామం।

బస్సులు వస్తున్నాయి.... వెళ్తున్నాయి....

సముద్రపు అలలు తరగవు.... మానవ ప్రవాహమూ తరగదు!

## 17.00 గంటలు

మనుష్యు లనబడే గార్బేజ్‌ని బస్సులు సాధ్యమయినంత వరకూ మోసే సేక రాజమార్గం కాస్త స్థిమితపడింది-

కాని ఇంతలో ఎదురుమార్గంనించి ఒక ఊరేగింపు।

"నారాయణ! నారాయణ! రామ్ నామ్ సచ్ హై!"

ఆ మాటలు వినబడగానే తెలిసిపోతుంది....

ఎవడో టపా కట్టేసేడు!

ఏవడో అదృష్టవంతుడు బాల్చీ తన్నేసేడు—

మగా? ఆడా?

ఆ కర్రమీద శవమే స్త్రీ ఐతే.... యువతే ఐతే....

కట్నం ఇచ్చుకోలేక పెళ్ళిచెయ్యలేక యాతనే ప్రతినిముషం అనుభవించే అమ్మానాన్నల బాధ చూడలేక మెడకి ఉరితాడు బిగించుకుందా?

అబ్బాయిల అల్లరి, రోమియోల రొమాన్సూ, మగలోకపు చిత్రహింసా భరించలేక "చాలీ బతుకు!" అని బతుక్కి గుడ్‌బై కొట్టేసిన కన్నెపిల్లా?

ప్రేమించినవాడు డోకా ఇవ్వగా వచ్చే జన్మలో చూసుకుందాం అని విషం మింగిందా?

ఆ శవం పునిస్త్రీదే ఐతే....

అత్తగారి టార్చరూ, ఆడబడుచుల సాడిజమ్ భరించలేక కిరోసిన్ ఒంపుక నిప్పంటించుకుందా?

కట్నం తగినంత తేలేదని, మరో పెళ్ళికోసం మొగుడూ, అత్తగారూ కలిసి నిప్పంటేసేరా కిరసిన్ ఒంపి?

"నారాయణ! నారాయణ! రామ్ నామ్ సచ్ హై!"

నలుగురు మోసేస్తున్నారు!

పేలాలూ, డబ్బులూ కలిపి జల్లుతున్నారు! శవం మగదా? శవానికి సెక్స్ ఉంటుందా ఏం? ఎందుకుండదూ? ఉంటుందుంటుంది!

"చచ్చినవాడి కేమండీ మహారాజు! బతికున్న సంసారమే రెక్కలు తెగిన పక్షులు!" అంటూ కొందరు ఏడ్చేరు—

నెలనెలా దవ్వబిళ్ళల్లా రూపాయలు తెచ్చిపెట్టేవాడు— రొట్టెగెలుపువాడు టపాకట్టేసి మరింక మీదారి మీదే, నాదారి నాదే అంటూ పోయేడు! ఇంక వస్తులే!

"పాపం కేన్సర్ అండీ! మంచంమీద రెండేళ్ళబట్టి పడుండి చచ్చేడు! అన్నీ అప్పులూ చేసేరు— తాకట్లూ వాకట్లూ అయ్యేయి— రెండేళ్ళయి జీతం నాతం లేదండి పాపం! సంసారం రోడ్డున పడింది! కట్టుకున్న ఆడదీ, పిల్లలూ వీధినపడ్డారండీ!"

చందాల ముష్టి! సైపుకొట్టిన ప్రార్థనాపత్రం పట్టుకొని పెళ్ళిదమ్మాయి!

"బాబూ! ధర్మం! మా నాన్నగారు కెన్సర్‌తో మంచంమీద పడున్నా రండీ_ తమరి దయాధర్మ భిక్షమీద మేం ఆధారపడి ఉన్నాం!"

ఆమెపైన కోరికల చూపులు_

"పిల్ల పకడ్‌బందీగా ఉందే!" మనసులో_

"ఎన్నేళ్ళమ్మాయ్ నీకు!" పైకి_

"పదహారండి!"

"పదహారేళ్ళవయస్సు!"

"ఔనండి!"

"సాయంత్రం ఇంటికొస్తావా? చందా ఇరవై ఇస్తాను!"

ఆమె ముఖాన బాధ! ఆమె జాలిచూపు వాడిలో జాలి రేపలేదు, కోరికలు రేపిందని ఆమెకి తెలీదా?

తనది ఆకలి చూపు!

వాడిది వరాల కరకర ఆకలి చూపు!

పీడికి కేన్సరేనా? పీడివంటి వాళ్ళు తనకు కేన్సరా?

అమ్మా! పాపం! బెంగతో కుంగి కృశించిపోయింది_

"ఐదుగురు పిల్లలండి మహాప్రభో! ఆ జబ్బు నా కొచ్చినా బాగుండి పోవండి! అతడ్ని రోగం పట్టుక పీడిస్తున్నాడి! మమ్మల్ని దరిద్రం పట్టుక పీడి స్తున్నాది_ కేన్సర్‌కి మందులేదని విడుదల చేసేస్తే ఇంటి దగ్గర పడున్నారండి!"

ఇన్నాళ్ళకి చచ్చేడు! తను నరకంవించి విముక్తి పొందేడు!

కాని శవం ముందూ వెనకా నడిచే కుటుంబ సభ్యులకి ఐతుకే నరకం! ఛావే శూన్యం!

"అయ్యో! ఎంత కష్టం వచ్చిందమ్మా!" పెదవివి దాటని సానుభూతి!

ఇరుగుపొరుగుల మొసలి కన్నీరు!

ఎందుకండీ మీ చుప్‌చుప్‌లూ.... అయ్యోపాపాలూ! కాస్త వారి బరువు మొయ్యరాదుటండీ?

ఎవరి కష్టాలు వారికున్నాయండి బాబూ!

ఉండవుటండీ మరి?

కష్టాలు.... కష్టాలు!

మనుషులు చస్తే కష్టం.... చావకపోతే కష్టం_

ఒకడి కష్టం మరోడి సుఖం! ఒకడి సుఖం మరోడి కష్టం!

చావాలండీ! దండిగా చావాలి! ఈ చావులు చావాలండీ! సెకెండుకి ఒకడు పుడితే రెండు సెకెండ్లకొకడు చస్తే ఎలా? భూభారం ఎలా తగ్గునండీ! అందుకు విష్ణువే పుట్టాలటండీ? రోగాలు చాలవటండి! కలరా, మహమ్మారి, ప్లేగూ అన్ని రోగాల కాటకం ఏర్పడిందండి వీటి సిగతరగా? మరి ధరలు పెరిగిపోతున్నాయంటే పెరిగిపోవటండీ? బ్రతికున్న ప్రతివాడికీ పంచదార, పాలు, బియ్యం, పప్పు, ఉప్పు, వంటనూనె, మంచినూనె, బట్టలు, ఇళ్ళు, చదువులు, ఉద్యోగాలూ ఇన్ని కావాలా? చచ్చినోడికి నాలుగు దుక్కలు చాలు- అంతగా కట్టెలు లేకపోతే గొయ్యితీసి కప్పెట్టేస్తాం!

ఇంతకీ అది ఓ ముసలాడి శవం!

ముక్కుతూ మూల్గుతూ చచ్చేడు ముసలిముండాకొడుకు!

శవంముందు నడుస్తూ మహా జోరుగా తప్పెట్లూ తాళాలూ కొడుతున్నారు ఆస్తికి వారసులు.

ఇప్పుడు తప్పెట్లు కొడుతున్నవాళ్ళ కోసం చచ్చినోడు వయసులో ఉన్నప్పుడు కొట్ట[illegible]సినవాళ్ళ బుర్రలు కొట్టేడు- బుర్రలు మార్చేడు.

"ఇంక అతడు చెయ్యని దుర్వ్యయం లేదు సార్."

"ఏం చేసేడండీ?"

"మందు.... ముండ, ఈ రెండింటినీ తిండీ నిద్రా, భోజనంతోపాటు అనుపానంగా అనుభవించేడు!"

"అంత రసికుడా?"

"చచ్చేకాలానికి ఓ బాబాగారికి శిష్యుడై [illegible] ముఖానికి ముక్కు-మాస్కు తగుల్చుకొని విశ్వాసపాత్రుడిగా మారిపోయేడండి!"

ఆ ఆస్తిని బాబా ఆ శ్రమానికి రాసిచ్చేస్తాడని భయపడ్డ బంధువర్గం బాబానైనా చంపుదాం, పీకనైనా పంపేదాం అనుకున్నారు

"ఎన్నాళ్ళకీ చావడేం ముసలిపీనుగ!"

ఇంక లాభంలేదని, ఓ తెల్లవారు ఝామున నవరంధ్రాలూ మూసేసి స్వర్గానికి పార్సిల్‌గా పంపేరు ఆత్మని కని పెంచిన పుత్రులు!

తరవాత ఒకరితో ఒకరు పోటీపడి మరీ ఏడ్చేరు!

శవాన్ని రాత్రికి ఉంచుతే ఎక్కడ గబుక్కున లేచికూచుంటాడోనని భయంవేసి దహనానికి పట్టుకుపోతున్నారు బంధువర్గం.

చావు కొందరికి ఏడుపు. కొందరికి ఆనందం.

వీరికి మహానందం!

అందరినీ ఆనంద సముద్రంలో ముంచి ఆయన దివ్యవాణిని చేరుకున్నాడండీ! ధన్యుడు!

రేపింక ఆస్తుల పంపకంకోసం శిఖపట్ల గోత్రం!

## 17-30 గంటలు

ఇంతలో ఎటునుంచో ఒక పెద్ద ఊరేగింపు!

ఉదయం ఊరేగించబడ్డ నాయకుడి వ్యతిరేక పార్టీది.

వీళ్ళంతా తీవ్రవాదులు! ఉగ్రవాదులు!

బల్లేలు పట్టుకున్నారు. పెద్ద లాఠీలు పట్టుకున్నారు.

"ఇంకానా! ఇకపై సాగదు!" అంటూ కేకలు వేస్తున్నారు.

"విప్లవమూర్తీ" "జిందాబాద్! జిందాబాద్!"

"ఉక్కు పిశాచ్ రావ్!" "ముర్దాబాద్, ముర్దాబాద్!"

వాళ్ళు కుడి! వీళ్ళు ఎడమ. వారిది దక్షిణం. వీళ్ళది ఉత్తరం!

వీరి నాయకుడు లారీలో లేడు. ముందు నడుస్తున్నాడు!

మైక్ పట్టుకొని గొంతు చించుక అరుస్తున్నాడు!

వీరిలా ఊరేగింపు జరుపుతారని ఉదయం ఊరేగిన పార్టీవారికి తెలుసు.

వారు గెలిచి పదవిని చేపట్టినవారు!

వీరు ఓడి ఏ పదవీ లేనివారు!

"మాకే ఎదురు పెడదామని ఊరేగింపా? చిన్న ఓడిపోయేరు సిగ్గులేదా? మీ పని పడతాం ఖబడ్దార్!" అంటూ కుడిపార్టీవాళ్ళు ఓ వంద మంది గూండాలకి డబ్బిచ్చి నియోగించి, ఈ ఊరేగింపుని ఢీకొందుకి ఎదురుగా వచ్చేరు! వారూ తగు సరంజామా పట్టుకొచ్చారు!

వాటికి ప్రతిగా వీరూ మారణాయుధాలని సమకూర్చుకొనే వచ్చేరు.

సాయంత్రం ఆరుగంటల సమయానికి సిటీ సెంటర్, కురుక్షేత్రంగా మారింది.

రెండు పార్టీలవారూ ముఖాముఖీ నిలబడ్డారు! శంఖాలు పూరించేరు. సింహనాదాలు చేసేరు!

ఈ సంగతి తెలిసిన పోలీసులు లాఠీలతో, బాష్పవాయువుతో లాఠీల

లోంచి దిగేరు. రంగంలోకి దిగకుండా సందులో నిఘా వేసి ఉంచేరు దళాన్ని కలెక్టరూ, ఎస్పీ! యుద్ధం ఆరంభం అవుతే నేళాని రంగంలోకి దిగి ఏంలాభం?

పోలీసు రూలు ఒకటే. ఎల్. ఎస్. డి. లెట్ ది సిట్యువేషన్ డెవలప్! పరిస్థితి గమనించు! వాటిగయిదు తలలు పగుల్తేనే తప్ప జోక్యం కలిగించుకోకు!

అవీ పైనించి ఆదేశాలు!

ఎలక్షను గెలిచి పవర్‌లోకి వచ్చిన పార్టీవారు, ఎదుటి పార్టీవారిని ఊరే గింపు సాగనివ్వకుండా ఆపి, కన్నడానికి తయారవడంవల్ల పోలీసులు గాజులు తొడిగించుకోవలసి వచ్చింది!

అసలు యుద్ధంలో 'ఎటాక్' అనగానే అన్ని దళాలు ముందుకు దూకు తాయి.

ఈ యుద్ధం అలా కాదు! ఎవడూ ఎటాక్ అనడు.

ఎడమపార్టీ మీదకి, కుడిపార్టీ కుర్రకారు జనం నాలుగు మెట్లుదిగి రాళ్ళు రువ్వేరు!

దాంతో విప్లవమూర్తి మనుష్యులు మరింత గట్టిగా నినాదించేరు. రాజ కీయ భాషలో కుక్కుటేశ్వరరావుని బండబూతులు తిట్టేరు.

"ఒరేయ్ కుక్కుటం! పెట్టుబడిదారీ వర్గం కుక్కా! మా ఎదురుగా రారా! నీ అంతు తేలుస్తాం రారా! ఏం చేసేవ్‌రా పీడిత ప్రజలకి! ధరలు ఆకాశాన్నంటుకుంటున్నాయిరా! ఒరే లంచగొండి ల కొడకా! డబ్బున్న కు.... కొడుకుల దగ్గర డబ్బు దండీగా దొబ్బి ఎప్పట్లు, ప్రయివేట్ ట్రస్ట్‌లూ ఏర్పరచుకున్నావురా? ఒరేయ్ సి ఐ ఏ. ఏజెంట్లూ! దమ్ములుంటే రండ్రా! ఈ తొత్తుల నెందుకురా పంపేరు?"

అని వారు అరుస్తున్నారు- దానికి జవాబుగా వీరూ గట్టిగా అరిచేరు-

"ఒరేయ్ విప్లవమూర్తీ! నువ్వు చేసిన విద్రోహం ఏమిట్రా? నీకు వీరంటూ చీమూ నెత్తురూ, అన్నా ఉన్నాయిరా? నువ్వు ఎర్రదేశంవాడి నమ్మిన బంటువి కావూ - రేయ్ గా కొడకా! నువ్వు కె.జి.బి ఎజెంటువి కావూ? కోట్ల కొద్దీ విదేశీడబ్బు నీ పేరున బ్యాంకుల్లో మూలగటంలేదూ? నువ్వెక్కడుంటే అక్కడే అరాచకం! దోపిడీ! దొమ్మీలు! నువ్వు ప్రజలపాలిట యముడువి!"

ఇలా ఒకరి నొకరు ఉద్రిక్త పరుచుకున్నాక కుక్కుటేశ్వరావు మను ష్యులూ, విప్లవమూర్తి వర్కర్లూ కలబడ్డారు-

బలాబలాలు ఢీకొన్నాయి- యుద్ధం ఆరంభం అయిపోయింది!

నాటు బాంబులే విసరిరీ! సై ....!
బల్లెలతోనే పొడిచిరీ! సై ....!
లాఠీలతోనే బాదిరీ! సై ....!
కిరసనాయిలే పోసిరీ! సై!
శకటాలకి నిప్పంటించిరీ! సై ....!
నాటుతుపాకులే పేల్చిరీ! సై ....!
భళా బాయిరా తందనా! భాయి భళారోయి తందానా!

ఈ యుద్ధంలోకి పిలవని పేరంటంలా దిగిపోయేరు గూండాలూ, దొంగలూ, దెకాయిట్లూ....! దుకాణాల్లో దూరి చేతికి దొరికింది ఎత్తుకుపోవటం ప్రారంభిం చగా దుకాణాల షట్టర్లు మూతలుపడ్డాయి—

ఇవ్విద్ధంబుగా ఇరుపక్షాలవారికీ పోరుసాగి పావుగంట కాలం గడవగా... పది పాతిక తలలు పగలగా.... కొన్ని బస్సులు కాలగా.... కొన్ని మృత దేహాలు కింద కొరగగా.... అప్పుడు

పోలీసులు రంగంలోకి దిగేరు— సుగ్రీవుడు ఓడే సమయానికి రాముడు రంగంలోకి దిగినట్టు—

లాఠీచార్జ్ చేసేరు!

ఏనుగు పొడవడానికొస్తే లాఠీచార్జి చేసినట్టే ఐంది!

టియర్‌గాస్ షెల్సు పేల్చేరు! కన్నీరు తెప్పించగలిగేరు కాని కొట్లాట కంటిన్యూ ఐంది!

ఇద్దరు పోలీసు ఎస్.ఐల తలలు ఫెడీల్‌మని పగలడంతో.... పక్కనే ఉన్న మేజిస్ట్రేటు అనుజ్ఞనిచ్చింది.... "ఫైర్!" అన్నారు ఎస్పీ!

ధనాధన్! ధనాధన్! తూటాలు పేలేయి—మానవాకారాలు నేలకొరిగేయి—

ఇంతలో ఫైర్ ఇంజన్లు గంటలు మ్రోగించుకుంటూ ప్రదర్శనకారుల మీద నీళ్ల చిమ్మరించేయి— తరవాత బస్సుల మంటని ఆర్పేయి—

ఊరేగింపు చిందరవందరయింది—

ఏంబ్యులెన్సులు వచ్చి నేలకూలినవారిని మోసేసేయి—

యుద్ధం ఆఖరయింది— చచ్చినవారు చావగా, బతికున్నవారు మీ పని మరో రోజున పడతాం అని మీసాలు దువ్వి, తొడలు చరిచి మరీ రంగంనించి తప్పుకున్నారు!

మళ్ళా రాజమార్గం యథాస్థితికి వచ్చేసరికి చీకటిపడింది!

ఒక ఫీటు అవగానే రెండో ఫీటు కోసం సర్కస్ రింగు వెంటవెంటనే తయారయిపోయినట్టు, జంతువుల ఫీట్ల తరవాత మానవుల ఫీట్లు ప్రారంభం అయినట్టు, కాలిన బస్సులని సందుల్లోకి లాగేసేరు— రాళ్లూ రప్పలూ తుడిచేసేరు— ఆల్ క్లియర్!

లైట్లు జిగాజిగ్ వెలిగేయి! మళ్ళా నాగరికత తన బతుకుని ప్రారంభించింది.

క్షణం క్రితం యుద్ధం!

ఇప్పుడు శాంతి!

## 18.30 గంటలు

"అయ్యో నా పర్సు పోయింది! ఆపండి బస్సుని!" ఒక బస్సుప్రయాణీకుడి గావుకేక

"పర్సు పోకపోతే మరేం పోతుందయ్యా బస్లో! దొంగలున్నారు జాగర్త అని రాయించేమే! ఉంటారు జాగర్త అనికాదా కాదు! ఏకంగా ఉన్నారనే రాయించేమే! పర్సు జాగర్తగా అట్టేపెట్టుకోవటయ్యా!" కండక్టర్ అదమాయించేడు.

"జాగర్తా పెట్టుకున్నాను! పిన్నుకూడా పెట్టేను! బ్లేడుతో జేబు కోసేసేడు! వెంటితం! వాడ్ని పట్టుకోవాలి బాబ్బాబు!"

కండక్టర్ బస్సుని ఆపించేడు—

పర్సు లాగేసినవాడు బస్సులోంచి గెంతి పరుగు లంఘించుకున్నాడు—

అతడి వెంట పర్సుపోయినవాడి పరుగు. "పట్టుకోండి! పట్టుకోండి!"

పర్సు కొట్టేసినవాడుకూడా "పట్టుకోండి! పట్టుకోండి!" అంటూ అరుస్తూ పరుగు— రోడ్డుకి అడ్డుగా పరుగు తీసి, ట్రాఫిక్‌ని తప్పించుకుని, అవతలిగట్టు చేరుకుందాం అనుకున్నాడు—

ఆహా నదీప్రవాహంలా ట్రాఫిక్ ప్రవాహం!

ఎలాగ తప్పించుకో పరుగుతీసినా ఒక శకటం ఢీకొంది!

కీచుమనే బ్రేకులు! నేలమీద రక్తపు మడుగులో మనిషి!

చేతిలోని పర్సు రక్తపు ప్రవాహంలో తడిసింది— పర్సులోని చిల్లర క్రింద తుళ్లింది—

యువకుడే— మంచి ఇస్త్రీ బట్టలు వేసుకున్నాడు— ఇంతకాలం వడిచిన



అతడి హస్తలాఘవం ఈ క్షణం ఆగిపోయింది— బతుకుతెరువుకోసం మరి పర్సులు కొట్టక్కర్లేదు—

వందల కొద్దీ వాహనాలు ఇటూ అటూ ఆగిపోయేయి—

"అది నా పర్సు" పర్సుపోయినవాడు ముందుకి వంగి అరిచేడు—

"మీ పర్సు ఇక్కడి కెలా వచ్చింది?" అక్కడ హాజరయిన పోలీసు అడిగేడు.

"బస్సులో కొట్టేసేడు. నేను బస్సు ఆపించి వెంటపడ్డాను."

అప్పుడు తట్టింది— తను వెంటపడే ఉండకపోతే వీడు బతికే ఉండును.

"వీడు నా పర్సు కొడితే, నేను వీడి ప్రాణం కొట్టేసేనా?" అనుకున్నాడు.

చచ్చినవాడు దొంగ అని తెలిగానే ప్రేక్షకుల సానుభూతి పోయింది—

"తగిన శిక్ష! ఎంతకాలం అన్యాయం, దొంగతనం సాగుతాయి? వాడి పాపమే వాడిని తినేసింది."

"వీడేం దొంగండి పాపం? ప్రజల్ని పట్టపగలే దోచుకునే నల్లబజారు వాడిని ఏ పాపం ఎందుకండీ బెడిసికొట్టదు?" ఒకడడిగేడు—

"నా పర్స్ తీసుకోనా?"

"పనికిరాదు! బ్రేక్ ఇన్స్పెక్టర్ రావాలి! గుద్దిన బండీ క్లియరవాలి— పర్సు పోయిందని కంప్లేంటివ్వాలి— ఆ పర్సు మీదేనని రుజువవాలి!"

"అయినట్టే!"

ఇంతలో సైరన్ మోగించుకుంటూ పోలీసుకారూ.... ఏంబ్యులెన్సూ వచ్చేయి—

ఇక్కడ ట్రాఫిక్ ఆగిపోతే పట్నమల్లా ట్రాఫిక్ ఆగిపోతుంది. అందుకని వెంటనే శవాన్ని కదిపి, ట్రాఫిక్ క్లియర్ చెయ్యాలి.

స్ట్రెచర్మీద శవం- స్ట్రెచర్ అంబులెన్సులోకి వెళ్ళింది. అంబులెన్స్ హాస్పిటల్ వేపు పరుగుతీసింది.

మనిషిని చంపిన కారు బ్రేకిన్స్పెక్టర్ చేతిలో పడింది. దాని యజమాని అతడి జేబులో రెండు కరకరలాడే కరెన్సీనోట్లు పెడుతూ, మరో మూడు కరకరలు ఇస్తానని వాగ్దానం చేసేడు.

ఆయన చిరునవ్వుతో, "ఐదుతో సరిపోయే సంగతా ఇది? నీ కారు బ్రేకులు బాగానే ఉన్నాయి! నీకు డ్రయివింగ్ రాదు!" అన్నాడు.

కమేండర్ వేలెట్ తీసి ఎనిమిది పచ్చనోట్లు లెక్కపెట్టి ఆ ఫారిన్ కారు యజమాని ఇవ్వగా... "మీరు మాత్రం ఏం చెయ్యగలరు? వాడి కాయువు మూడింది చచ్చేడు! వెనక చక్రంకింద పడ్డాడు!" అంటూ చక్రం అడ్డువెయ్యడమే కాక, "దొంగవెధవ! వాడు బతుకుతేనేం? చస్తేనేం? అక్కడ పెడస్ట్రియన్ క్రాసింగ్ లేదు! వాడు దాటడం అక్కడ నేరం!" అంటూ పాయింటుకో పాయింటు తగిలేడు!

రోడ్డుమీద పర్సుని పోలీసులు ఎత్తుకపోయేరు!

బ్రేకిన్స్పెక్టర్ పోయేక పోలీసులు చేతులు చాచేరు కారువాడిముందు.

"కారుండడమే నేరంలా ఉంది!"

"అదేంటి సార్ ఆలాగంటారు! తమవంటి ఫారిన్ కార్లున్న అదృష్ట వంతులు అప్పుడప్పుడు ఏక్సిడెంట్లు చెయ్యడం మా అదృష్టం! లేపోతే మా వంక తమరు చూస్తారా సార్? మేమంతా తమరి సేవాభాగ్యం కలిగించుకుందుకే కదా ఉన్నాం!"

"ఎంత?"

"ఇంతని ఏముంది? తమకి తోచినంత! తం(వ)రి నెల విస్కీబిల్లే అవు

తుంది రెండువేలు! తాగందే తమరు కారు నడపడం తమ దిగ్నిటీకి లోపం!"

"నేను తాగేనా!!?"

"ఎంతమాట సార్! తమరు మందు సేవించేరు! అలగా జనం తాగు తారు కాని తమరి సంగతే వేరు!"

మరో పది పచ్చకాగితాలు పర్సులోంచి చేతులు మారేయి.

కారోనరు పోయేదింటికి కారు తోలుకుంటూ. ఇదివరకు కన్న ఎక్కువ స్పీడుతో తోలేడు. అతడికి తెలుసు. మరోడ్ని గుద్దేస్తే ఫరవాలేదని! మనిషి ప్రాణంఖరీదు అతడి లెఖ్ఖలో రెండువేలు! చవకే! తనకి రోజుకి ఆర్జన పదివేలు ఇనపవ్యాపారంలో.

"నా పర్సు సార్!"

"ఎవరు మీరు?"

"పర్సు పోయినవాడినండి!"

"మీ వల్ల ఒక నిండుప్రాణం పోయింది. పర్సులో ఎంత ఉండెను?"

"నా నెలజీతం! ఆరువందల అరవై!"

లెఖ్ఖపెట్టగా ఆరువందల అరవై రూపాయల పదిపైసలుంది! "ఇది మీ పర్సు కానేకాదు! ఇందులో ఆరువందల అరవై రూపాయల పదిపైసలున్నాయి! మీ మీద ఐ.పి.సి. సెక్షన్‌కింద దొంగతనం నేరం మోపాల్సొస్తుంది!"

"నా మీదా! అదేంటి సార్! అది నా పర్సు కదా? యిది మరీ ఘోరం సార్!"

"నువ్వు పర్సు కొట్టేసి, ఆ రెండోవాడి కిచ్చేసేవ్! ఇప్పుడు అది నీ దంటున్నావ్!"

"హరిహరీ!"

"హరీ లేదు!.. గిరీ లేదు!.. ఏయ్ టువాట్‌టు! వీడ్ని బొక్కలో తొయ్యి!"

"అయ్యా పర్సు కావలిస్తే ఉంచుకోండి కాని నన్ను బొక్కలోకి మాత్రం తొయ్యకండి! మీకో దండం! మీ ఇన్వెస్టిగేషన్‌కో దండం! శలవ్!"

"ఈ సారికి వదుల్తున్నాం వెళ్ళు! మరోసారి దొరికేవో గూళ్ళు విరిచేస్తాం!"

అతడూ లెంపలేసుకుని పోయేడు.

రాజమార్గం నోరులేక ఊరుకుంది!

దాని ఒంటిమీద చిమ్మబడ్డ రక్తాన్ని రబ్బరుటైర్లు తుడిచేసేయి మరో అరగంటలో!

ఆగిపోయిన బస్సులు కదిలేయి. ఎందరెందరికో పనులు అరగంటకాలం స్తంభించిపోయేయి కొందరు సినిమాకి సకాలానికి చేరుకోలేదు. కొందరు తమ కోసం వేచివుండే అంగనలని కలుసుకోలేకపోయేరు. కొందరు విషాదం మిస్ అయ్యేరు.

## 19.00 గంటలు

ఎక్కడ చూసినా నియాన్ దీపాలు, నియాన్ దీపాల ప్రకటనలు.

షాపులన్నీ మళ్ళా యథాప్రకారం రోరింగ్ బిజినెస్ సాగించేయి.

కొనడం అమ్మడం వ్యాపారం ముమ్మరంగా సాగింది మళ్ళా.

వస్తువులకి కొను- అమ్ము-

మనుష్యులకి కొను- అమ్ము-

సినిమాహాల్ ముందు స్ట్రీట్ వాకర్లు- కిరాయికి దొరికే అమ్మాయిలు-

గంటవారీ కామాన్ని సరఫరాచేసే మానవ యంత్రాలు.

ఆ వస్తువుకోసం వెతికే మగాడికి ఆమె కనపడిపోతుంది.

ఆమె చురుకుమనే చూపులూ.... ముందుకు వెళ్ళి ఒక్కసారి మెడ వెనక్కి తిప్పి చూపులు విసరడాలూ-

ఆమెకి తెలిసిపోతుంది.... ఎవడు కాముడి బాణాలు తగిలి గిలగిల లాడుతున్నాడో.... ఎవడి జేబులోని డబ్బు అతడి కోరికను తీర్చగలదో. ఎంతో మందికి కోరిక ఉంటుంది. డబ్బుండదు. కొనలేని వస్తువును షోకేస్‌లో చూసి వట్టి చూస్తారు.

ఈ విలాసినులకి మధ్యవర్తు లుండరు.

ఎవరి వ్యాపారం వారిది. సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంటు. శరీరమే మదుపు.

విసిరిన ఎరకి చేప చిక్కుకోగానే పక్కసందులోకి మళ్ళుతుంది.

దగ్గర్లోనే ఉన్న గదికి గేలానికి తగిలిన చేపతో పోతుంది.

ఇల్లులేని అమ్మాయి టాక్సీ ఎక్కుతుంది. టాక్సీ నడుస్తూ ఉంటుంది. వెనక సీట్లో ప్రణయం సాగుతూ ఉంటుంది.

ముందు కాసు- తరవాత క్రాసు.

ఓ అరగంట తరవాత కామంపోయిన కాముకుడు, తేలికపడ్డ పర్సుతో రోడ్డెక్కుతాడు.

ఒకవాడు ఆమెకి త్రోకర్లుండిరి.

ఒకనాడు అమెని వెతుక్కుంటూ మగజాతి వెళ్ళేది.

ఈనాడు ఆమె ఏకాకి.

ఆమె మగజంతువుని వేటాడవల్సి వస్తోంది.

ఆడ ఒళ్ళనే యంత్రం కామజ్వాలలని ఆర్పి ఆర్పి అరిగి, సడలిపోయింది.

శరీరానికి స్పేర్‌పార్ట్‌లు దొరకవు కనక.... యవ్వనం సడలుతూ ఉండగా.... కారుకి రంగు వేసినట్టు శరీరానికి ఖరీదైన కోకలు.... ముఖానికి రంగులూ కొట్టి లేని యవ్వనం ఉందని ప్రకటించుకుంటుంది.

"నన్ను కొనండి!" అని ప్రకటించుకొనే సాధనంలేక చూపులతోనే వేషంతోనే, యౌవనంతోనే ప్రకటించుకొంటూ పేవుమెంట్లమీద.... రోడ్డుమీద.... సినిమాహాల్సముందు... విధివంచిత వనిత!

ఎత్తయిన మేడల మీద దీపాల ప్రకటనలు—

అద్దాల షోకేసులలో వస్త్రప్రదర్శనలు—

చీరలు చుట్టుకున్న ప్రాణంలేని అడబొమ్మలు ప్రాణమున్న మగాళ్ళలో కామం రెచ్చకొడుతూ....

"చీరొద్దు! బొమ్మనే పట్టుకపోతాను!" అన్నంత తీవ్రభావాలు కలిగిస్తున్నాయి—

వినోదం కోసం వెతుక్కుంటూ విలాసంగా కార్లలో వచ్చిన మానవులు రోడ్డుపక్కని కారాపి షికార్లుకొడుతూ—

ఖరీదైన వస్తువులని గడ్డిపోచల్లా కొనేసే మనుషులూ....నిత్యావసరాలని కూడా కొనుక్కోలేని మనుష్యులూ భుజాలు రాసుకుంటున్నారు అంగటిలో!

సెకెండ్ హేండ్ పుస్తకాలు అమ్మే దుకాణం దగ్గర మూక—

దొంతర్లుగా రాబిన్స్ పుస్తకాలు— నరాలని సలసలా మరిగించే ప్లాట్లు! వాటిలో పాఠకుల పాట్లు! బూతునన్నివేశాలకోసం వెతికేవారి కళ్ళు! మహా బూతు రచయిత!

ఒక రచయితా రచయిత్రీ బెస్ట్‌సెల్లర్ రాయగానే అదే బాణీలో అతడూ, ఆమే వందలకొద్దీ, కిలోలకొద్దీ అదే రొడ్డకొట్టు సాహిత్యం రాసి పాఠకుల మెదడుకి కాక, ఎమోషన్స్‌కి మేతగా పడేయటం— చదివేసేక ఆ పుస్తకం విస్పంటించుకుందుకి తప్ప మరెందుకూ పనికిరాదు!

ఒక షోకిల్లా కుర్రాడు ఒక ఫోటోగ్రాఫ్ మేగజైన్ అట్టమీద నగ్నసుందరిని ఆకలితో అవురావురని చూస్తున్నాడు—

"అసలు బొమ్మలున్నాయి కొంటారా?" చిన్న గొంతుతో అడిగేడు—
"అసలంటే?"
"అదే.... అదా .... మగా శృంగారచేష్టలు!"
"చూపు!"
"కొంటే చూపుతాను!"
"నచ్చితే కొంటాను!"
"నచ్చడానికేముంది? నీట్ గా, స్పష్టంగా కనిపించే పోజ్ లు!"
"సరే! తే!"

కష్టమర్ ని పక్కసందులోని ఓ చిన్న దుకాణంలోకి తీసుకపోయి ఎక్కడ్నించో తీసి చూపేడు!

షోకిల్లా యువకుడు అదిరిపోయేడు! కోణార్క్ ని మించిపోయి ఉన్నాయి బొమ్మలు! అవి రాళ్లు— ఇక్కడ మనుష్యులు, నగ్నంగా శృంగారం జరిపే స్త్రీపురుషుల ఫోటోలు—

కాని ఫోటోల్లోని స్త్రీపురుషులు అరిగిపోయిన రికార్డుల్లా ఉన్నారు— వారి శరీరాలు విసరేసిన అరటిపండు తొక్కల్లా ఉన్నాయి— పేలిపోయిన బెలూన్లలా ఉన్నాయి— చీలిపోయిన అరటి బోదెల్లా ఉన్నాయి— మానవత్వంలేని ప్రేతకళ ఉంది ముఖాల్లో—

అందులోని పురుషరూపాలు— చప్పిదవడలతో క్షయరోగుల్లా ఉన్నాయి.

వారి ఒళ్లు సుఖరోగాల మయం అని ఫోటోలు చూడగానే— రక్తపరీక్షలు జరపకుండానే తెలిసిపోతుంది.

ఆ బొమ్మలనే అలగా చూపేడు షోకిల్లా యువకుడు.

నాలుగు ఎంచుకున్నాడు. "ఎంత?"
"ఒకటి నాలుగు!"
"నాలుగు ఒకటి!"
"సరిసరి! నా బొమ్మలు కొన్నట్టే ఉంది మొహం!"
"నాలుగు రెండు!"
"వెళ్లు.... వెళ్లు!"
"ఒకటి.... ఒకటి!"
"సరే ... తే!"




డబ్బులు చేతులు మారింది. అక్కడే నిలబడ్డ పోలీసు కర్రాడించుకుంటూ వచ్చేసరికి అతడి చేతులో అర్ధ పదేపేడ! "ఎలా తగుల్తుందో వానన ఈళ్లమ్మ! కుక్కిల్లా ఎంట తగుల్తారు!" తిట్టుకున్నాడు అమ్మకందారు.

కూల్‌డ్రింక్ స్టాల్స్ బ్రిస్కుగా వ్యాపారం చేస్తున్నాయి.

మిక్సర్లు గిర్రున తిరుగుతూ అనాసపళ్లనీ, నారింజతొనలనీ, మామిడి పళ్లనీ రసంగా మారుస్తున్నాయి. తిరుగుతూ సైరన్‌లా శబ్దం- మంచుముక్కలతో కలయిక.

"ఐస్‌కోల్డ్ సార్!"

ఆ రసం తాగి దాహం తీర్చుకుందుకి ఆబగా నిలబడ్డారు జనం.

తాగాక దాహం ఎక్కువయిందే కాని తగ్గందే!

మళ్ళా చల్లటి మంచినీళ్లు తాగాల్సి వొచ్చింది!

"మదరాసీ రెస్టారెంట్‌లో దూరి దోసెలు తిందామా?" ప్రియుడ్ని ప్రియురాలడిగింది!

"నీ ఇష్టం పద!" మగాడికి ఛాయిస్ ఎక్కడుంది పాపం?

లోనికి వెళ్ళేరు.

జనంతో కిటకిట కటకట లాడుతోంది హోటలు.

దోసెలు నముల్తూ, ఇడ్లీలు మింగుతూ, గారెలు తింటూ ప్రతి టేబిలు దగ్గరా వాలుగేసి నోళ్లు! ముప్పయిరెండూ ఇంటూ వాలుగేసి దంతాలు. రుచి చూస్తూ వాలుగేసి నాలుకలు!

జాగా దొరికేసరికి పావుగంట నిలుచోడం- మ్యూజికల్ ఛెయిర్లా పరుగు కాశీ ఐన సీటుకోసం! కూర్చున్నాక....

"ఏం కావాలి సార్?"

"ఏముంది?"

చెప్పేడు

"దోసెంత?"

"సాదా రూపాయి. మసాలా దోసె రెండు. స్పెషల్ మసాలా మూడు!"

"అబ్బ! అంత ఖరీదే!" అమ్మాయిగా రన్నారు.

"సరదా ఖరీదైనది డియర్! ఎంత ఖరీదైతే అంత ఆనందం!" మగా రన్నాడు.

"రెండు స్పెషల్ మసాలా డబల్ రోస్ట్.... బట్టర్ వేసి కాల్చమను!"

"సరేనండి!"

దోసె తినడం ఐంది. తరవాత ఐస్‌క్రీమ్ తినడం ఐంది. బిల్లు పన్నెండు.

ఒక ఆడ, మగ కలుస్తే సంసారం.

సంసారమే లేకపోతే సమస్త జగత్తే క్లోజ్!

సంసారమే పెద్ద వ్యాపారం!

స్త్రీ పురుషుడుకి పెర్మనెంట్‌గా ఒంటిని అమ్మేస్తుంది పుస్తె కడితే చాలు. నో క్వెశ్చన్స్ ఆస్క్డ్! ఎప్పుడు పడితే అప్పుడు... ఎక్కడ పడితే అక్కడ.... నా తనువూ, మనస్సూ సంపదా నీదే!

"సంతోషం అమ్మాయ్! నువ్వు నా అర్ధాంగివి! కట్ట బట్ట . తిన తిండి.... నిలవ నీడ.... పిల్లలు ... ఇవన్నీ ఇస్తాను....కాని... కొన్ని షరతులు!"

"ఏమిటండీ అవి?"

"ఇంటి చాకిరీ, నా ఒంటి చాకిరీ నీదే! నే ఎక్కడికి పోయినా, ఎలా తిరిగినా, ఎవరితో తిరిగినా ప్రశ్నించరాదు! పెట్టింది తిని, ఇచ్చింది కట్టుకొని, చచ్చినట్టు పడుండాలి!"

"సరే ప్రాణనాథా!"

వాయించండ్రా భజంత్రీలు!

ఆడది మగాడ్ని కొనుక్కుంది— మగాడు ఆడదాన్ని ఉంచుకున్నాడు— వ్యాపారం.

పిల్లలకి చదువులు చెప్పించేడు తండ్రి.... ముసలికాలానికి అందుకొస్తారని.... వ్యాపారం.

కోడలు కావాలంటోంది తల్లి వంటపని అప్పగించడానికి— వ్యాపారం—

భజగోవిందం....! భజగోవిందం....! ఆఖరికి సన్యాసం- వ్యాపారం-
ఈ సంసారాలు నడవడానికి పరిశ్రమలు... వాణిజ్యం- వ్యాపారం.
కూడుకోసం కోటి విద్యలు- వ్యాపారం-

## 19-30 గంటలు

ట్రాఫిక్ దీపాలు ఎరుపురంగుకు మారగానే శకటాలు ఆగిపోయేయి.
ఎన్నో వందలకార్లు ఇటూ అటూ.
ఒక విదేశీ కారులో కూర్చున్న....
విలన్ భయంకరుడు.... స్త్రీజన రంజకుడు.... నటకాగ్రేసర చక్రవర్తి
.... ప్రజానటుడు.... బిరుదాంకితుడూ.... అయిన సూపర్‌స్టార్....
ప్రేమ్‌కుమార్ విసుక్కున్నా ఓపిగ్గా కూచున్నాడు....
మూడో షిఫ్టు కాల్‌షీట్లకి పోతున్నాడు పాపం!
ఎంత నటించినా ఇంకా.... ఇంకా.... ఇంకా నటించమంటున్నారు
ప్రొడ్యూసర్లు....
చూస్తాం ... చూస్తాం... విన్నే చూస్తాం! అంటున్నారు ప్రేక్షకులు.
"మరి నాకు హీరోగిరీ వద్దు బాబోయ్! మరి నేను కుప్పిగెంతులు గెంత
లేను.... పిల్లిమొగ్గలు వెయ్యలేను! పడుచుహీరోయిన్లని కౌగిలించుకోలేను....
వాళ్ళ బరువు మొయ్యలేను ... వాళ్ళ ఒళ్ళు ఈడ్దలేను.... వాళ్ళ దెబ్బలకి
తాళలేను!" అంటూ ఎంత మొత్తుకున్నా వినరే!
"తమరలా అంటే ఎలా సార్! తమరు నిత్యయవ్వనులు- అమర నాయ
కులు! ఇద్దరు హీరోయిన్లని అవలీలగా ఎత్తుకోగలరు సార్! ఆడలాడించగలరు
సార్! పాటలు పాడించగలరు సార్!" అంటూ ఒకటే కాకా!
హీరో ప్రేమ్‌కుమార్‌ని ఎవ్వరూ ఈ క్షణం గుర్తుపట్టకపోవడం అతడికి
ఎంతో నిరాశ కలిగించింది! కారులోని దీపం వెలిగించేడు.
అయినా ఎవరూ గుర్తుపట్టలేదు....
ఎందువల్ల? ఎందువల్ల?
కారు అద్దంలో తన ముఖం అగపడగానే టక్కున అర్థమయింది!
తనని తానే గుర్తుపట్టలేకపోతే! అన్యుల మాట అలా వదలండి!

అది నేనేనా? ప్రతి పత్రికలోనూ పంచరంగులలో అగపడె సూపర స్టార్ ప్రేమ్‌కుమార్ మొహమేనా అది!

ముఖంనిండా ఆ ముడత లేమిటి? ఆ చప్పి దవడలేమిటి? ఆ ఫట్ట బుర్రేమిటి? ఆ పండువెంట్రుక లేమిటి?!

ఇదా తన మేకప్ లేని ఆకారం! ఇదా తన దివ్యసుందర విగ్రహం!

పళ్ళు పుచ్చిపోతే పీకించి పళ్ళు కట్టించుకోడం జరిగింది.

పొట్ట ఎదిగిపోతే లోపల కోలుపటకాలు పెట్టి బిగించటం జరిగింది.

గుండె వాల్వ్ పాడయితే దానివి మార్పించుకోడం జరిగింది.

ఒక్కసారి కారు దిగి.... "మహాజనులారా! నేనే ప్రేమ్‌కుమార్‌ని! ది గ్రేట్ సూపర్‌స్టార్‌ని ప్రేమ్‌కుమార్‌ని నేనే! కనులారా చూడండి!" అంటూ కేకవెయ్యాలనిపించింది.

అలా చేస్తే వెంటనే ప్రజలు తన మీదపడి నాలుగు తాపులు తంతారు! చెప్పూ లూడగొడతారు— బూతులు తిడతారు! తమ అభిమాన హీరోని అవమానపరిచినందుకు!!

ఒక నిశ్చయానికి వచ్చేరు.

ఇకనించి ఇంటిదగ్గరే మేకప్పయి బయల్దేరుతాను! నా అభిమానులని నిరుత్సాహపరచను!

లైట్లు గ్రీన్‌కి మారేయి. కార్లు ముందు కురికేయి!

• • • •

రేసింగ్ పుస్తకాలు సార్! సాటర్‌డే రేసింగండి!

రేపు ఆరు రేసులండి! డెర్బీ రేసేనండి!

వేలకొద్దీ రేసింగ్ పుస్తకాలు ప్రెస్‌నించి ఇప్పుడే వచ్చి పేవ్‌మెంట్ల మీద దిమ్మరించబడ్డాయి.

ఎంగిలి విస్తళ్ళమీద ముష్టివాళ్ళు పడ్డట్టు వీటిమీద పడ్డారు జనం!

పుస్తకం రూపాయి! వెల సరసం, ఫల మధికం!

రేపటి రేసుల్లో పరుగెత్తబోయే గుర్రాలు, వాటి జాకీలు, వాటి మీద పెట్టబోయే బరువు, వాటి హేండీకేప్స్.

అంతేకాక ట్రయల్ పరుగుల్లో ఏ గుర్రం ఎంత టైమింగ్ ఇచ్చింది.

ఏ గుర్రంకి ఏ రేసు గెలవడానికి ఎక్కువ అవకాశం ఉంది.

జాక్‌పాట్ కాంబినేషన్స్, ఫోర్‌కాస్ట్ కాంబినేషన్స్.




పండిపోయిన జుత్తు, అరిగిపోయిన చెప్పులు చిరిగిపోయిన బట్టలు—

దరిద్రం తాండవిస్తున్న ముఖాలు. ఉన్నదేదో ఊడ్చేసి, రేపు గుర్రాల మీద ఒడ్డి వేలకొద్దీ డబ్బు ఆర్జించేసి, నామరూపాలు సంపాదిద్దామని కలలు కంటూ రేసింగ్ పుస్తకాలు కొంటున్నారు నామరూపాలు లేని మనుషులు.

అప్పుచేసి పప్పుకూడు కాదు. అప్పుచేసి రేసులాడు.

జీవితమే ఒక రేసు.

కోరికలే గుర్రాలైతే ఈ పందెగాళ్ళ గుర్రాలెక్కరా?

కాని రేపు రేసులలో వీరి కోరికలు గుర్రాలవవు. గుర్రాలు వేరు— వీరు వేరు.

"బాబూ ఓ పదిస్తావా ఇంట్లో నూకల్లేవు." "దోస్త్ ఓ పాతికుంటే ఇద్దూ ఫస్టుకిచ్చేస్తాను." ఇక్కడా అక్కడా డబ్బు బిక్కిరి ఓ యాభై రూపాయలు జేబులో వేసుక వెళ్తే. అబ్బ. ఏం ఆనందం ఏం సంరంభం.

"ష్యూర్ ఫేవరెట్ మీద కట్టి లాభం ఏమిటి సార్? మీ డబ్బులు మీ కొస్తాయి. అప్‌సెట్ మీద కట్టండి సార్.... ఒకటి కిరవై వొస్తుంది."

అప్‌సెట్ గుర్రం అప్‌సెట్ అయింది— ఇతణ్ణీ అప్‌సెట్ చేసింది.

తిరిగి వెళ్ళడానికి బస్సుకిరాయి లేదు.

"ఛవ్! ఈ రేసులకింకెప్పుడూ రాకూడదు గాక రాకూడదు!" రేసుల వైరాగ్యం!

ఫెయిలయిన కుర్రాడిలా... ప్రియురాలు మరోడితో పారిపోయినప్పుడు ప్రియుడిలా.... ముఖంపెట్టి గృహప్రవేశం చెయ్యగా గృహలక్ష్మి ...

"రేపటికి వెచ్చాలు లేవు! రామారావు వదిగి పాతిక తెమ్మన్నాను తెచ్చేరా?" అని అడగ్గా....

రామారావు వదిగి అశ్వమేధయాగం చేసి వస్తున్నా! అనలేక.... "రామారావు రాజమండ్రి పోయేడు!" "ఏఁ?" "వాళ్ల నాన్నకి సీరియస్గని టెలిగ్రాం వచ్చింది!"

మళ్లా శనివారానికి మళ్లా పాతపాటే!

"ఈసారి జాక్‌పాట్ నాదే! అందుకే కేరీఓవర్ అయింది!"

అప్పు పుట్టేమార్గం లేదు. చేతివాచి తాకట్టు! వడ్డీ పాతికశాతం నెలకి! సాయంత్రం అయేవరికి వాడి డబ్బు వాడి మొహాన కొట్టమా?

సాయంత్రం... తిరుషవరం.

"వాచీ తీసుకొని మరో పాతిక పారేవోయ్!"

మామగారు అలకపానుపు తను ఎక్కినవాడు ఇచ్చిన గడియారాన్ని ఈనాటి కిలా సద్వినియోగం చేసినందుకు అవందించగా....

ఇంటిదగ్గర ఇల్లాలు, మాసి చిరిగిన చీరతో, భావిశూన్యమైన బతుకుతో పంజరంలో పక్షిలా, ఏ సంతోషమూ, స్వేచ్ఛా లేక....

బావిన బతుకే నొసట రాసుందని నమ్మకొని కొచ్చి....

సుందరజీవితం కలగానే మిగలగా....

కడుపునిండా తిండి.... కట్టుకుందుకి బట్ట.... కంటినిండా కునుకులేక....

రేసుల భర్తకోసం ఎదురుచూస్తూ!

"సర్! రేస్‌బుక్స్ సార్!"

"ఏ గుర్రం గెలుస్తుందండీ డెర్బీలో?"

"టెంపెస్ట్‌మీద కట్టండి! జగదీష్ స్వారి చేస్తున్నాడు! తప్పక గెలుస్తుంది!"

"జాకీమీద కట్టాలా, గుర్రంమీదా?"

"గుర్రమూ మంచిది జాకీ మంచివాడు. డెర్బీ కాబట్టి ఈవెన్స్ ధరవు"

"ఈ డెర్బీలో ఏం కిట్టదు సార్! ఏది గెలుస్తుందో అందరికీ తెలుసు! ఓనర్‌కే లాభం తప్ప... !"

"ఇదో రేస్‌లో ఆరోనంబర్‌మీద కట్టవోయ్‌। డార్క్‌హార్స్‌ అది। పది కట్టు వంద పట్టకపో।"

పదేం? యాభై కట్టేడు ఆరోనంబరు ఆరోస్థానంలోనే ఉండిపోయింది।

జాకీని తిట్టుకుంటూ పంటర్లు ఇళ్ళకు పోయేరు।

"మూకుమ్మడి దోపిడీరా తమ్ముడూ। ఒక బీడీ ఉంటే ఇవ్వు। చూస్తూ ఉండవోయ్‌ వచ్చే వారం జాక్‌పాట్‌ మనదే।"

అంతవరకూ మాడతాడు—

కుటుంబాన్ని మాడుస్తాడు—

అతడికి పగటికలలూ.... అతడి సంసారానికి చీకటి బతుకులూ।

దరిద్రం.... అప్పులూ.... తప్పవు.... తప్పవు.... తప్పవు।

## 19-45 గంటలు

రాజమార్గానికి దగ్గర్లో ఉన్న మైదానంలో రాజకీయ ఉపన్యాసం సాగుతోంది.

ఇక్కడికి వినిపిస్తోంది.

ఉపన్యాసకుడు తిడుతున్నాడు (ప్రభుత్వాన్ని)– "సింహాసనం ఎక్కిన వారిని దించండి. పనులు చెయ్యకండి. సమ్మెలే మీ ఆయుధాలు। గో స్లోలే మీ శ్రీరామరక్షలు। మీరు పని చెయ్యకండి. మరోడ్ని చెయ్యనివ్వకండి। మనం ఎలానూ బాగుపడలేదు। వారు మాత్రం ఎందుకు బాగుపడాలి? మీరు లేనివాళ్ళు। వాళ్ళు ఉన్నవాళ్ళు।"

ఎవడో మధ్యలో లేచేడు... "మేమే ఉన్నవాళ్ళం। వాళ్ళు లేనివాళ్ళు।"

"అంటే?"

"మాకు ఆకలి ఉంది. వారికి లేదు। మాకు దరిద్రం ఉంది. వారికి లేదు। మాకు రోగాలున్నాయి। వారికి లేవు। మాకు పేవుమెంటుంది। వారికి లేదు। మాకు నగ్నత్వం ఉంది. వారికి లేదు। ఇవన్నీ మన కున్నందుకూ వారికి లేనందుకూ మనం గర్వపడదాం।"

సాయంత్రం ఎడిషన్‌ పేపర్లతో కుర్రాడు పరుగున వచ్చేడు।

"లోక్‌సభ రద్దు। మార్చిలో ఎన్నికలు।" చెవులు చిల్లులు పడేలా అరుస్తున్నాడు।

అంత తాజావార్త, ఆశ్చర్యకరమైన వార్త వినివచ్చినా జనం తమకు పట్టనట్టు పోతున్నారు।

అదేం పటో మాటికి అరవై శాతం ప్రజకి తెలీదు।

అదేం చేస్తోందో మిగతా వలభై శాతానికి తెలీదు.

తిండిగింజలున్నా తిండి దొరకడంలేదనీ, ఇంత దేశం ఉన్నా అందరికీ ఉద్యోగాలు లేవనీ, ఇంత జనం ఉన్నా బంగారం కాకపోతే మానే కేవలం గడ్డయినా పండడం లేదనీ వారికి తెలుసు!

రాజకీయుళ్ళ మాటలు నీటిమూటలని వారికి తెలుసు.

దేశం ప్రజలకోసం లేదు ... కొందరికోసమే ఉందనీ వారికి తెలుసు.

దేశమంటే మట్టి కాదు.... మనుషులూ కాదు! దేశమంటే ధనికులోయ్!
అదీ వారికి తెలుసు!

పవర్ కోసం, పదవులకోసం కొట్లాటలు, హింసలు, ప్రతిహింసలు, మోసాలు, కుట్రలు, కుతంత్రాలు!

"'మా కొద్దీ తెల్లదొరతనమూ!' అంటూ ప్రాణాలొడ్డి ప్రజలు పోరాడింది ఈ కుత్సితులకోసమా!" అన్నాడొక రచయిత.

"శత్రువులతో యుద్ధంచేసి, ప్రాణాలు సైనికులు పోగొట్టుకున్నది నల్ల బజారువాళ్ళకోసమా? వారిమీద బతికే ఈనాటి పుచ్చునాయకుల్ల కోసమా?" అంటూ మరొక కవి ప్రశ్నించేడు. ఒక ప్రశ్నం పట్టిక ఓ పత్రికివ్వగా వచ్చిన జవాబులు!

| దరిద్రం?.... | ఉంది. | ఎక్కిడెంట్లు? | ఉన్నాయి- పెరిగేయి. |
|---|---|---|---|
| నిరక్షరాస్యత? | ఉంది. | దోపిడీలు? | ఎక్కువయ్యేయి. |
| కొరతలు....? | ఉన్నాయి. | మానభంగాలు? | విపరీతం. |
| వరదలు? | ఉన్నాయి. | హత్యలు? | మామూలయ్యేయి. |
| రోగాలు? | ఉన్నాయి. | లాఠీచార్జీలు? | ఉన్నాయి. |
| నిరుద్యోగ సమస్య? | ఉంది. | ఫైరింగులు? | ఎక్కువయ్యేయి. |
| జనాభా పెరుగుదల? | ఉంది. | సమ్మెలు? | పెరిగేయి. |
| ధరల పెరుగుదల? | ఉంది. | సత్యాగ్రహాలు? | ఉన్నాయి. |
| అరాచకం? | ఉంది | ఉన్నవాడు? | ఉన్నాడు. |
| అవినీతి? | ఉంది. | లేనివాడు? | ఉన్నాడు. |
| బానిసత్వం? | ఉంది. | వారిమధ్య తేడా? | ఎక్కువయింది. |
| పెత్తందారీ? | ఉంది. | బాబాలు | ఎక్కువయ్యేరు. |
| మతకలహాలు? | ఉన్నాయి. | అంధవిశ్వాసాలు | పెచ్చుపెరిగేయి. |
| కులద్వేషం? | ఉంది. | మనిషి స్వేచ్ఛ? | చచ్చింది. |

మరి ఆనాడున్నది , వాడు ఏం పోయింది? అనాడు లేంది ఈవాడు ఏం వచ్చింది?

ఎడ్లకి యజమానులు మారేరు! బరువొకటే! పనొకటే! అవాడు ఎడ్లకి మేత బాగా పెట్టేవాడు యజమాని. ఈనాడు ఎ దకట్టేపేస! ముళ్ళకర్రతో కొడుతున్నాడు!

## 20-00 గంటలు

ఒక పెద్ద పెళ్ళిఊరేగింపు మేళాలతో తాళాలతో ముందుకొస్తోంది.

చిచ్చుబుడ్లు నకిలీ ముత్యాలు ఒలకబోస్తున్నాయి.

బాణాసంచాలు ఫిరంగులలా పేల్తున్నాయి

పదిమందికి పైగా ఉన్నారు బ్యాండ్ వాయించేవాళ్ళు- ఎర్రకోట్లు- నీలి పంట్లాలు- ఎర్రకోట్లకి తుచ్చుల డిజైన్లు- తలలకి జరీపాగాలు- గాలి తగలక చెమటోడుతున్నారు.

బూరా ఊదేవారు గుండెల్లోకి సత్తువకొద్దీ గాలి పీల్చి బాకాలు ఊదుతున్నారు. డోలు పగిలేలా ధబీధబీ మనిపిస్తున్నారు డ్రమ్మర్లు. కిందటేడు విడుదలయిన బూతుసినీమాలోని బూతుపాటని బాకావాడు వాయిస్తున్నాడు. బాకా కాబట్టి బూతుమాటలు దొర్లడంలేదు.

పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ ఊరేగుతున్నారు.

వారు కూర్చున్న కారు పాత సినీమాలలో వాడివాడి పారేసిన టి సి వాటి ఫోర్డుకారు- అలనాటి పడవలా ఉంది ఈ కారు తవాల మోతకి, పెళ్ళి ఊరేగింపులకి వాడబడుతోంది ఓనరుచేత. పెట్రోలు ఖరీదని, డీజిలింజను పెట్టించేడు. డిక్కీలో జెనరేటరుంది గుర్రుపెడుతోంది. ఆ విద్యుత్తుతో ట్యూబ్‌లైట్లు వెలిగేయి.

ఆ ట్యూబ్‌లైట్లని రెండువరుసల్లో పట్టుకు నడుస్తున్నారు మనుష్యులు.

అవివాహితుడు వైవాహిక జీవితంలోకి అడుగుపెడుతున్నాడు.

అపస్ఖలిత బ్రహ్మచారి కానేకాడు!

ఎన్నో ప్రేమకలాపాలు సాగించేడు. ఎంపుళ్ళలో ఎందరో కన్యలని ఏరిపారేసేడు. ఆఖరి కిప్పుడు బెండకాయలా ముదిరిపోయే సమయానికి, 'ఎవడో ఓ మగాడు చాలు!' అనుకున్న అమ్మాయికి పుస్తె కట్టేసేడు.

అమ్మాయి పాపం పలుపు! అది ఆమె తప్పా? అందరికీ తెల్లపిల్లే కావా

లంటే ఎలా? రిజెక్షన్ ఉత్తరాలు పొంది పొంది విసుగెత్తిపోయింది. పాతిక దాటి ముప్ఫయి మీదపడుతూ ఉంటే 'ఎవడో ఒకడు . మగపురుగైతే చాలు!' అంటూ వెయ్యిదేవుళ్ళకి మొక్కుకుంది. ఈ బెండకాయలా ముదిరి పోయిన బ్రహ్మవారి దొరికేరు!

"ప్రతి మగదికీ తెల్లగా, అందంగా, సన్నగా, నాజూగ్గా, పొట్టికాని, పొడుగూకాని, చదువుకున్న, ఉద్యోగమున్న ఆడదే కావాలంటే, మరి తక్కిన ఆడాళ్ళంతా ఉరోసుక చావాలా? శీలం కలిగి వుండాలిట, గుణం కలిగి ఉండాలిట, కట్నం తేవాలిట!" ఒక మహిళ ఇలా రాసిన వ్యాసానికి పోటీలో బహుమ తొచ్చింది. కాని లోకమూ మారలేదు, ఆమెకి పెళ్ళి కాలేదు!" మరి అబ్బాయిగారి అందచందాలేమిటి? గుణగణాలేమిటి? శీలం ఏమిటి? తోలు రంగేమిటి? చదువేమిటి? అని ఎవ్వరూ ఎందుకడగరు?" అంటూ కూడా ఆమె విలపించింది!

పెళ్ళిళ్ళ బజారులో పెళ్ళికొడుకు దొరకని వస్తువు!

నల్లబజారు నడుస్తోంది! రూపాయి ఖరీదు చెయ్యని సరుకు వందకి అమ్ముడుపోతోంది!

ఈ కారులోని పెళ్ళికొడుకు పట్టుబడ్డ దొంగలా బుద్ధిగా కూర్చున్నాడు!

అంత వెలుగున్నా ముఖం వెలగడంలేదు! అమావాస్య రాత్రిలా ఉంది!

జరీపాగా.... సిల్కు లాంగ్‌కోటు.... మెడలో మల్లెపూల దండలు, ముఖాన్ని కప్పుతున్నాయి దండల బారులు.

పెళ్ళికూతురు గురించి ఆలోచిస్తున్నాడు పెళ్ళికొడుకు.

ఈమెని పెళ్ళిచూపుల్లో చూట్టమే! ఈమె శరీరపు జాగ్రఫీ ఏమిటి? ప్రేమ హిస్టరీ ఏమిటి?

ఈమె వేషంలో అసలెంత? నకిలీ ఎంత?

జుత్తుకి సవరం, నకిలీ పేడింగ్ వక్షాలు, జఘనానికి పేడింగ్‌లూ, ముఖానికి పేకప్పు.... ఇవన్నీ ఈమె ధరించిందా?

ఈమె నిజంగా కన్యా, లేక కేవలం అవివాహితా?

ఈ తంతు ఎంత వేగం పూర్తవుతుందా? ఎంత వేగం ఆమెను తన ఒడిలోకి తీసుకుందామా అని కలలు కంటున్నాడు.

రేపు శోభనం! హనీమూను!

తగు జాగర్తలు పడకపోతే ఏడాది తిరక్కుండా సైపిను!






ఈ మూడు రాత్రులూ కుటుంబ నియంత్రణ ఎలా అమలుజరపడం?

ముందో కొజ్జావాళ్ళ నాట్యబృందం నృత్యంచేస్తోంది। స్త్రీలలా వేషాలేసు కొని సినీమాలోని డ్యాన్సర్లలా గెంతుతున్నారు. వారికో తెల్లటి సైట్ బట్టలోని హీరో నాట్యంచేస్తున్నాడు।

ఈ సీజన్‌కి ఇదే ఆఖరు ముహూర్తంట। ఉరిపెట్టుక పోతున్నారు పెళ్ళిళ్ళు చేయాల్సిన తండ్రులు। వచ్చే ఏడు మూఢంట।

అందుకు ఇవాళ నగరంలో పెళ్ళిళ్ళ బాపుటా ఎగురుతోంది।

దేశం మొత్తంమ్మీద కొన్ని లక్షల పెళ్ళిళ్ళు ఇవాళ।

రేపు కొన్ని లక్షల శోభనాలు। ఆధామగా ఆలింగనాలు.... కుస్తీపట్లు।

మరో ఏడాదికి కొన్ని లక్షల సంతానోత్పత్తి।

ఇరుకు గదుల్లో। సింగిల్ మంచాలమీద, స్త్రీపురుష కాముక క్రియలు.... అనంతంగా.... నవల కైపులు.... ఉక్కిపోస్తున్నా ప్రేమ కథలు- కబుర్లు- "నన్ను నేను ప్రేమిస్తున్నాను। నన్ను నువ్వు ప్రేమిస్తున్నావా?" "నన్ను నువ్వు ప్రేమించినప్పుడు మరి నిన్ను నేను ప్రేమించనా?"

ఏడాది దాటేసరికి?

చాలని జీతం। నిండని కడుపులు- అతుకుల బతుకులు

చీదర... కీచులాట....

కాపీగుండయిపోయింది. బొగ్గులు తీసుకరండి. పాలడబ్బా కొని పట్రండి,

పదమూడేళ్ళయ్యేక-

"అమ్మాయి పెద్దదయింది- సంబంధం చూడండి!"

మరో పిల్లలు కనే యంత్రాన్ని లాంచింగ్ చేయించమంటోంది తల్లి!

బాం....! బాం....! డబ్! ఢబ్! ఢబాఢబ్!

బ్యాండుమేళం మోగుతోంది.

ట్రాఫిక్ దీపాలని ఖాతరుచెయ్యకుండా బరాత్ ముందుకు సాగింది.

అటువించి మరో పెళ్ళిఊరేగింపొస్తోంది.

ప్రేమకి ఫలం పెళ్ళా?

ప్రేమ ఫలించేవరకూ, పెళ్ళిలో గ్రూప్ ఫోటోలో అఖరయ్యే వరకూ ఇటు నవలా రచయిత్రీ రచయితా, అటు సినీ డైరెక్టరూ సాయంపట్టేస్తారు- హీరోలనీ, హీరోయిన్లనీ సృష్టించి, ప్రేమ కురిపించేసి, పెళ్ళి జరిగిపోయాక తప్పుకుంటారు.

ఆ తరవాత సంగతి చూపుతే హీరోలూ, హీరోయిన్లూ మరుండరు. పెళ్ళి వలలో ఎవరూ పడరు.

హనీమూన్ తరవాత మిగిలేది సంసారం బరువేవనీ....

ఇంక ఏ రచయిత్రీ, డైరెక్టరూ, ప్రభుత్వమూ వాంకేసి చూడరనీ....

అతడూ ఆమె సంసార రథాన్ని లాగిలాగి, చట్టలు సాగిసాగి, విశ్రాంతి లేక అలసిపోయి, ముసలితనం మీదపడి చస్తే ఈడ్చేయడానికి్నా ఎవ్వరూ సాయపడరనీ....

ఏ రచయిత్రీ రాయదు....! ఏ సినిమా చూపదు!

వారే చూడరు అటువంటి సినిమా తీస్తే... చదవరు అటువంటి రచన..

"నా పగటి కలలకి అనువుగా ఉండే రచనలూ, సినిమాలూ నాకు కావాలి! వారు చెప్పే అబద్దాలు ఎంత సుందరంగా ఉంటే వారి వంత నమ్ముతాను! ముళ్ళమీద పడుకొని, స్వర్గం గురించి కలలు కనే నాకు ఆ కలలని నిలబెట్టేవారే కావాలి! నిజం చెప్పే మనుషులు నా కొద్దు!"

మరో రెండు పెళ్ళిఊరేగింపులు వస్తున్నాయి ఎదురుఎదురుగా ఎదురుగా ఉన్న మార్గంమ్మీద.

నలుగురు పెళ్ళికొడుకులు.... నలుగురు పెళ్ళికూతుళ్ళు.

ఒక పెళ్ళికొడుకు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతనికో పెద్ద సమస్య వచ్చిపడింది.

రెండేళ్ల క్రితం కామబాధకి ఓర్చుకోలేక అద్దె ఇచ్చుకొని ఒక అందాల తరిణి దగ్గరికి వెళ్ళేడు. ఆమె ప్రేమకానుక అంటించింది ఆ కానుక ముదిరింది. వైద్యుడికి చూపించుకుందాం అనుకుంటూనే అశ్రద్ధ జరిగిపోయింది.

దగుల్బాజీ ముండ! జబ్బులేదని బొంకింది! ఏ పుట్టలో ఏముందో ఎలా తెలుసుకోవడం.... అది కరిచి, విషం ఎక్కాకే నే తప్పు! డైలమా ఏమిటంటే...

రేపు రాత్రి శోభనం తప్పదు కదా?

ఈ ప్రేమకానుకని ఆమెకి ప్రసాదిస్తే ఇంకేమన్నా ఉందా!?

డాక్టర్ దగ్గరి కిప్పుడు వెళ్ళడం కాదు! పెళ్ళి హడావిడి!

పోనీ ఆమెకి దూరంగా ఉంటే?

ఆమెకి దూరంగా ఉంటే తన మగతనాన్నే శంకించదా?

తెలుగు సినిమాలు ఉగ్గుపాల కాలంనుంచీ చూసి చూసి వేడెక్కి ఉంటుందేమో.... కోరికలతో బుసలుకొడుతూ ఉంటుందేమో....

తలుపు గడీపడగానే మీదొచ్చి పడక మానుతుందా?

ఏం దారి? రబ్బరు పరికరాలు వాడితే? ఆమె అంత సమయం ఇస్తుందా?

నాలుగు పెళ్ళి బారాత్‌లూ రోడ్డు సెంటర్లో ఆగేయి.

ఒకరి కొకరు పోటీగా చిచ్చుబుడ్లు కాల్చేరు- తారాజువ్వలు వదిలేరు.

నపుంసక నాట్యకత్తెలు ఒకరి కొకరు పోటీగా నాట్యంచేసేరు. ప్రేక్షకులు ఈలలు వేసేరు.

బ్యాండ్‌వాళ్ళు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. బీడీలు ముట్టించేరు.

గంటలకొద్దీ వాద్యం వాయిస్తే వచ్చేదేపాటి? పెళ్ళిళ్ళ సీజను ఐపోగానే తమ అర్జన సరి!

ఎలాగా ప్రొసెషన్లు ఆగిపోయేయి కదా అని నూతన వధూవరులు తమలో తాము ప్రేమడైలాగులు ప్రారంభించేరు.

"వేగం విడిదికి చేరుకుంటే బాగుణ్ణు!" అన్నాడో పెళ్ళికొడుకు.

"బాగు" అన్న పదమే వినిపించింది వధువుకి- తనని తన అందాన్నీ, బాగు బాగని మెచ్చుకుంటున్నా డనుకుంది ఆమె పాపం! సిగ్గుపడిపోయింది.

"మీరుకూడా బాగుంటారు!" అంటూ రిటర్న్ కాంప్లిమెంట్ ఇచ్చింది.

"మీరు" అన్న మాటే వినిపించి, "నేనంటే నీ కిష్టమేనా?" అని ప్రేమ బాణం వదిలేడు.

"ఇష్టమేనా?" అన్న మాట వినిపించి.... తనకి స్వీటు ఇష్టమా అని అడుగుతున్నాడనుకొని, "నాకు జిలేబీలంటే ఎంతో ఇష్టం!" అన్నదామె.

తనని జిలేబీతో పోల్చి కవిత్వం అల్లిందనుకొని . పెళ్ళికొడుకు ఎంతో ఆనందించేడు. బుగ్గమీద చిటికెయ్యగా ఆమె మహా సిగ్గుపడిపోయింది

మరో జంట—

"నన్ను ప్రేమిస్తున్నావా?" అడిగేడు....

ప్రేమా? ఇతన్ని ప్రేమిస్తున్నావా, పెళ్ళయేక ఏలే దైవం కాబట్టి ప్రేమించక తప్పదు కాబట్టి. "ఔను!" అని తల ఊపింది.

"ఇంతకుముం దెవర్నన్నా ప్రేమించేవా?"

"ఔను!" అన్నట్టు తల ఊచగా అంగుతిన్నాడు- ఎందుకడిగేన్రా బాబూ అనుకున్నాడు!

"ఎవర్ని!"

"అమ్మనీ.... నాన్ననీ!"

పెద్ద రిలీఫు! ఫకాల్న నవ్వేడు ప్రేమగా ఆమెకేసి చూసేడు.

తనలో తాను నవ్వుకుందామె.

గొప్ప అనుమానం మనిషిలా ఉన్నాడే.

ఎదురింటి ప్రేమవిహారిని తను గత రెండేళ్ళుగా ప్రేమించినట్టూ....

కులం ఒకటి కాదు కాబట్టి ప్రేమ ఇతరత్రా ఫలించినా, పెళ్ళికి దారి తియ్యలేదనీ... ఇతడికి తను చెప్పగలదా ఎప్పుడన్నా?

మూడవ జంట!

పెళ్ళికూతురే డైలాగులు ప్రారంభించింది.

"మీరు చాలా బాగుంటారు!" సిగ్గుపడిపోతూ అంది.

"నువ్వూ చాలా బాగుంటావు!"

"మీరు హీరో సోమేశ్వరరావులా ఉంటారు తెలుసా?"

"నువ్వు నటి ఆనందినిలా ఉ టావు నీకు తెలుసా?"

"నాకు ఆనందిని అంటే ఇష్టం లేదండీ- భయమోహిని నా కిష్టం! "మాతృహత్య!" సినీమాలో ఎంతో బ్రహ్మాండంగా నటించింది!"

"నాకూ సోమేశ్వరరావు ఇష్టంలేదు- కామారావ్ అంటేనే ఇష్టం! అతని సినీమా "నిముషానికి నాలుగు హత్యలు!" ఎంత బాగుందో చెప్పలేము!

కొంతసేపు తరవాత ఆమె అంది. "ఏమండీ ఒక చిన్నమాట!"




"ఒక మాటేం? పది మాటలు చెప్పు!"

సిగ్గుపడుతూ అంది– "మనకి మరో మూడేళ్ళవరకూ పిల్లాజెల్లా వద్దండీ!"

ఆమె చొరవకి దంగయిపోయేడు పెళ్ళికొడుకు! "వద్దులే! కాని ఎలా?"

"ఎలా ఏమిటండీ మరీనూ...."

"పిల్లాజెల్లా ఎలా ఉండరూ అని!"

"మీకు తెలీదా ఏమిటి?"

"నీకు తెలుసా ఏఁవిఁటి?"

"తెలుసు!" సిగ్గుతో కందిపోయింది.

"ఎలా తెలుసుకున్నావ్? నీ కేమన్నా అవసరం పడిందా?" అనుమానం పెనుభూతం!

"ఛీ! ఏం మాటలవి? మా వదిన జాగర్త పడేది! ఏవో మాత్రలు మింగేది. ఏం మాత్రలవి వదినే అంటే చెప్పింది!"

ఈ కుటుంబ నియంత్రణ ప్రచార ధర్మమా అని పుట్టిన పిల్లకి కూడా గర్భనిరోధక మార్గాలు తెలిసిపోతున్నాయి! నిట్టూర్చేడు– ఈమె నిజాయితీ మనిషే! మనసులోని మాట వెళ్ళగక్కింది!

"సెక్సు పుస్తకాలు చదివేవా?" అడిగేడు పరిశోధిద్దామని–

"ఆడామగా ప్రేమసంబంధం గురించి?"

"సీరియల్సన్నీ అవే కదండీ? నా అభిమాన రచయిత్రి రతిమంజరి నవలలు ఎంత బాగుంటాయో! హీరో ఎంతో అందంగా ఉంటాడు!"

ఫకాల్న నవ్వేడు... "అటువంటి వాడికోసం కలలు కన్నావా?"

"మీరు మాత్రం కలలు కనలేదా? ఆమె సృష్టించిన హీరోయిన్ కోసం!"

"ఆ రచయిత్రెవరో నాకు తెలీదు!"

గుండె ఆగిందామెకి ఆశ్చర్యంతో- "అబద్ధాలాడకండి! ఆమె నవల 'ప్రేమ పక్షులు' సూపర్ హిట్ సినీమా అయింది! మీరు చూడలేదా?"

"చూడలేదు! నువ్వామె నవల్లవించి నేర్చుకున్న ప్రేమపాఠాలు నాకు నేర్పు. నేర్చుకుంటాను!" చిరునవ్వుతో ఆమె భుజం తట్టేడు.

"ఛీ! అవేం సిగ్గుమాలిన మాటలు!" అంటూ అతడి చెయ్యి గిల్లింది.

నాలుగో జంట ఇలా డైలాగులు చెప్పుకుంటున్నారు....

"ఆ స్కూటరు సంగతి మీ నాన్నతో కదుపు!" అన్నాడు వెలుగుబంటి వంటి పెళ్లికొడుకు

"స్కూటరా? ఏమిటండది?" భయంభయంగా అడిగింది.

"మా గుర్నాధానికి వాళ్ల మావ వెస్పా స్కూటరూ, గోల్డాను రిఫ్రిజి రేటరూ, గ్యాసుపొయ్యి ఇచ్చేడు!"

"వాళ్లకి డబ్బుంది కామోసు ఇచ్చేడేమో!"

"మీ నాన్ననే అడుగు!"

"ఎలా అడగను? ఈ పెళ్లికని అమ్మ బంగారం అమ్మేసేడు నాన్న! చెయ్యవల్సిన అప్పులన్నీ చేసేడు! కట్నం పదిహేను వేలు ఇచ్చేం కదా?" కళ్లు చెమ్మగిల్లేయామెకు.

"ఇచ్చేరు పదిహేనువేలు! ముప్ఫయి వేలు ఇస్తామని ఒచ్చేరు తెల్సా?"

ఆమె ఆలోచించింది. ఇతడితో పోట్లాడాలా ఇప్పుడు? అతడి అమ్మ అన్నమాటలు వల్లె వేస్తున్నాడు. అమ్మకొంగు వదిలేలా చెయ్యాలి.

తను అందమైనది- ఎం. ఏ పాసయింది- ఇతగాడు సెక్రెటేరియట్‌లో అసిస్టెంటు. అందగాడు కాదు. ఐనా ఒప్పుకుంది ఎవడో ఒక మొగుడని! తన అందం, చదువు చూసి ఇతడొప్పుకున్నాడు! ఇప్పుడిదేమిటి?

"లక్షకూడా ఇచ్చేవాళ్లున్నారు. కాని మీరు నన్ను చేసుకున్నారు! మా తాహతు ఇంతే!"

"మరొక్క- పదివేలేగా?"

"వచ్చే ఏడు ఆయన స్థిమితపడ్డాక అడుగుతాను."

"అప్పుడు ఇవ్వనంటే?"

"ఇప్పుడు ఇస్తేకాని పుస్తె కట్టరా?"

"పుస్తె కడతాను కాని కార్యం చేసుకోను." అన్నాడు ధీమాగా.

ఆ మాటలు ఆమెకి కడుపులో తిప్పు తెప్పించేయి. అమ్మ నూరిపోసింది అంటున్నాడు. ఎంత దిగజారిన మనుష్యులు. వీళ్ల సంస్కారం ఏమిటి? కార్యం చేసుకోట్ట. చేసుకోడానికి ఇదేమన్నా ఆకలౌక్కడికి సంబంధించిందా? 'నీతో నాకి పెళ్లొద్దు' అని ఇప్పుడు కారు దిగిపోతే? దిగిపోవాలనే ఉంది. కాని నాన్న గుండె పగిలిపోతుంది.

భారత దేశంలో, తెలుగునాట ఆడపిల్లయి పుట్టడం పూర్వజన్మ పాపం.

"కార్యం చేసుకోరా? అంటే? నీళ్లు పోసుకోమా అన్నట్లు చెప్తున్నారు."

"రేపురాత్రి శోభనంగదిలోకి వెళ్లను."

"శోభనం అంటే?" నవ్వు ఆపుకుంటూ అడిగింది.

"పిల్లలెలా పుడతారనుకున్నావ్?"

"దేవుడిస్తాడు."

"నువ్వు పల్లెటూరి మొద్దువా? దేవుడివ్వడు. నే ఇస్తాను."

"నాకు పిల్లలొద్దూ.... శోభనమూ ఒద్దు. వాళ్లని పెంచలేను."

పెళ్లికొడుకు చచ్చిన చికాకులో పడ్డాడు.

బెదిరిద్దామని అన్నాడు కాని ఈ అందాలభామ పొందు వదులుకోగలడా? యిప్పుడెలా ప్లేటు మార్చాలి? "నేను నీ కొద్దా?" అడిగేడు.

"నేను మీ కొద్దా?" తిరిగి అడిగింది.

"నేను నీకు కావస్తే మీ నాన్నని స్కూటరడుగు."

"నేను మీకు కావస్తే ఆ సంగతే మరిచిపోండి." అంటించింది.

"నాకు కాక ఎక్కడికి పోతావు?"

"మీరన్న శోభనంగది నా శవం గదవుతుంది."

"చస్తావా?"

"మీరందరూ చంపుతే చావనా? కట్నం పదిహేనువేలన్నారు. ప్రయాణం ఖర్చులన్నారు- లాంచనాలన్నారు- ఇప్పుడీ స్కూటరా? రేపు హెలికాప్టర్ కావాలంటారు. పోనీ అంత ఇష్టంలేనప్పుడు పుస్తెకట్టకండి. మా సొమ్ము మాకిచ్చేంది."

"నడుస్తూ వే!" ఓటమి ఒప్పుకున్నాడు.

"నాతో భాపరం ఉండాలంటే మీ అమ్మకొంగు వదలండి!"

పెళ్ళి ముహూర్తం దగ్గరపడిందని ఊరేగింపులు మళ్లా దారినపడ్డాయి. ఈసారి వేగం ఎక్కువచేసేయి.

## 21.00 గంటలు

ప్రపంచం అందంగా, సుందరంగా నందనవనంలా ఉంది!

ఆకాశం నల్లగా ఉంది- నక్షత్రాలు వజ్రాలలా ఉన్నాయి-

చల్లగాలి మెల్లిగా వీస్తోంది- ఎక్కడ నించో పూలవాసన గుబాళిస్తోంది-

బ్రహ్మాండమైన భవనాలు రోడ్డు అందాన్ని ఎక్కువ చేస్తున్నాయి- చూడండి మా అభివృద్ధి అని చాటుతున్నాయి!

ఐదు నక్షత్రాల హోటళ్ళు- డీలక్సు కారులు- ఏసీ గదులు.

రండిసార్! చూడండి మా కల్చర్ ని!

మా తాజమహల్ మా కోణార్క్ .. మా ఖజరాహో. ..

ఎక్కడ చూసినా సమృద్ధే కదా!

కలిమి, లేమి గ్రీన్ రూమ్ లోకి తరిమేసి స్టేజ్ ని ఆక్రమించింది.

కలిమికి తన భోర్షన్ రాదు! ప్రాంప్టర్ ని పెట్టుకుంది! వినంది.... కనంది!

రోడ్డుమీద నియాన్ దీపాలు!

షోరూమ్సు! మోడల్సు డిస్ప్లే చీరలు.

పేపర్లో ఖరీదైన ప్రకటనలు

అ బిట్టలేమిటీ, కాస్మెటిక్సేమిటీ, సిగరెట్లేమిటీ.... సుఖజీవన సామగ్రి ఏమిటి!

ఒక్కసారి గ్రీన్ రూమ్ లోకి తొంగి చూదామా?

అక్కడ దాగున్న దరిద్రం.... నిరుద్యోగులు.... నైరాశ్యం.... పనికిరాని యువశక్తి!

ఒకవేపు అంతులేని సంపద-

మరొకవేపు మింగుతున్న దరిద్రం-

ఒకవేపు జులుం... ! 'పవరు'....!

మరొకవేపు నైరాశ్యం! బానిసత్వం!




ఒకవేపు బ్యాంక్‌లు, ఇన్సురెన్స్ కంపెనీలు, ఇండస్ట్రీలు తమ శాఖలని పెంచుతూ- వాటిలో చేరినవారికి స్వర్గం- చేరగలిగేది నూటికి ఒకశాతం.

రెండో వేపు నిరుద్యోగులు- చేసేందుకు జాబులేక- క్వాలిఫికేషన్లు పట్టుకొని!

ఉద్యోగం ఉన్నవారు పనిచేసి సంపద పెంచి, మరిన్ని ఉద్యోగాలకి అవకాశం పెంచరు-

ఉద్యోగం లేనివారు ఖలాసీ ఉద్యోగమన్నా చాలు అంటున్నారు-

లక్షల సంఖ్యలో ప్రతిరోజూ పెరిగే జనాభా!

విస్తరించే మురికిపేటలు- రోగాలు.... రొచ్చులు-

మహాసాగరం పొంగినట్టు పొంగుతూ అసంతృప్తి—

కాలేజీ విద్యార్థులు.... యూనివర్సిటీ విద్యార్థులు మరో పనిలేక చదివేస్తూ- పెళ్ళికాక ఆడది చదువుతే, ఉద్యోగం దొరక్క- మగాడి చదువు-

బయటపడ్డాక, పనికిరాని డిగ్రీ మిగులు-

ఇరవై ఆరేళ్ళు దాటిపోతే కండెమ్డ్!

వీరిలోంచి పూలా, ముళ్ళా బహిర్గతమౌతాయి?

పూలు ఎవరి ఆనందానికి?

ముఖ్యం ఎవరికి గుచ్చుకుందుకి?

ఉద్యోగం దొరగ్గానే వీరు గులాములుగా మారుతారు- వీరిలోంచి మార్పు తెచ్చే వీరులు పుడతారా? సుఖం కావాలనుకొనే వీరు కష్టాలు సహించగలరా?

పవరు పట్టుకున్నవాడు అవినీతిపరుడైతే అతణ్ని అనుకరించినవాడే బాగుపడుతున్నాడు- మిగిలినవాళ్ళు మట్టికొట్టుకపోతున్నారు. పవర్ కోసం కుక్కలకన్న కనాకష్టంగా పోరాటం నడుస్తోంది.

అవినీతికి వీరాజనం పడుతోంది లోకం-

యువశక్తిని తమ పవరు నిలుపుకుందుకి అవినీతికి బానిసలగా మార్చే రాజకీయాలు!

ఇదీ మన కల్చర్!

ఇంతలో కరెంటు పోయింది! దీపాలారిపోయేయి—

రోడ్డంతా చీకటి!

నాగరికత స్తంభించిపోయింది!

సినీమాలు ఆగిపోయేయి- ఎయిర్‌కండిషనర్లు ఆగిపోయేయి.... హోటళ్ళ లోని విలాసంకి కామా పడింది.

"చెమట! చెమట! డాడీ! ఎలక్ట్రిసిటీ బోర్డ్‌కి ఫోన్ చెయ్యి! నా ముఖం మీది మేకప్పు చెమటతో ధారగా కారి బాకు దెయ్యంరూపం వచ్చేస్తోంది!"

"ఏమండీ ఏమయింది? మరో వంద మెగావాట్లు తెప్పిస్తే మీ సొమ్మేం పోయింది? నో! నో! ఇదేం బాగులేదు! ఇవాళ మా అమ్మాయి పార్టీ ఇస్తోంది. దీపాలు లేపోతే ఎలా?"

వచ్చేసింది కరెంటు! హమ్మయ్య! హాయ్! హాయ్!

కరంటు లేకపోతే కల్చరు మూలపడదూ? నాగరికత నాలుగుచెక్కలవదూ?

"కోక్‌తో వోక్ చెయ్యమంటారా?" ఓ సరసుని కల్చర్డ్ ప్రశ్న.

"ఐస్‌కోల్డ్‌గా ఉంటే చెయ్యండి!" ఓ సరసురాలి కల్చర్డ్ జవాబు!

"అరెంజ్ క్రష్ చెయ్యనా?"

"రసం ఉంటే క్రష్ చెయ్యండి!"

బార్‌లో స్టీరియో మ్యూజిక్కు- ఒక స్త్రీ ట్రూవింగ్ చేస్తోంది.

"అబ్బ! ఉషాఅయ్యర్ ట్రూవింగ్ ఈజ్ వండ్రఫుల్!"

"నీ అధరం మధురం.... అతి మధురం!" అదో పాట—

"తమకి మీరు పడదా? స్కాచ్ కావాలా? పెగ్గు పాతిక!"
"టీస్కురావోయ్.... నా అధరం మధురం సాయవోయ్!"
"బాహాగా చెప్పేరు. వెధవ డబ్బు! డబ్బు శాశ్వతంటండీ! వచ్చుపోతున్నది అశ్విస్తోంది! ఖర్చుపెట్టడంలో ఉంది గ్రేట్‌నెస్!"
"కరెక్ట్‌గా చెప్పేరు- మనం అర్జిస్తాం- విసర్జిస్తాం! అంతే కదండీ! అదే డబ్బు సంగతీనీ!"
"మహా నిజం సెలవిచ్చేరు సార్! తేరా! మరో డబల్ పెగ్ సాట్కి!"
"మధురం.... మధురం.... అతిమధురం!"
"హాయ్ లీలా! హాయ్ మధూ! వెల్‌కమ్!"
"హేపీ బర్త్‌డే టూ యూ!"
పదిహేడు కొవ్వొత్తులే పెట్టింది పాతికో బర్త్‌డేకి కుమారి కబరబంధిత!
"కేకు ముక్కల్ని పంచమ్మా పంచు!"
"వచ్చే ఏటికి నీకు పాతప్రియుడు తప్పి, కొత్త ప్రియుడు చేకూరుగాక!"
మిత్రురాలి శుభాకాంక్ష చెవిలో-
"వాడు పెళ్ళిలోకి దించకుండా ఉంటే చాలు!"
"ఎప్పుడూ పెళ్ళొద్దా?"
"ముప్ఫయిదాటి మూలవి వద్దాక! అంతవరకూ నా తన్, మన్, ధన్ నేను ప్రేమించే ప్రియుడిది! ఈజ్ ఇట్ నాట్ గ్రేట్?"
"ఇట్ ఈజ్ రియల్ లిబరేషన్ కబరబందీ!"
"ఏం పుచ్చుకుంటారు?"
"నాకు గోల్డ్‌స్పాట్!"
"గోల్డ్‌స్పాటా? ఎక్కడుంది నీ కోల్డ్‌స్పాట్?"
"ఇదీజ్ ది హాటెస్ట్ స్పాట్ ఫర్ యూ!"
"నాకు గోల్డ్‌స్పాట్ ఇష్టం- ఉందా?"
"అదీ ఉంది!"
"ఎక్కడ?"
"ఉండవల్సిన చోట!"
"అదిదా?"
"పదిగ్రాములూ రెండు వేలు!"
"చవగ్గా అమ్మేస్తున్నావ్ నీ స్పాట్‌ని!"

"అది తిరిగి నా దగ్గరికే వచ్చేస్తుంది!"

"నేను చూడొచ్చా?"

"యూ నాటీ! ఇది బజారనుకొన్నావా? దుకాణానికి రా ముద్దువుగాని!"

మంచి గోల్డ్‌గా సంభాషణలు నడిచాయి!

"కరెంటు కొరతవల్ల అచ్చుయంత్రం ఆగి సకాలమునకు వారపత్రిక అందించలేకపోతున్నందుకు చింతిస్తున్నాము!" ఒక ప్రకటన.

"అయ్యో! అయ్యో! సరి ఈ సీరియల్‌లోని మంజుల అక్కడలానే ఉండిపోయిందా? ఇంతవరకూ అష్టకష్టాలు పడ్డదే? మనోరంజన్ని చేపట్టిందో లేదో!"

"రచయిత్రికి రింగిచ్చి అడుగుతే?"

"ఏమమ్మా! అభిమాన రచయి(తా)త్రీ! ఏమయిందా కథ ఆఖరికి?"

"ఎలా చెప్పనండీ? నవల పత్రికలకి అమ్ముడుపోయింది! నేను చెప్పనశక్తురాలిని! క్షమించరూ పాఠకీ!"

"పాఠకీ? నన్ను పాతకి నంటావా?"

"పాఠకి అన్నానండీ!"

"అలా దారికి రండి! మేం చదవబట్టి మీరున్నారు కబడ్దార్! కథ సుఖాంతం చెయ్యి! లేకపోతే నువ్వు చెత్త రైటర్‌వని ఎడిటర్‌కి వేలకొద్దీ ఉత్తరాలు రాయిస్తాను!"

"జగమే మాయా.... బతుకే మాయా...."

"ఏం సాంగయ్యా! అహా ఘంటసాలా! అహా సముద్రాలా! అహా సుబ్రామన్! ఈ పాటకి రీప్లేస్‌మెంట్ లేదయ్యా!"

మందు కొడుతూ... కబాబ్ ముక్కలు నములుతూ.... నగ్నచిత్రాల పినప్స్ చూస్తూ....

"కావడి కొయ్యేనోయ్! కుండలు మన్నేనోయ్!"

"కాదుటయ్యా మరి? ఈ మందేమిటి? కల్లుకాదూ? ఎన్నో పేర్లు పెడతారు_ ఈ కబాబ్ ఏమిటి? మాంసం కదూ_ దాన్నే పులావ్ అంటారు.... ఫ్రై అంటారు.... హామ్.. అంటారు.... సాసేజెస్ అంటారు...."

"అంతే.... గురూ.... అంతే.... నేను మడిసిని.... నువ్వు మడిసివి! మరి నువ్వు రామారావెలా గయ్యేవు? నేను కృష్ణారావెలా గయ్యేను! అహా....( మాటొచ్చింది కాబట్టి.... బేరా! మరో హాఫ్‌బాటిల్ పట్టుకురా!"




"ఏమండీ మధువు మధురమేనా, మగువ మధురం అక్కర్లేదా?"

జిగ్‌జిగేల్ !

"ఎవరు నువ్వు? ఆడా.... మొగా?"

"నా చీర.... రవికా అగపట్టంలేదా? నాకో పెగ్గు పట్టండి!"

"సీర! రయిక! ఏంటమ్మా అయి? కావిడి కొయ్యేనోయ్! కుండలు మన్నేనోయ్! అయి తీసి! నువ్వా.... నేనా.... అందరం ఒకటే! పెగ్గు పట్టడం ఏంటి? పాలు తాగుతున్నావా పాలిస్తున్నావా? నీ వయసేంటి? బుద్ధి ఉంది.... గళాసుంది! ఏసొక్క రమ్ము! కలుపుకో సోడా!"

"థాంక్స్!"

"అదేటా ఎంగిలిపీసు సదివేవా?"

"అన్ని చదువులూ కడుపుకోసమే కదా?"

"కడుపా? నీకు కడుపా?"

కిలకిలా నవ్వు.... "నాకు కాదు! మీకు!"

"నాకు కడుపా? మతిపోయిందేటి? నేను మొగోణ్ణి! తెలీదా?"

"తెల్సుకోవాలనే ఉంది!" రమ్ము గటగటా తాగింది-

"ఎందుకు? ఏం లాబం నీకు?"

"పాతిక రూపాయల్లాభం!"

"అంత తక్కువా లాభం?"

"అదే ఎక్కువనేవారూ ఉన్నారు!"

"నువ్వు టేక్సు కట్టక్కర్లేదు కదూ?"

"కోర్టు కెక్కితే జరిమానా కట్టాలి!"

"ఆవిడ కొట్టేస్తేనో? ఏమోస్! అమ్మో మరో పెగ్గు! మా గదికా నీ గదికా?"

"ఈ బారు వెనకనే ఉంది ఓ గది...."

"ఇంకేం పద!"

వేదాలలో సార మింతేనయా పాట ఆఖరయింది.

## 21-30 గంటలు

మొదటి ఆటలు పూర్తిచేసుకున్న సినిమాహాళ్ళు, ప్రేక్షకులని బయటకు కక్కాయి.

ప్రేక్షకులనించి ప్రయాణీకులుగా మారుతున్నాయి.

సినిమా చూసిన కొందరు ఆనందించేరు- కొందరు ఏడ్చేరు- కొందరు ఆత్మహత్య చేసుకుందా మనుకున్నారు.

ఏడ్చినవాళ్ళు, చద్దామనుకున్నవాళ్ళు మరి రాకూడదనుకున్నారు.

"ఏమోయ్ హీరో, నా తాతలా ఉన్నావు! కుర్రాళ్ళకి కొంత ఛాన్సివ్వవయ్యా. నీ ముసలిమొహం చూడలేక చస్తున్నాను." అనుకుందో తరుణీమణి-

"ఓసి పొట్టీ గెంతలేక నువ్వు పడే అవసాపాలూ మరి చూడలేను.... ఇక చూడటం ..." పదహారేళ్ళ బాల ఈసురోమంది.

"ఓసి ... హీరోయినమ్మా! ఆ చీరిప్పేసి, ఓ సారి స్నానం డ్రెస్‌తో నిలబడమ్మా నీ అందమేంటో తెలుస్తుంది." అని అరిచేడో యువప్రేక్షకుడు. హిందీ తెరమీద మెరిసిపోయే పదహారేళ్ళ 'జాస్మిన్' అతని అభిమాన నటి.

క్లోజప్పుతో కెమెరా కళ్ళమీద- లాంగ్‌షాట్‌తో ఒంటిమీదా.

"హీరోయినికి లాంగ్‌షాట్లు .. మీకు క్లోజప్పులూ ఎలాగౌతాయమ్మా."

"నేను అమ్మని కాను. ముద్దుగుమ్మని."

సంసారంతో సినిమాకి వచ్చిన గృహమేధి చద్దామనుకున్నాడు.

"అయ్యో! అయ్యో! నా కూతుళ్ళ పక్కని కూచొని ఈ కాకోకితం ఎక్కడ చూసేది." సగం ఆటలో బయటకుపోయేడు-

ఎందుకీ బూతులు?

అంతా బూతే. ఎలక్షన్లకి బూతులు వాడ్డంలేదూ? సినిమాలకీ ఉంటాయి- సాహిత్యానికీ ఉంటాయి.

బూతు లేకపోతే లలితకళలేం గావలె? సినీమాలకి, కథలకి, వినోదాలకి, నాట్యానికి, కవిత్వానికి బూతే కద మూలాధారం?

బూతు బతికుంచేనే మానవజాతికి మనుగడ.

నువ్వు బూతంటే బూతు- కాదంటే కాదు.

చిటపట చినుకులు ప్రారంభమయ్యేయి.

బస్సులు రద్దీ.

పుష్పలత, ప్రేమలత, అమృతలతలు పైటలనే గొడుగులుగా వాడేరు-

“మా కందులో కాస్త చోటివ్వరాదూ?” ఒక మగాడు చమత్కరించేడు..

“ఇస్తాం కాని నష్టపరిహారం చెల్లించుకోవాలి.”

“ఏం నష్టమౌతుంది? ఏం పరిహారం?”

“మా పరువునష్టం- పరిహారం పుస్తెలతాడు.”

“హమ్మబాబోయ్. అంత డబ్బు దగ్గర్లేదు.”

“అయితే తూర్పుకి తిరిగి దండంపెట్టు.”

కార్లు రివ్వున పోతూ బురదనీళ్ళని చిమ్మేయి.

“దగుల్బాజీలు. కారుండగానే కళ్ళు కనిపించవు” భీమరాజు తిట్టేడు.

“నాకో కారుంటేనా?” కామరాజు స్వగతం పలికేడు-

“అందులో లిఫ్టిస్తారా నాకు.” ప్రేమలత నాంది ప్రస్తావన చేసింది.

“ఎంత మాట. ఎబ్డక్ట్ చేస్తాం చెయ్యమంటే.” కామరాజు జోకేసేడు.

“కారు ఖరీదు మరీ డెబ్బయివేలయి పోయిందయ్యా. మనం కొనగలమా ఈ జన్మలో?”

“కాదు సంగతొదులు. పెళ్ళాం ఖరీదూ ఎక్కువైపోయింది- పెళ్ళి చేసుకుంటే నెలకి వెయ్యి జీతం ఉండాలి. మన జన్మలో పెళ్ళవుతుందా మనకి.?” భీమరాజన్నాడు.

పుష్పలత నవ్వింది- “వెనకటి కెవత్తో కెరటాలు పోగానే సముద్రంలో స్నానం ఆడతానందిట. ఆలా ఉంది మీ వరస.”

బస్సొచ్చింది ఎక్కేరు-

మగాళ్ళు కూర్చున్నారు, మగువలు నిల్చున్నారు-

“ఆడపిల్ల నిల్చుంది కాస్త చోటియ్యవయ్యా?”

“ఇది మగ సీటు- ఆడసీట్లో మగాడ్ని కూచోనివ్వరు? మగసీట్లో ఆడాళ్ళు కూచోటమే కాక, కూచుంటే లెమ్మంటారా?”

"అపాటి ఇది లేదయ్యా?"

"లేదు. నే లేవను. నా ఒళ్ళో కూచుంటే అభ్యంతరం లేదు."

"మాటలు తిన్నగా రావీ."

"మీ మాటలు సరిగా రానీండి."

"సరే నీ ఒళ్ళోనే కూచుంటా. ఇది పట్టు."

వచ్చి ధబీమని ఒడిలో కూచొనేసరికి అబ్బాయి అప్పడంలా అణిగి పోయేడు.

"బాబోయ్! ఇంత బరువా!"

"ఆడది బరువే! మగాడు మొయ్యాలి! అందుకే భర్త అన్నారు!"

"నేను నీ భర్తని కాలేను! నేనే నిల్చుంటాను!"

లేచి నిల్చున్నాడు! "ఆడాళ్ళలో గూండాయిజమ్ ఎక్కువయిపోయింది మరినీ."

"ఎందుకెక్కువ కూడదూ?" అడిగింది....

"ఎదురుప్రశ్న కూడానా?"

"మీలోనే ఉండాలా గూండాలు? మేం భయపడుతున్నకొద్దీ మా మీద మీ జులుం చెలాయిస్తూనే ఉంటారు. మేమే తిరగబడితే మీరెక్కడుంటారు? వండిపెట్టం.... పిల్లల్ని కనం- సంసారం చెయ్యం- అంటే మీరేమౌతారు?"

"హాయిగా ఉంటాం."

"ఆడదానిని గౌరవించని జాతి ఎప్పుడూ బాగుపడదు."

"ఎవరి కొటేషను."

"నాదే- మేకకి కసాయివాడు కావాలి చంపేవరకూ మేపడానికి అన్న మనస్తత్వంతో ఉంది మన ఆడజాతి- తిండి పెడుతున్నందుకు వాడి కత్తికి మెడ అందించి అపాటి కృతజ్ఞత చూపొద్దా? అంటారు మీరు. మేం మేకలం కాం, మనుషులం అని మీకు తెలిసొచ్చే రోజు దగ్గర్లోనే ఉంది."

"మీరు మేకలా? రామ రామ! మేం ఏమవాలి? పిల్లులమా? మీకేమండీ మహారాణిలా స్వర్గసీమలో కూచున్నారు- తిండి ఆర్జించేదెవరు? ఆఫీసులో తిట్లూ, చీవాట్లూ తినేదెవరు?"

"అదో పనా? ఆ పని మేం చేస్తాం. మీరు మా పని చెయ్యండి దేశం బాగుపడుతుంది. లంచగొండితనం, గూండాయిజమ్, బలత్కారాలూ ఇవన్నీ తగ్గుతాయి."




"దిగండమ్మా మీ స్టాపొచ్చింది!"

"గుడ్ నైట్ అబ్బాయ్!"

"నేను గుడ్ నైట్ అబ్బాయిని కానండీ. బ్రహ్మచారిని."

"దెన్ బ్యాడ్ లక్!"

## 23-00 గంటలు

రోడ్డుమీది బస్సులూ కార్లూ పలచబడ్డాయి.

పేవ్ మెంట్ హాకర్లు ఏ కాలమయో తమ సరుకులు పట్టుక ఇళ్లకు పోయేరు.

పేవ్ మెంట్లు ఖాళీ అయ్యేయి

పొద్దున్ననగా పోయిన పేవ్ మెంట్ సంసారాలు తిరిగివచ్చేయి.

ఆడా, మగా. చిన్నా, చితకా—

రోజల్లా పనులుచేసి శరీరాలు అలసిపోయేయి.

నిర్ణీత స్థలాలలో దాచుకున్న పడకసామగ్రిని బయటకు తీసేరు.

చాపలు ... బొంతలు....

మధ్యాహ్నం, రాత్రి భోజనం మరోచోట ఐపోయింది.

ఇంక కావల్సింది కంటినిండా కునుకు–

ఆకలి రుచెరగదు– నిద్ర సుఖం ఎరగదు.

కొందరికి ఆకాశమే పైకప్పు, నేలే పరుపు, మోచెయ్యే తలగడ. నిద్రలో మెదడూ నిద్రపోతుంది. వర్రీసుండవు. తెలివి రాగానే వర్రీసు.

మనిషికి మెదడెందుకు?

వేలకొద్దీ చిరుగుల బతుకులు.

పేవ్‌మెంట్ మీద పుట్టేరు, పెరిగేరు, అక్కడే చస్తారు.
ఆలుమగలు ఆ పేవ్‌మెంట్‌మీదే శృంగారం.
వరాలు ఊరుకోవుగా?
రక్తం ఉరకలువేస్తూ-
"ఛా! ఇక్కడేటి?" మగాడ్ని దూరంగా తోసింది.
"యిదే మవిల్లు. దుప్పటి కిందకొచ్చి!"
ఓ చిరుగుల రగ్గు కప్పి దగ్గరకు తీసుకున్నారు.
కవిసించకుండా దుప్పట్లోకి కుంచుకపోయింది.
ముసుగుపీరులు.
ముసుగులో గుద్దులాట.
ఛావిఛారక వీరుడికో వీరురాలికో ఆ పేవ్‌మెంట్‌మీద బీజం పడింది.
మూడు విముషాల్లో ముసుగు తొలిగిపోయింది.
"వీ జాగాకి నువ్వు పో. నా జాగాకి నేను పోతాను."
ఆకాశంకేసి చూస్తూ పడుకున్నారు.
"ఏటే? పల్లా వార్సం ఒస్తదేటి?"
"ఒస్తాది గావాల్ను"
"మెరుపులు మెరుస్తున్నయ్యే."
"ఈ రేతిరి మరి తొంగున్నట్టే." అదగొంతు.
"కాస్త పడి తగ్గిపోదా?"
"తగ్గదేమో?"
"ఆ యాపీసు మెట్లమీద కూకొని కునుకుపాట్లు పడాల."
"ఓహ్! టుడే ది వెదర్ ఈజ్ వెరీ ప్లెజెంటు." ఒక విదేశీ టూరిస్టు, కాల్‌గరల్ నడుంచుట్టూ చెయ్యివేసి పేవ్‌మెంట్‌మీద నడుస్తూ అన్నాడు....
"యా. ఉయ్ విల్ హేవ్ ఎ గుడ్ టైమ్." అంది చీర అందంగా కట్టి, అందంగా అలంకరించుకున్న పాతికేళ్ల పడుచు.
వాళ్లు వెళ్లగానే....
"గుంట గుమ్మగుందే. ఎంతుచ్చుగుంటదో ఆ సీమదొర దగ్గర."
"ఐదొందలిస్తేకాని తొంగోదాడి పక్కలం. అక్కడైదొందలు లెక్కేటి?"
"పలవగదిలో ఆడి పక్కలో తొంగుంటే రంజుగుంటది గుంటకి." మగాడన్నాడు....

"వాకా జలమన్నా యిచ్చినాడు కాదు దేవుడు. ఓ ముష్టోడికి పుట్టించినాడు."

"మల్ల జలమెత్తవేటి?"

"జలమెత్తి సీమదేశంలో పుట్టాల.... యీ దరిద్రం దేశంలోనా.... ఛీ. థూ." ఆడది ఉమ్మింది.

"దిస్ ఈజ్ ఏ గుడ్ వెదర్ ఫర్ బూజింగ్." ఇద్దరు మిత్రులు నడుస్తూ-

"బూజింగ్ ఎండ్ బంపింగ్...."

"షెల్ ఉయ్ అస్క్ ఫరె గాల్?"

"యా.. వన్ ఫుడ్ డూ ఫర్ బోత్."

"వన్ బై టూ!" పకపకా నవ్వు....

"ఏంటంటున్నారు?" ఆడది అడిగింది....

"అళ్ళకి గుంట కావాలంట. ఎళ్తావేటి." వారన్న మాటలు అర్థంకాక పోయినా గెస్‌మీద అన్నాడు....

"వెళ్ళి మాటాడిరా." నవ్వుతూ అంది.

"ఐవన్టే. నీ మొకం నా మొకం జూస్తే జోడట్టుక ఎంటపడతారు. అళ్ళ ఓటల్లోనే రంబనాటి గుంటలున్నారే."

వర్షం ఎక్కువయింది-

గబగబా పేవుమెంటుమీద నడుంవాల్చిన వారంతా ఎక్కడ భవనం కనిపిస్తే అక్కడ దాని నీడకింద తలదాచుకున్నారు. వర్షాన్ని తిట్టుకున్నారు-

"అహ! మరి కాళిదాసేమంటాడు!"

"ఆకాదస్యే.... ప్రథమ దివసే! అన్నాడు కదండీ! మేఘసందేశం కావ్యం ఎలా పుట్టిందంటారు?"

"మన ఠాగూరుగారు ఇలా వర్షాన్నీ, పురుషుల్నీ, మేఘాలనీ చూస్తూ అలా చూస్తూనే తన్మయత్వం అనుభవించేవాడుటండీ శాంతినికేతన్‌లో."

"మరి కాదుటండీ? మహాపురుషులండీ వారు. మీదీ నాదీ ఒక కవిత్వమా."

"బాగా చెప్పేరు. వర్షంలో తడుస్తేనన్నా ఇన్స్పిరేషన్ ఒస్తుందని."

"అదీ పాయింటే. అనుభవం లేందే ఆవేశం పుట్టదు కదా?"

గొడుగులు వేసుక వర్షాన్నీ రాత్రినీ అనుభవిస్తూ ఇద్దరు నడుచుకుంటూ పోయేరు-

కాని....

ఈ నగరపు పేవుమెంట్ల సంసారాలకి రోజూ ఒకటే ప్రార్థన.

"దేవుడా. ఇవాళ మమ్మల్ని వర్షంవించీ, ఆకలివించి కాపాడు."

టప్.... టప్.... టప్....తో ప్రారంభం.

టపటపటప ...టపటపటప.... జోరు.

హోర్. హోర్. హోర్. కుండపోత.

పెద్దపెద్ద మల్టీస్టోరీడ్ బిల్డింగులు ప్రస్తుతం కాళీ....పగలందులో ఆఫీసులు-

వీరు.... పగలు కాళీ.... రాత్రి పేవుమెంట్ల ఇళ్ళు.

"ఈః యిల్లు కెంత చిమ్మెంటవుద్దో రాఁవఁయ్యా. మనకోసం పదివేలిళ్ళు కట్టొచ్చయ్యా."

"కావి కట్టరయ్యా."

"ఎందుకంటావ్ రాఁవఁయ్యా."

"కట్టరంతే."

## 01-00 గంటులు

రెండో ఆట సినీమా వదిలేరు-

ఇళ్ళకి పోడానికి బస్సులు మరి లేవు-

వర్షం టపటపా పడుతూనే ఉంది.

టాక్సీలూ, ఆటోలూ ధరలు పెంచీసేయి-

స్వంత వాహనాలున్నవాళ్ళు వాహనాలెక్కి ఇళ్ళకు పోయేరు-

వాహనాలు లేనివాళ్ళు, వర్షం తగ్గదా అప్పుడు ధరలు తగ్గవా అవి నిల్చున్నారు.

రెండో షిఫ్ట్ చేద్దామవి వచ్చిన విలాసినులు, విటులకోసం నిలబడి, దొరికిన మగాడ్ని దొరికిన ధరకి ఎగరేసుకపోతున్నారు.

"మూడుగంటల బండి కందాలా? ఫరవాలేదు రద్దురూ. స్టేషన్‌కి దగ్గరే నా గది. ఆటో తీసుకోండి. నిద్ర పోనివ్వనులెండి. నా కబుర్లు వింటే మీకు నిద్ర రానేరాదు."

కావి చాలా మందికి బేరాలు లేవు.

ఆ నిశిరాత్రి, ఆ వర్షంలో, దీపాల చాటున నిలబడ్డ ఒంటికి అద్దెకి పెట్టిన అరదావి కేముంటుంది గిరాకీ?

సారంలేవి ఒంటికి సారంలేని బతుకు జోడించి, ఎలాగో ఓలా లాగుదామవి ప్రయత్నం.

దుఃఖం అనంతమైనంతుంది?

ఎవరికొక్కా వాటి దుఃఖం.

సుఖపెట్టగలవా నిలబడు. ఏడుస్తావా? వో.

నీ ఏడుపుని నీలో దాచుకో.

నవ్వు- నవ్వించు-

అప్పుడు నీ ధర పెరుగుతుంది.

ఎవరి ఇళ్ళకి వాళ్ళు పోయేరు. సినీమాహాళ్ళు దీపా లార్పివేయి.

ఒక్కతీ ఆడది నిలబడిపోయింది.

బేరాలు దొరక్క- ఒకతే ఉండిపోయింది,

నిట్టూర్చింది.. ఓర నిరసించింది.... ఎక్కడా మగపురుగే లేనందుకు ఎంతో విచారించి..,

లోకం తగలెడిపోతోందేం ఇలా?

మగతనం అంటూ ఏమయింది లోకంలో?

తనవంటి వయసులోని ఆడది కేవలం పదిరూపాయలకి రోడ్డుమీద నిలబడినా ఎవరూ తనకేసి చూడనన్నా చూడలేదే?

నిజమే!

ఇవాళారేపూ అబ్బాయిలూ అమ్మాయిలూ విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటే తనెవరికి కావాలి?

పాతివ్రత్యం మంటగలిసి, శీలం అంటే నవ్వులాటలగా తయారయిపోయి కన్యలే కరువయిపోతున్నప్పుడు తన నెవరు చూస్తారు.

విందుభోజనం ఉత్తనే దొరుకుతూ ఉంటే హోటలు భోజనం ఎవరి కొక్కావాలి?

బరువుగా అడుగులు వేసుకుంటూ పేవ్‌మెంట్‌మీద నడక ప్రారంభించిందామె.

ఇవాళ రాసుకున్న పౌడరు వృథా!

వేసుకున్న లిప్‌స్టిక్ వృథా!

కట్టుకున్న చీర వృథా!

వేసుకున్న వేషం వృథా!

బస్సుకిచ్చిన డబ్బులు వృథా!

కాళ్ళ పీకు దండుగ! మేకప్ శ్రమ దండుగ.

ఒక్కసారి ఆమె కళ్ళు జిగేల్మన్నాయి.

బస్‌స్టాప్ దగ్గర చిటపట చినుకులో మగాడు!

మంచి బట్టలే తొడిగేడే!

జేబులో చిలుమున్నట్టే ఉందే.

ఉత్సాహం పెల్లుబికగ్గా ఆటుకేసి వయ్యారం అంతా నడకలో ఒలక బోస్తూ నడిచింది.

అక్కడికి వెళ్ళి అతడ్ని సమీపించేక సూచన లిచ్చింది.

క్రీగంట చూపు.... పొడిదగ్గు.

ఆ మగాడు ఇందాకట్నుంచి ఆమె మీదే కన్నువేసేడు. హాలు దగ్గర నిల్చుంది- మాంచి షిఫాన్‌చీర జమాయించి కట్టింది.

అక్కడి వీధి దీపం లేదు.

ఆ ఒంటరి ఆడదాని రూపం, అనుపానులూ సరిగ్గా నజర్‌కి అందలేదు,

ఇద్దరూ ఒకరి కొకరు దగ్గరగా నిలబడ్డాక....

సిగరెట్టు పెదవులమధ్య నుంచి అగ్గిపుల్ల వెలిగించేడు.

ఒక్క క్షణం ఆ పుల్ల వెలుగులో ఒకరి కళ్ళలోకి ఒకరు చూసు కున్నారు- అంతే....

చీత్కారం చేసేడు.

"ఓస్ నువ్వా. ఎవర్తో హైక్లాస్ ఇంటిబొట్టె వనుకున్నాను. ఛూట్ నువ్వా!"

ఆమెకి, ఏడవలేక నవ్వు గలగలా వచ్చింది. దుఃఖం యొక్క కరుకు తనం ఉందా నవ్వులో- ఓరి నువ్వా! పెద్దింటి షోగ్గాడివనుకున్నాను."

"పెద్దింటి షోగ్గాడు కార్లలోకాదే గుడిసేటి గుంటా. యీదనేం నిల బడతాడే?"

"ఐక్లాస్ యింటి బొట్టి అర్ధరాత్రప్పుడు నీ కాడకేలొస్తాదిరా ముదనష్టపోడా! జేబులు తగలేన్నోదా?"

ఇద్దరూ గలగలా నవ్వుకున్నారు....

"జేబులు తగలాన్నాయి కాని అందం దబుల్నేవు! నీకు మగోడే తగలేన్నోదా?"

"తగిల్నారు కాని ఎవురికీ మొగతనం నేదు!"

"నానూ మొగాడ్ని కానంటావేటే?"

"అయితే పద- ఆకలేస్తంది- కాకాహోటల్లో టిపినిప్పించు సాలు!"



"సరే పద."

"తరాత నా గదికిపోయి తొంగుందాం"

"అది నువ్వు చెప్పాలేటి? ఆ మాట నీ ఒంటిమీద ముద్రపడి యుంది."

ఆమె నడుం చుట్టూ చెయ్యివేసేడు–

ఏదో ఓ పాట ఎత్తుకున్నాడు మగాడు....

గొంతు కలిపింది ఆడది–

వర్షంలో, చీకట్లో, రాజమార్గాన, రాణీమార్గాన, రాజూ, రాణీనూ ఇద్దరూ ఒకరి వెచ్చదనం ఒకరు అనుభవిస్తూ నడిచిపోయేరు

రోడ్డు మళ్లా 04.00 గంటల వరకూ ఓ కునుకు తీసింది.

# అక్టోబరు నెల యువ

# భావ పరిచయ పోటీ

**బహుమానము రూ. 25-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి అక్టోబరు 20 వ తేదీలోగా పంపవలెను.




(గత సంచిక తరువాయి)

ఆ పర్నాడు- పొద్దుటండి- మా బావిదిగాడండి- "యేడ్రో పెట్టిబాబు విన్న సాయింత్రం మీటింగెట్టిన్నున్నాడు" అని.

"యెట్టేడండి" అన్నానండి.

"మీ యాదదిగూడా యెళ్ళిందట!"

"పిత్తం వొచ్చినాదండి. దానికి గంటు నొప్పండి."

"గంటునొప్పైనా- పంటినొప్పైనా లేడిడాట్రుండిగాదురా- ఆ యెగస్పార్టీ యెదవకాడికి- యెళ్ళడం- దేనికి?"

అనడిగినాడండి- ఆ బాబుకేదో అను మానవొచ్చినా దయిపించినాదండి- నా మట్టుకు- నాకు.

నాను ఆలోసించకుండా అనీసినానండి- "మొదట్లో నా నొక్కాడ్నే యెదితే సిట్టిబాబు నన్ను నమ్మడన్జెప్పి- దా ని ఏ కూ డా రమ్మనీవోడినండి- వొచ్చింది వొచ్చినట్టూ కూకోక- సిన్న దానికి పెద్దదానికి వొయిజ్జెం పేయించు కోడం ఆరంబించినాదండి- దా ని కి గంటునొప్పండి- దానికితోడు నెలకు మూడుమాట్లు బయట కూకుంటాదండి. దానికి ఆ బాబు వొయిజ్జెంలో గుణం కనిపించినాదండి. దాంతో ఆ బాబు "అన్త వాసి" మంచిదని దా ని కి నమ్మకం యేర్పడిపోనాదండి- మన డా(టమ్మ వొచ్చినాక- ఆ బాబు నొగ్గిసి- ఈ యమ్మ కాడికెళ్ళవే- అం టే- యేటన్నదో బాబూ- యెరికా- డాట్టర్ని- డాఫర్ని మారసగూడదు అంనండి- సెప్పుకుంటే సిగ్గు. ఆదొకప్పుడు "యాపారం"లో ఉండీదిగదండి- దాని నమ్మకాలూ- పాటెంతలూ అన్నీ ఇలాటియ్యేనండి" అన్నానండి.

"అదకాదుగ- అంటీముట్టకుండా అవకల పార్టీలో ఉంటేనే మంచిదిలే- ఇంతకీ మీటింగు సంగతులేటి- ఆ వత్తరికాయగోడి బోడిస్తాను ఏటీ? ఊరంటించేస్తాడా? సెరవులు తెగ్గొట్టిం చేస్తాడా?" అనడిగినాడండి.

"తెగ్గొట్టించెస్తాడట- గానండ బాబా- సెరువులు మాత్తరం గావటండి."

"మరేటి తెగ్గొట్టిస్తాడు. కూలి గుంట లకి తగులుకొని అళ్ళ మెళ్ళల్లో కాళ్ళా?"

"కాళ్ళగావు బాబూ, మెళ్ళ (మెడలు)"

"యెవురియిరా?"

"మనయ్యేనండి- అళ్ళ పీకలు అళ్ళే కోసుకొంటంత- యెఱ్రిగొత్తెలుగాతండి- అవతలపార్టీవోళ్ళు"

"మన పీకలెందుకు కోస్తార్రా?"

"మన కోతలకి మనూరి "నేబర్ని" (లేబర్ని) పిలకపోతే మన పీకలే కోసేస్తాడటండి- సిట్టిబాబు."

"అంత 'హీరో' అయ్యేడ్రా కుర్ర నంజికొడుకు. పొలం నాది. పంట నాది. కోతకి నాకు ఇష్టంలేని నేబర్ని పిల్ను- ఇష్టం ఉన్నోళ్ళని పిలుస్తాను. పక్కూరివాళ్ళని పిలుస్తాను. నా యిష్టం. అళ్ళు రాకపోతే పోలీసోళ్ళచేత కోయిస్తాను. అళ్ళూ రాకపోతే రిజిర్వోళ్ళు- అళ్ళూ రా క పో తే మిలిటరీవోళ్ళచేత కోయిస్తాను. అళ్ళూ రాకపోతే పంటెంద బెట్టీసి పసువులచేత మేయింపించేస్తాను. మనూరి నేబరు ఊరిడిసి- వొలసెళ్ళి పోవాల- నే క పో తే మనూళ్ళోనే, మ ల మ ల మా డి సావాల. బెమ్మం (బ్రహ్మం)గోరి మాట తప్పితే- తప్పుద్ది గాని- నాది తప్పదు.

"నా మాటలు దాచక. ఆ కుర్ర డా(టుగోడికి- అది పార్టీ కూలినంజి

కొడుకులకీ- చెప్పు. దప్పేసి కొట్టి మరీ చెప్పు.

*దొంగదెబ్బ మన వంశంలో లేదు.

*వార్నింగ్ ఇస్తేనే గాని పంజా ఇవ్వం మనం.

*అంచేత- ఇప్పుడే యెళ్ళి జెప్పు 'ఒరేయ్ కుర్రదాట్రు యెదవా! ఒరేయ్ కూలిలంజకొడుకుల్లారా- మా పొలాల్లో- పంటలు కాదు సరిగదా- గట్లమీద గడ్డి కూడా కొయ్యడానికి మీ చేతులెట్టకోవ్వా.

*మీరంతా పేతులు కట్టుకొని సముద్రంలోనే దిగుతారో తాళ్లు కట్టు కొని పీకలే యేలాడదీసుకుంటారో- ముందరే ఆలోచించుకోండి అన్జెప్పు.

*పక్కూళ్ల నుంచి నేబరు రాకపోతే పక్క జిల్లాల్నుంచి వారీ(లారీ)లో దింపుతాం(వ)ని- అడ్డొస్తే పిట్టల్ని కాల్చినట్టు కాల్చేస్తారని- మనం గాదు- పోలీసోళ్లు- అంచేత- పిల్లాపాపా- యెదిగి బాగుండాలంటే- కూలోళ్లని పైటోళ్లూ- దాట్రుయెదవని చెయినా పొమ్మని చెప్పు.

*కుళ్లనీళ్లు తాగి వస్తున్న కూలినంజి కొడుకులుకి- పోనీగదా అని మంచి నీళ్ల నుయ్యి తవ్విస్తే మంచినీళ్లు తాగి- ఇలాటి తప్పుడుబుద్ధులు కట్రా పోతారు?

*దొంగతనాలు చేసేరు, యెంత కాలంలో ఉన్న గుంటైనా (పిల్లయినా) దొంగతనంజేస్తే ఓ దెబ్బేస్యాక ముద్దు పెట్టుకుంటారట్రా? అంచేత ఓ దెబ్బేసి వంత మాత్తరాన- కట్టు కదతారా?

కోరటు కీడుస్తారా?

*కోరట్లలో యేటాడ్డో- కూలెదవలకి తెలకపోతే పోనాది- గాని- ఆ కుక్కాలం దాట్రుగోడికి తెలవొద్దూ?

*ఈదో రకోర్టు (రిపోర్టు) బకిరీసి- దానికో రూపాయి స్టాంపు- నాలికతో నాకేసి అంటించీసినంత మాత్తరాన- కోరటు మనుష్యులందర్నీ కైదుకి కట్టేస్తాదా? ఉరేపేస్తాదా? మాం- పోలీసుల్ని - పాచుల్ని- దాక్టర్లనీ- ప్లీడర్లనీ- అకిరికి కోరట్లని కూడా కొనీగలం- అమ్మీగలం.

*మా మాట గాదని- ఈ రాజ్జెంలో ఎవుడూ- నీళ్లు తాగలేడు- ఎందుకలేడు.

*కుళ్లలో- పురుగుల్లా- కిలకిలా- కొట్టుకు- బతుకుతున్న కూలెదవల్ని- పోనీగదా అని జాలిబడి- వొడ్డుకి జేరిసి- వొణ్ణం- యెసితే- మంచి పాఠమే నేర్పేర్రా గాడిదకొడుకులు. కూడేసిన- నెయ్యిని- కుక్క కూడా కరవదురా- కరవగలిగివోడూ- కరిసీవోడూ కూలో డేడ్రా.

*ఒంటిపూట తిన్నవాళ్ళే-కూలోళ్ళు - రెండుపూట్లా తిన్నారో నాను కానుకో నేదుగాని- సంగాలెట్టీక మాట్రను. యెట్టి వోళ్ళు- యెట్టినట్టూ ఊరుకుంటారా? ఉహూ(: ఊరుకోరు.

*ముందు బూ(పు(లు గావాంటారు!

*యెవిరియ్యి?

*గవర్నమెంటు వనుకు నేవ్.

"మనయ్య- మన బాఁవుఁలు- కావా లంటారు.

"బాఁవుఁలిస్తే ఇళ్ళు గావాలంటావా?

"అయా- ఇస్తే ఉజ్జోగాలు కావా లంటారు?

"ఉజ్జోగాలిస్తే యేటి గావాలంటారో- యెరికా? మీ పిల్లల్నిచ్చి పెళ్ళిళ్ళు జెయ్యండంటారు.

"యియన్నీ జేస్తే యేటాద్దో యెరికా?

"మాం ఈ లోళ్ళపైఁబోతాం.

"తెలివితక్కు-వెదవని- ఒక్క-పూట వస్తువడుకుండి- యెదవలకి- రెండు పూట్లా- వొణ్ణం ఉండేటట్టు జేద్దారని జూపేను- చేస్తే యే౯ంటో చూసేవ్ గదా!

"నా పంట కోతకి నా కిష్టంవొఁచ్చిన కూలోళ్ళని తెచ్చుకోటాని కీల్లేదని ఇయ్యేళ- అంటున్నారు.

"రేపొద్దున్న- నా కూతురికి నా కిష్టంవొచ్చిన మొగుణ్ణి జేటాని కీల్లే దంటారు.

"ఇక నేను నోటితో చెప్ప్లేనియ్యాను.

"చేత్తో చేసి- జూపిస్తాను.

"నేను ముందే- జెప్పేసినాను- నాది దరమయుద్ద వంట."

"గట్టుమీద గడ్డి కొయ్యడాని క్కూడా మనోళ్ళెవల్నీ- పిలవనని- బొట్టూ- కాటుకా- చీరెట్లూ- చెప్పుదెబ్బలూ- పెట్టి మరీ చెప్పు.

"అక్కోవి పిలకలు పీకో్క-మను.

అనాగిబోవాడంటి మా బాబు.

"తవఁరుగోరెప్పుడన్నా జూసినారో- నేదోగాని- గొడుగిద- జూసినప్పుడెలా ఆయాసపడుద్దో- అలా అయాసపడిపో వాడు మా బాబు."

"అసలే ఆ సిన్నాడూ- ఈ అయాసా నికి- హార్టెటాకే వొస్తాదేమో ననుకున్నా నండి.

"మా బాబన్న మాటలు- పువ్వులు దండ గుచ్చినట్టు- జెప్పినానండి సిట్టి బాబుకి."

"నా ననుకున్నకన్నా- సీరియస్సయి పోతన్నాదిరా పరిస్తితి' అన్నాడండి- ఆ బాబు. ఆ యెంటనే కూలీలందర్నీ- పిలవనంపి- మీటింగెట్టినారండి. బెల్లం దిమ్మకాడ- చీండసీమఁలు- జేరినట్టు- పోగైపోనారంటి-పిఁల్లె..

"వొచ్చేయి- వరికోతలు గావు. మన పీకల కోతలు- దీంతో మనం- ఊకో ఉండదనా- సంగ్రాంలో మొల గడవోఁ తేలిపోద్ది. సిన్నా పెద్దా- అడా మొగా- అంతా కలిసున్నా- సరే- కాని- ఒకళ్ళిద్దరు పోసిలినా- హోల్- మొత్తం పోటీలో- మునిగిపోద్ది. యెక్కడ యే నీళ్ళకి- అన్యాయం జరిగినా మనివాదర- కలిసి కొట్టాలం. రావణాసురుడులాటోడు- కోతులందండుకి తట్టుకోలేకపోంది. సీమఁలన్నీ కలిసి- కరిసేస్తే- నాగుబాఁవుఁ కాదు-

చెబుతున్నాను. మన్లో- యే ఒక్కడికి- అన్యాయం జరిగినా- అంతా కలిసి కొట్టాల- మరిసిపోకండి'' అని మరో పాలి- హుషారిచ్చినాడండి- ఆ బాబు.

అప్పుడు అక్కడి జేరిన వోళ్ళ మొకాలు జూస్తే- పాత యెర్రిగొర్రెల మొకాల్లా లేవండి- వీర నక్సలైట్ల మొకాల్లా- యెర్రగా యెలిగిపోతున్నా యండి. అళ్ళ ఉబలాటం జూస్తే- యెలా గుందంటే- అప్పుడే అళ్ళని ఊరిమీదికి ఒగ్గేస్తే-అవతల పాలేర్వోళ్ళని అందర్నీ -నంపేసి- ఉప్పు, కారం అవుక్కుండా- అళ్ళని తినేసేట్టున్నారండి.

* * *

''ఇక్కడ జరిగిందంతా మా బాబుకి చెప్పినానండి. అప్పుడు ఒచ్చిన బాబు కూడా ఉన్నాడండి.

''పటాలంవోడి- పెళ్ళి- ఇక్కడే త్తిరే వన్నట్టు-ఇంకెవా ళ్ళలే ఎళ్ళిపోబనం'' అన్నాడండి ఆ బాబు ''

''నా మొగుడి సత్తువ- నాకు తెల్దా- అన్నట్టు - తండ్రెవడో తెలిసి- ఈ తొత్తుకొడుకుల పని- నా కొగ్గి తమ్ముడూ'' అన్నాడండి మా బాబు.

''రోజా లెళ్ళిపోతన్నాయండి.

''కోతలు వోరానికి- వొచ్చేసినా యండి.

''బాంబు పేలద్దిగని యెప్పుడు పేలుద్దో- తెలవట్టు ఊరంతా సల్లగానే ఉందండి.''

''ఊళ్లో నప్పుళ్ళ్ళ- పెళ్లాలూ ఇనిపించడం మానేసినాయండి. కుక్కలూ- కాకులూ కూడా అరుపులు మరిసిపో నాయా- అనిపించీదండి నా కొకొక్క ప్పుడు.

''నంటిపిల్ల యేడుపు యింటే- సంగీతం విన్నట్టుండీదండి.

''మూడో నాడండి- రేత్తిరి- నాను కూడ దిసి- బీడీ కాలుసుకోడానికి పైకెళ్తా ఉంటే- ''పొద్దుటే- యెక్కడికి పోకండా- అరిజెంటు పనున్నాది'' అన్నా డండి మా బాబు నాతో.

''అదివొరకు- మా బాబు నాతో అలా- యెప్పుడూ అన్లేదండి- నాకు తెలని అరిజెంటు పని మా బాబుకేటుందా? అని ఆలోచిస్తే- అనుమానం వొచ్చేసినా దండి- అప్పుడే గ్రెహించేసినానండి- నాకాడ యెప్పుడూ- రహస్యాలు పెట్టు కోడు మా బాబు- నాకాడ- యేదో- ఇసయం దాస్తున్నాడనీ- తెల్లారితే- కురుచ్చేత్రం తప్పదనీ-గ్రెహించేసినానండి.''

* * *

''తెల్లారి లెగిసి- నా పనీ- ఉక్కలం పనీ- జూసుకుండేసరికి టయాం తొమ్మి దైందండి.

''తవరుగోయ కుసింత పేపాగాల- మొగుడొచ్చినప్పుడూ- రంకు మొగుడితో- యేవర్తో అన్నట్టు.

''రా బాబూ- డాట్టరుబాబూ- పిలా టోడే- విన్ను సల్లగా సావనిస్తే నాను

డాక్టర్ని గాను- అన్నాడట. మళ్ళీ కట్టి ప్పక- బాబ్బాబూ- పొద్దుటే- మీ అసి స్టెంటు బాబు కట్టిప్పి- కత్తితో- కోడి గెలికినట్టు గా గెలికి- కారిన రకతానికి మొకం తిరిగిపడిపోండు. అదురుష్టం బావుంది- ఆ బాబుకంటే- అడుగు పొడుగూ- రెండడుగులు యెడల్పూ- ఉన్న వరసుమీద పడ్డాడు కాబట్టి సరిపో దాది. నేకపోతే- యీపాటికి- పక్క- 'బెడ్డు' మీదుండీవోడు ఆ నరసు -వచ్చిన తొందవి పట్టుకున్నట్టు- యెడం చేత్తో పట్టుకొవి- గొరగొర ఈడుసుకు పోవాది. 'ఈ వార్డులోనే ఈ బాబుకి మూర్చ వొచ్చేస్తన్నాది. ఇక పురిటి వోర్డులో- యేస్తే- యేటౌతాదో' అని సణుక్కుంటూ.

"అన్నపస్- సంపేసినావయ్యా! అదేటి? ఇంజీషను సూదా? ఇనప ఇ వీ మా గొట్టవా? నాను తెలకడుగుతాను- సన్న సూదులు- గవర్నమెంటాస్పత్రిల్లి కివ్వరా? ఇస్తే- మీరూ- నర్సులూ- పిల్లలాడుకుంటారని- ఇళ్ళకి- అట్టుకు పోతారా."

"సూడు బాబూ- నాను పోలీసోళ్ళ కాడ పెరిగినాను- అంటే అళ్ళ వొణ్ణం తివి కాదు- అళ్ళ దెబ్బలు తివి. అళ్ళ వది దెబ్బలు- ఓ- మీ ఇంజీషనుకాడ- బలాదూరే,

"యెంత జెప్పినా మన పోలీసోళ్ళకి - బుద్దినేదు బాబూ- అనవసరంగా- అళ్ళచెయ్యి జేసుకుంటారుగావి- స్టేషనుకొ డాక్టర్నేసి- ఆ బాబుకో గవర్నమెంట 'సిరింజి' ఇచ్చి- ఓ ఇంజీషన ఇప్పించివారా అంటె- ఎవుడన్నా సరే- అకిరికి- వికరమైన నకనకై నైనా సరే- అమ్మమీద ఒట్టుపెట్టి మరీ- విజం అంతా కక్కేస్తాడు.

"ఐపోనాదా బాబూ- మీ పని- బొంబాయి పేట్నే- బెజవాడ ముండది! నట్టు- మీరు మంచోర్లాగున్నారు- రేప కలుద్దాం బాబు- మీకు- ట్రాన్స్ఫర్ రాకపోతే-

"చెమించాలి బాబూ- మిమ్మల్ని కూకోబెట్టేసినాను-ఇంత పేపూ-బోతెల హావును ముందు- మూడో పేసింజెరుతో అన్నట్టు.

"యె తవారకూ జెప్పినాను బాబూ- కతః అట- కుక్కలకాడి కొచ్చినాన గదూ. అటి పనీ- నా పనీ జూసుకుంది పరికి పొద్దున్న తొమ్మిదైపోవాదన్నాన గదూ!

"అ తరవాత- ఇంటి ముందు పందిట్లో కెళ్ళేసరికి- మా బాబులిద్దరూ- మరో పదిమందిరీ-అడివిలో నకసలైట్లలా గుసగుసలాడుతున్నారండి - సెప్పడం మరిసిపోనాను సన్యాసిగోడు కూడా ఉన్నాడండి.

"మా బాబు మాత్తరం- ఈన తోయి పులిలా- ఆయాసపడిపోతన్నా డండి. మిగతావోళ్ళు దేవికోసవో

యెదురుజూస్తున్నారండి. బ్రాకెట్టాట- రిజల్టు- వొచ్చేముందు జెనం యెలాగుంటారో- అలాగున్నారండి.

"ఇంతకీ తవర్లాటోళ్ళు- బ్రాకెట్టు లెందు తొరకారండి- యెత్తే- గుర్రప్పందేలు కెళతారు గాని!

"ఈళ్లెంతకీ రారేం?" అని ఒకదంటే "గడియో- రెణ్నో- వొచ్చేస్తారు" అని మరోడంటున్నాడండి.

"ఈ- వొచ్చేదెవరా? పావర్లకోట సానా? డిల్లీ యెంపీనా? అని నాకు "బ్లెడ్ ప్రెషరు" పెరిగిపోనాదండి.

"ఇంతలో- వొచి నాడు బాబూ- పందిట్లోకో "టెంపో"- దాన్లోంచి దిగినారు బాబు పదిహేను మందిరి- ఆళ్లలో- ఇద్దరు- మారీచ సుబాహుల్లా ఉంటే- మిగతావోళ్లు ఆళ్ల కవల అన్నల్లా ఉన్నారండి. ఆళ్లెవరని అడుగుతే కడుపులో ఉన్న పిల్ల కూడా సెప్పుతాదండి- సిటీ రౌడీలని. ఆళ్ల కనుబొమ్మలు- రావణాసురుడి మీసాలంతున్నాయండి - ఒక్కొక్కడి జుత్తులో పది పవనాలు కట్టించుగోవచ్చు బాబూ- ఆళ్లలో యే ఒక్కడినన్నా సరే- ఓ పులి ముందు అడ్డెరికి జేసి- సన్నిస్తాదండి- ఆళ్ళంతా ఒక్కొక్కడూ- బాబూ- ఆళ్ళలో పలుగుడు కలిస్తే ఒక యేనుగుని ఏకింకొకోలు- పీకిగలరండి.

"కాని అందులో - ఒక్కడు మాత్రం- మిగతావోళ్ళలా లేడండి- సచ్చిన ముసిలి యెలక్కి- సింకికోటు తొడిగినట్టున్నాడండి - అదూ అది కోటూనా- అది జేబులో అది తాళ "పెన్ను" ఉన్నాదండి- అదు- సచ్చిపోయిన అది బాబు సెవంలా ఉన్నాదండి- అది సేతులో- ఓ సింకి అట్టకి కాయితాలు తగిలించి ఉన్నాయండి. అదు కోరటు అమీనటండి.

"మొగిడి తద్దినం- రంకుమొగుడెట్టాలా అన్నట్టు- అంతా తిరకాసుగా- కనిపించి నాకేటీ అరదం అవలేదండి.

"సెవం కళ్ళతే కంపుకొట్టదా? మన కెందుకు తొందర? ఓపికపడితే- సంగతి -అదే అర్దంఔతాదని నాను యెవ్వర్నీ- యేటీ అడగలేదండి.

"ఆ యెనక- ఆళ్ళ మాటలుబట్టి- నా కరదం- అయిందేటంటే- మా బాబు - రావుడుగోడి మీద- కోర్టులో యెగ్రిమెంటు పెట్టి- దావాయేసి దొంగ "డిక్రీ" పొందీసినాడనీ- బూవిని సోదీనం జెయ్యడానికి- కోర్టు అమీనుగోడొచ్చినాడని- సపోర్టుకి- సిటీ రౌడీలొచ్చినారని- ఇదంతా నా కరదమైంది.

"హవ్వ లంజకొడుకులు- ఈళ్ళు తల్లికీ మొగుడు రకం గాదండి- రంకుమొగిడి రకవండి- ఈళ్ళని జూస్తే- మడుసులు కాదు- దెయ్యాలు కూడా జడుసుకు- మంచాలెక్కేస్తాయండి. ఈళ్ళ జాతికే నీతి లేదండి.

"ఒక పీడోడ్ని కొట్టడానికి ఊరి

బీదోళ్ళనందర్నీ- అగ్గిలో తోసేగలరండి- ఊళ్ళో బీదోళ్ళని- లొంగదీసుకోడానికి- ఊరికే- అగ్గిపెట్టేస్తారండి.

"ఇయ్యాళ్ళ రాచ్చసయజ్ఞానికి- రాముడుగోడు బలి అన్నమాటండి.

"నానిలా ఆలోచిస్తూ ఉంటే- ఊరేగింపుకు బయలెల్లినారండి- మా బాబులు.

"కుక్కల్ని పట్టుకుని నువ్వు రారా" అన్నాడండి. 'నువ్వా- మీ తమ్ముడూ ఉండగా- యేరే కుక్కలెందుకూ' అని మనసులో అనుకొని నానూ బయలెల్లినానండి. దెయ్యాల కుక్కల్ని పట్టుకొని.

"మావూ ఊళ్ళో యెట్టా ఉంటే- పిల్లల పెళ్ళి ఊరేగింపు- యెలకలు- కన్నాల్లోంచి చూసినట్టు- గుడిసెల్లోంచే- బిక్కు-బిక్కుమని జూస్తున్నారండి ప్రెజ.

"ఊరికి ఈ చివర మా బాబు బంగళా ఉంటే- రెండో చివర రాముడి గోడి బావండి.

"అది ఉట్టిబావి గాదండి బంగారప్పళ్ళెమండి- అదిగో అట్టి- బావైతే - అదిగో- అదేనండి సెరువు- సెర్లో ఓ సుక్కైనా నీళ్ళుంటే- అది ముందు రాముడిగోడి బావిలోకి రావాలిసిందేనండి. బావికి రెండో పక్కన రోడ్డండి- మూడో పక్క- ఊరండి. ఊరికెంత దగ్గిరంటే- బావిలోంచి తీసి ఒక్క అడుగు- వేస్తే రెండో అడుగు- ఊళ్ళోనే పడతాదండి,

బీదోడికి- బంగారప్పళ్ళెంలాటి బావున్నా- బంగారబొమ్మలాటి బార్య ఉన్నా దక్కవంటారండి.

"మా ఊరేగింపు- యెట్టా ఉంటే- రౌడీలు సారావోసన యేపేస్తున్నారండి- అమీనగోడు- నచ్చిన కంపూ- కల్లు కంపూ కలిపి కొట్టేస్తున్నాడండి. తాక్కపోయినా- తాగుడు నవ్వులు తగిలించేసుకున్నారండి- మా బాబులు, ఆళ్ళ పార్టీ వోళ్ళాను.

"ఊరేగింపులో- నాను చివరున్నానండి- కుక్కల్ని పట్టుకొని. కుక్కలు- యెంత గింజుకుంటున్నాయంటే- నా చేతులు పీక్కపోతాయేమోననిపించేసినాదండి.

మావూ రాముడిగోడి గుడిసెకాడికొచ్చేసరికి- ఆడు ఇంటి ముంగట- బాణాలమీద బీష్ముడు పడుకున్నట్టు కుక్కి నులకమంచం మీద పడుకున్నాడండి- మమ్మల్ని జూసి లేసివాడుగానండీ - యెంత జడిసిపోనాడంటే- గుడిసె లోకి పారిపోదామనుకున్నా- ఆడికి అడుగు పడలేదండి. యెవ్వరూ జూడకుండా ఆడి బావివేపు ఓ పాలి జూసి- ఆడికి దమ్ము కొట్టినాదండి-

* * *

"మావు బావి జేరినామండి- జేరగానే వప్పగింత- రసీదు రాసిమన్నారండి మా బాబులు-

"అలాగిల్లేదంటే- పద్ధతి ప్రెకారం-

బూఁవిఁకి ముమ్మారు పెదచ్చినం జెయ్యవాలసిందే" అని- యెంత కల్లు తాగిసినా- యెంత లంచం తినీసినా- మొండిపట్టు పట్టిడండి అమీనుగోడు.

"యెనకటికి- ఓ దొంగపెళ్ళికి- పురోహితుణ్ణి ముందట్రోజే- దక్షిణ ఇచ్చీసి- పెళ్ళి బేగి జరిపించవయ్యా బాబూ- అంటే దక్షిణడబ్బుల్తో మందు కొట్టీసొచ్చి 'వివాహం' విగ్నేస్వరుడి పూజకాడే మొదలెట్టాలని- పోలీసోళ్లొచ్చి- పెళ్ళాపీసీవారకా- మంత్రాలు జదివి నాడట.

"అలాగుంది ఈ అమీనుగోడి వారస- బూఁవిఁకి ప్రెదచ్చిన అక్కర్లేదన్నారు- మా బాబులు. కావాలన్నాడు అమీను గోడు- కావాలంటే తనతో కోర్టుకొస్తే సుప్రీంకోర్టు తీరుపు జూపిస్తానన్నాడు. అప్పుడు ఓ సెట్టుకింద సతికిలపడిపోయి- కల్లు కపాలాని కెక్కిపోయినట్లుంది- కళ్లు మూసీసినాడు. అరగంట కష్టపడి లేపి- ప్రెదచ్చినం- చేద్దాం దిమ్మంటే పెదచ్చినం జెయ్యడానికి- ఇది గుడా? అంయవాఁ? నాను రాను. మీకొక్కవా లంటే- మూడుసుట్లు గాదు- ముప్పై సుట్లు జెయ్యండన్నాడు.

"అతనికి- అన్ని ఏద్దర్లేసి- అసలు పని- అతికి అరదం అయ్యేటట్టు. జెప్పేసరికి- తల ప్రాణాలు- తోకల్లోంచి యెల్లిపోనాయి మా బాబులకి.

"పెళ్ళినాడు ప్రెదచ్చిణాలు జేయించి నట్టు ముమ్మారు- బూఁవిఁకి పెదచ్చి ణాలు జేయించినాడు అమీనుగోడు.

"ఆ యెనక గట్టుమీద సతికిలపడి పోవారంతా- అమీనుగోడు సెప్తావుంటే రాఁవఁనాదంబాబు- అదేదో- రశీదట- రాస్తున్నాడండి. మావంతా అల్లయేపే జూస్తున్నావండి.

"ఇంతలో యేమైందోగాని- సెట్టుకు కట్టిన కుక్కలు యెర్రి అరుపులు అరడం మొదలెట్టినాయండి.

"యేటా? అని మాఁవుఁ తిరిగి సూద్దువాఁ! మిదతలదండు లాగ- వొచ్చీసినారు టీదోళ్ళంతా- అడామొగా సిన్నా పెద్దా అంతా కర్రలూ- కత్తులూ- బండలూ రోకళ్ళూ పట్టుకొని మరీ వొచ్చినారండి.

"యెదవ నంజికొడుకుల్లారా! నా బూఁవిఁలో కాలెందుకెట్టినార్రా?" అని పూనకం పూనినోళ్ళా యెర్రి అరుపు అరిసీనాడండి రాఁవుఁడుగోడు. ఆ యెనక ఆడు తిట్టిన బూతులు- పోలీసోళ్ళతో తిరిగినోడ్ని- సెప్పడానికి నాకే సిగ్గేస్తాదండి.

"నీ బూఁవిఁ- బాబుకి వొప్పగించ డానికి" అన్నాడండి అమీనుగోడు- యే మాటా అనడానికి మా బాబులకి నోళ్లు ఆడనేలేదండి- ప్రెజని జూసేక.

"నీ పెళ్ళాన్ని అప్పగించకూడదట్రా- అది సస్తే నీ కూతుర్ని అప్పగించ కూడదా? నా బూఁవేఁ దొరికిందిరా నీ

కప్పగించటానికి!"అన్నాడండిరాంవుఁడు.

"నీ మీద ఎగస్పార్టీ డిక్రీ అయి పోనాది" అన్నాడండి అమీను.

"నీ యమ్మ రంకుమొగుడిమీద అయిందిరా- ఇప్పుడు నీ కొద్దిరి" అని రాంవుఁడు ఒక్కొగురు- యెగిరి అమీను గోడి నెత్తిమీద కర్రతో ఒక్క- దెబ్బేసి నాడండి రాంవుఁడు.

"దెబ్బకు తల పట్టుకున్నాడండి అమీను. తరవాత చేతులు జూసుకున్నాడండి. ఆ యెనక- అటిమీద రకతం జూసుకున్నాడండి. మరంతేనండి ఆ తర్వాత- అమీనుగాని- అది సేతులు గాని- అటి రకతంగాని యెవరూ సూళ్లేదు ఎటు పారిపోనాదో- అమీను గోడు కారాజువ్వలా మాయఁవైపోనాదు.

ఈ లోపల అప్పటివరకూ సీతారాంవుఁల్లా బతుకుతున్న ముక్కలు కట్లు తెంపీసుకొని- ఒకదాన్నొకటి కరిసీసు కోడం ఆరంబించినాయి.

"రెండు పార్టీలోళ్లూ పేకముక్కలు కలిపీసినట్టు కలిసిపోయి కొట్టీసుకుంటున్నారండి.

"బుర్రలు పగిలిపోతున్నాయండి- యెంవుఁకలు ఇరిగిపోతున్నాయండి.

"అప్పటివరకూ- మందిలో యెక్కడుండి మా యాండి- నాను సూడనేలేదు సేత్తో రోకలెత్తుకొని- గుళ్లోంచి అమ్మోరొచ్చీసినట్టు వొచ్చీసి 'కాసుకోరా కోకల రంగనాదం!' అని అరిసి- అది నెత్తిని రోకలితో ఓ పెట్టు పెట్టినాదండి- ఆడు మూడుసుట్లు గిరగిర తిరిగి కళ్లు తేలేసి పడిపోనాడండి. ఇంతట్లో సిటీ రౌడీగోడు మా యాడదాని గుండెల్లో బాకు సుచ్చీసినాడండి. అది తుళ్ళి నా కాళ్ళకాడ పడి- రకతం సేతుల్తో నా పాదాలకి దణ్ణపెట్టి- పేనం వొగ్గీసినాదండి- దాని సేతులు నా పాదాలకు తగలగానే నాకు యేదో అయిపోనాదండి.

"సచ్చిన మా ఆడిదాని యేపు జూత్తే- దేంవుఁడే సచ్చిపోనాదనిపించినాదండి.

"ఇంకా జూత్తున్నావేట్రా యెయ్యకా!" అన్నాడండి మా బాబు.

"యేస్తున్నా- యేస్తున్నా" అని మా బాబు నెత్తిమీదే కర్రతో ఒకటిచ్చీసినండి. కంసుళ్ళా కూలిపోనాడండి మా బాబు. ఆ బాబు మన్ను కరిసీలోపల మరోటి యేసేనండి.

నాను పార్టీ బదలాయించావని తెలిక- మాయలపకీరుగోడు నా నెత్తి మీదొక్క- టేసేడండి. తరవాత చాలా దెబ్బలు తిన్నానండి. తెలివొచ్చేసరికి- ఇదిగోనండి- ఈ అస్పత్రిర్లో ఉన్నానండి.

"నాకు తెలివొచ్చేక తెలిసిన ఇసయం యేటంటే- మాంవుఁ కూపీరై పోతూ వుంటే పక్కూరు అమ్మోరు పండుక్కి- బందోబస్తు యెళ్తున్న పోలీసులు లారీ లాపి- గాల్లో తుపాకులు పేల్చి, దెబ్బలాట ఆపి ఆ తరవాత సచ్చినోళ్ళనీ- సస్తున్నోళ్ళనీ అస్పత్రికి జేర్చినారట-

మరో ఇషయం యేటంటే- మా బాబు రాంపుండిగోడమీద ఫోర్జరీ యెగ్రిమెంటు మీద దావా యేసి కోరటు జవాన్ని గుమాస్తాలని కొనీసి 'యెగస్పార్టీ డిక్రీ' పొందీసినారట. వీదోళ్ళ పేత కుట్ర జేయించినారని జెప్పి సిట్టిబాబుని జెయిల్లో తోసీసినారట.

• • •

"రా- అమ్మా- రా! బిళ్ళలు తెచ్చినా వేటి- నాకు ఆస్పత్రిల్లో తెలివి రాగానే మొదట జూసింద ఈ నర్సునేనండి.

"నాను సావను తల్లీ! సావను. నీ కెందుకి గాబరా.

"ఏటియి? బిళ్ళలా? బిస్కెత్తులా? ఇంతున్నాయి. పోనీ బిస్కెత్తులనుకొని కొరుక్కు తిందామంటే కాకరకాయల్తో సేసేరేటో నేదు- ఇషం- ఇన్ని నీళ్ళన్నా ఇయ్యమ్మా ఇంచ మింగాలంటే. గ్లాసుడు సాలవ్! కూజాడు గావాలో- అదేం కరమవో- గవర్నమెంటాస్పత్రిల్లో మంచినీళ్లు గూడా పిండిచ్చినట్టు కొన్ని గ్లాసుల్లో ఇస్తారు.

"తల్లీ! నువ్విచ్చిన గ్లాసుకి డబల్ పైజుగ్లాసుడు దించకుండా తాగిసేవోడిని- నీళ్లనుకు నేవ్! రమ్మ."

"నాను సావను తల్లీ- సస్తే యేడిసే వోళ్లూ లేరు సస్తే మాత్తరం సచ్చే లోపల ఒక మంచిపని జేసేనన్న- సంతుష్టితో సస్తాను తల్లీ.

"ఇంతకీ- మా బాబెలాగున్నాడు తల్లీ-ఇంకాసావనేదా? అలాటోడు సచ్చినా స్పెషల్ వోర్డులో స్పెషల్ సావు సస్తాడు.

• • •

"తల్లీ నా కత ఇనడానికి మొదట మీ పత్రికలోళ్లు పదిమంది రొచ్చినారు. ఒకరూ ఒకరూ జారుకోగా సివరికి నువ్వొక్కత్తివే మిగిలినావె.

"నా కతకూడా 'కతం' అయిపోనాది.

"మా బాబు వచ్చేదా నాకు ఉరెయ్యొచ్చు. సావకపోతే 'లైఫు' (LIFE) ఎయ్యొచ్చు.

"యేదేపినా పరవానేదు. అదురుష్టం బాగుండి ఒగ్గీసేరా సిట్టిబాబుకాడికి జేరి- ఆ బాబు పారిటీకి బతుకు బలిఇచ్చేస్తాను. మళ్ళీ ఇలాటి యెవ్వారం ఏదైనా జరిగితే ఆస్పత్రికో జైలుకో నా నెక్కడుంటే అక్కడికి రా తల్లీ!

"ఇప్పటికే సాలా రాసుకున్నావు. ఇక వాత్తల్లీ- పువ్వులూపాలూతో పదికాలాలు హాయిగా బతుకు." (ఐపోయింది)

---

**చివరిమాట**

"గాంధీజం" బహు దొడ్డ సిద్ధాంతం కాని దేశమంతా గాంధీలు ఉంటేనే- అది ఆచరణకు సాధ్యమవుతుంది.

పుట్టింది ఒకే గాంధీ.

అతడినైనా బతకనివ్వలేదు దేశం.

"గాంధీజం" గొప్పదా? కాదా? అన్నది కాదు సమస్య. దానికి మనం తగుతామా అన్నదే ప్రశ్న.

మనం దానికి తగకపోతే- మరో సిద్ధాంతం ప్రజ వెదుక్కోవాలి.

— వీణాదేవి.

# నాకు నచ్చిన నా కథ



మన్నెం శారద

ఇది ఆంధ్రప్రభ వారపత్రికలో 1970లో ప్రచురితమైంది. అంటే దాదాపు పన్నెండేళ్ళ క్రితం. అచ్చులో ఇది నా నాల్గవ కథ. చాలా చిన్న వయస్సు నుండి వ్రాసే అలవాటుండేది నాకు. అయితే వాటిని ప్రచురణకి ఎలా పంపాలో తెలిసేది కాదు. మనసు స్పందించినపుడు ఆ భావాల్ని కాగితంమీద పెట్టుకోవడం నాకు ఎనిమిది సంవత్సరాల వయసు నుండి అలవాటు

దరిదాపు పదిహేనేళ్ళనుండి వ్రాస్తున్నా నా రచనల సంఖ్యాబలం తక్కువే. రాసి కన్నా వాసి ముఖ్యమని నమ్ముతాను నేను. వ్యాసాలు, గేయాలు, కథలు ఎక్కువగా వ్రాసేను. నవలలు తక్కువ. విషయాన్ని సాగదీసి పేజీలు నింపడం నాకు ఇష్టం వుండదు. నా కథలు, నాటికలు ఆకాశవాణిలో కూడ ప్రసారం అయ్యేయి. అన్నీ యాభయి కథలు వ్రాసి వుంటానేమో.

నేను వ్రాసిన ప్రతి కథ నేను మనస్ఫూర్తిగా యిష్టపడినవే అయినప్పటికీ యీ కథ 'దూరపుకొండలు' పై నాకు ప్రత్యేక అభిమానం వుంది. సాధారణంగా మనం చిన్నతనంలో వ్రాసిన రచనలు యిప్పుడు చదువుతుంటే 'ఇలా

వ్రాసేనేమిటి' అని నవ్వొస్తుంది. కారణం వయసొచ్చే కొలదీ మనం మానసికంగా పరిణితి చెందడంవల్ల.

కాని యీ కథ మాత్రం ఆ వయస్సులోనే నేను చాలా గొప్పగా మనుష్యుల మనస్తత్వాలు చిత్రించగల్గేనని తృప్తి కల్గుతుంది. పైగా యీ కథకు చాల అభినందన పరంపర వచ్చింది. అదొక్కటే నాకు నచ్చడానికి కారణం కాదు. ఈ కథ వ్రాసేక యిప్పటివరకు నిజజీవితంలో శైలజ శంకర్రావు ల్లాంటి వ్యక్తుల్ని చూడటం సంభవిస్తూనే వుంది. అందుకే నిజజీవితాలకి దగ్గరగా వుండే యీ కథ నాకు బాగా యిష్టం.

# 'దూరపు కొండలు'

చలిగాలి జివ్వున వీస్తోంది. విజయవాడ వదిలిన రైలు, వేగం పెంచుకొని ముందుకి పరుగుతీస్తోంది. సూర్యుడు ఎర్రబడిన ముఖం చాటు చేసుకుంటున్నాడు. ఎర్రని కాంతిలో మెరుస్తున్న ఆకాశం, కొండలు, చెట్లు అతి వేగంగా వెనక్కి పరిగెడుతున్నట్లూ తానే నిశ్చలంగా కూర్చున్నట్లు ఫీలయింది శైలజ. కిటికీ గాజుతలుపు మూసి షాల్ కప్పుకుంది.

అలా శూన్యంలోకి చూస్తుంటే ఎన్నెన్నో తలపులు!

తానే నిశ్చలంగా వున్నట్లు సుదూరంగా కన్పించే చెట్లు, కొండలే ముందుకి పరిగెడుతున్నట్లు అనిపించగానే విరక్తిగా నవ్వుకుంది. చిన్ననాటి నుండి మనిషి భ్రమకి లొంగిపోతూనే వున్నాడు.

ఈ భ్రమ మనిషిని తనచుట్టూ బొంగరంలా త్రిప్పి ఆడిస్తుంది.

లేకుంటే— సత్యమూర్తిలో తను చూసిన ఆకర్షణ, అనురాగం ఒట్టి ఎండమావి కావాలా? అది తెలిసేసరికి తాను చాలా దూరం ప్రయాణించేసింది. ఇప్పుడు వెనక్కి తిరిగితే తనని ఎవరు హర్షిస్తారు? ఒకవేళ హర్షించినా తాసీ పెల్లి పూడ్చుకోగలదా!

'సత్యమూర్తి— ఎలా మారిపోయేడు!' శైలజ చేతి రుమాలుతో కళ్ళు తుడుచుకుంది.

క్రమంగా ప్రపంచం అంతా నల్లరంగు స్థిరపరుచుకుంది.

రైలు అలసట లేకుండా ప్రయాణం సాగిస్తోంది.

శైలజ ఆలోచనలు కూడా వేగం అందుకొన్నాయి.

ఇప్పుడు సత్యమూర్తి తన గురించి ఆలోచిస్తాడా?

లేదు! ఎదుట వ్యక్తినే గుర్తించలేనివాడికి ఎక్కడో విషయాలూహించ గల శక్తి ఎక్కడిది?

ప్చ్! తాను మోసపోయింది. సర్వంగా అతన్నే భావించి తనవారందర్నీ దూరం చేసుకుని పెళ్ళిచేసుకుంది. ఫలితం— జీవితంలో భర్తీచేయలేని శూన్యం! గుండెలో భరించలేని బరువు!

'ఎందుకిలా నా జీవితం నిరాధారం చేసేవు భగవాన్,' శైలజ తల పట్టుకొంది. జలజలా కారే కన్నీరు ఆపాలనే ఊహ ఆమెకు తట్టనేలేదు.

"ఏమండీ, మీరేదో బాధపడ్తున్నట్లున్నారు?"

శైలజ విస్ఫహగా అతనివంక చూసింది.

అతను ఆతృతగా ముందుకి వంగి శైలజవైపు చూసేడు.

"అవును. కొద్దిగా గుండెనొప్పి" అబద్ధమాడింది శైలజ.

"తరచు వస్తుంటుందా?" డాక్టరులా ప్రశ్నించేడు.

తల వూపింది.

"డోంట్ వర్రీ" అతను బేగ్ తెరచి చిన్న మాత్ర అందించేడు శైలజకు.

శైలజ తీసికోకుండా అతనివైపు చూసింది.

"ఫర్వాలేదు. వేసుకోండి. నాకూ వున్నది ఈ బాధ! అందుకే జాగ్రత్త పడుతుంటాను. అయినా మనిషన్నవాడికి, అందులోనూ మనసున్నవాడికి బాధ తప్పదు" అన్నాడు నవ్వుతూ.

శైలజ విచిత్రంగా చూసిందతని వైపు. అత నిదేం పట్టించుకోకుండా శైలజకు వాటర్ బాటిల్‌లో నీళ్ళు వంపి యిచ్చేడు.

శైలజకి టేబ్‌లెట్ మింగక తప్పలేదు.

"గుడ్! అలా వుండాలి!" అన్నాడతను నవ్వుతూ.

"మీ పేరు" అడిగింది శైలజ.

"శంకర్రావంటారు. ఇక వృత్తంటారా? ఇంజనీరింగ్ చదివేను. కానీ పరిస్థితుల రీత్యా ఒక ఇంజనీరింగ్ ఫర్మ్‌లో రిప్రజెంటేటివ్‌గా చేస్తున్నాను. బొత్తిగా ఆఫీసులో కట్టిపడేస్తే కూర్చునే రకం కాదు. క్రొత్తదనం కావాలి. నిత్య నూతనంగా జీవించాలని ఆశ! ప్రతిక్షణంలోను ఓ క్రొత్త అనుభూతి కోరుకుంటాను. భవబంధాలు లేనివాణ్ణి! ఇవేళ చస్తే ఎవరు నీడనే వారు లేరు." అతను తమాషాగా కళ్ళు త్రిప్పుతూ అన్నాడు.

శైలజ సరదాగా విన్నా చివరిమాట ఆమెలో జాలి కల్గించింది.

"మీరు బాధాకరమైన విషయాలు కూడా తమాషాగా చెబుతారు." అంది.

"మీ కాంప్లిమెంటుకు థాంక్స్" కాని ప్రతి విషయానికీ బాధపడితే సంతోషం రెక్కలొచ్చి ఎగిరిపోతుంది. సుఖాన్ని రెండుచేతులూ చాచి అందుకుంటాం కదా, కాని కష్టాల్ని టాలరేట్ చేయకుంటే ఎలా?"

"మీరెంతో అనుభవం వున్నట్లు మాట్లాడుతున్నారు"

శంకర్ తేలిగ్గా నవ్వేసేడు. "గాలికి పెరిగినవాడండీ మీకు అడుగడుగునా అనుభవాలే. ఇంతకూ అయిదు నిముషాల్లో స్వీయ చరిత్రంతా చెప్పించేసేరు. మీ పేరు చెప్పనేలేదు."

"శైలజ"

"వెరీ నైస్."

"ఇంతకూ మీరు ఎక్కడికి వెళ్తున్నట్లు?"

"హైద్రాబాద్."

"ఓ! మనిద్దరిదీ ఒక్కటే గమ్యం! ఇంతకూ మీ హజ్బెండ్ అక్కడ వర్కుచేస్తున్నారా?"

"లేదు మా స్నేహితురాలింటికి వెళ్తున్నాను."

"వెరీగుడ్! స్నేహానికి ఆ మాత్రం విలువయిచ్చే వాళ్ళున్నారంటే— ఐయామ్ రియల్లీ హేపీ!"

అతని మాటలకు శైలజ నవ్వింది.

"నిజం!" శంకర్ తమాషాగా కళ్ళు చిట్లించి అన్నాడు.

"చూడండి! చాలామంది మేరేజ్‌తో స్నేహానికి పుల్‌స్టాప్ పెట్టేస్తారు. అప్పటివరకు ప్రాణప్రదంగా ప్రేమించి కలిసిమెలిసి తిరిగిన స్నేహితుల్నికూడా మరచిపోయి భర్తల చుట్టూ ప్రదక్షిణం చేస్తారు. సంవత్సరం తిరిగిందో లేదో యిలాంటి కపుల్స్ లైఫ్ మొత్తం బోరంటూ ఎడమొగం, పెడమొగంగా తయారయి జీవితంలో ప్రతి చిన్న లోపం భూతద్దంలో చూసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకునీ వాపోతారు. దేని విలువ దానికిస్తే ఇలాంటి బాధలు రావని గ్రహించరు."

శంకర్ ప్రవచిస్తున్న నిజాలు విని శైలజ గుండె దడదడలాడింది.

'ఇతను తన గుట్టు కనిపెట్టేయలేదు కదా!' అనుకుంది.

"ఏమిటి వీడిలా బోర్ కొట్టిస్తున్నాడనుకుంటున్నారా?"

"లేదు లేదు. మీ కంపెనీ ఎంతో రిలీఫ్‌గా వుంది."

"మీ రకక్కడ ఎవ్వాళ్ళుంటారు?"

"చెప్పలేను. బహుశా ఏదయినా వుద్యోగం చేయాలని వుంది."

"వ్వాట్? మీ కలాంటి అవసరం లేదు కదా?" ఆతను ముందుకు వంగి ఆసక్తిగా అడిగేడు

శైలజ తెచ్చుకోలు నవ్వుతో "అవసర మనేది ఆయా వ్యక్తుల వ్యక్తిగత అభిప్రాయాలపై ఆధారపడి వుంటుంది." అంది.

"రియల్లీ! మిమ్మల్ని అభినందించకుండా వుండలేక పోతున్నాను. మీరు పరోలా భావించకుండా వుంటే ఎప్పుడయినా ఎలాంటి సహాయం కావాలన్నా అందిస్తాడీ శంకర్" జేబులోనుండి విజిటింగ్ కార్డు తీసి అందించేడు.

"థాంక్స్" శైలజ అందుకుని పర్సులో భద్రపరిచింది.

తెలతెలవారుతుండగా రైలు హైదరాబాదు చేరి అసహనంగా ఆగిపోయింది మంచుతెరల్లో ముసుగు కప్పుకొని ముడుచుకున్న ముస్లిం సుందరిలా వుంది భాగ్యనగరం.

శైలజ క్రిందకి దిగింది. లగేజ్ క్రిందకు దింపి, "మీ గురించి ఎవరూ వచ్చినట్లు లేదే?" అన్నాడు శంకర్ చుట్టూ చూస్తూ.

"అవును. నేను తెలియబరచలేదు."

"మరి మీరు ఒంటరిగా వెళ్ళగలరా?"

"నాకు హైద్రాబాదేం కొత్తకాదు" అంది శైలజ నవ్వుతూ.

"అయితే వర్వాలేదు" సామాను డిక్కీలో పెట్టించి టాక్సీడోరు తెరిచేడు.

శైలజ టాక్సీలో కూర్చుని ముందుకి వంగి చేయి చూపి "మీ మూలంగా నా జర్నీ హాయిగా సాగింది! మీ హెల్ప్ నేను మరువలేను. థాంక్యూ!" అంది.

"బై ది బై వన్ను కూడ మరచిపోకూడదు!" అన్నాడు నవ్వుతూ.

టాక్సీ కదిలిపోయింది.

•   •   •   •

శైలజ అకస్మాత్తుగా వూడిపడటం ఆశ్చర్యం కల్గించినా మనస్ఫూర్తిగా సంతోషించింది మాలతి. మాలతి భర్త మాధవరావు కూడ ఆమెను ఎంతో సంతోషంగా ఆహ్వానించేడు.

"నువ్వెప్పుడూ ఉరుము లేని పిడుగువే!" అంది మాలతి నవ్వుతూ.

"మీరు మమ్మల్ని గుర్తుపెట్టుకుని రావడం మా కెంతో సంతోషంగా వుంది" అన్నాడు మాధవరావు.

శైలజ తేలిగ్గా శ్వాశ పీల్చింది. ఎలాంటి అవాంతరం లేకుండా తాను హైద్రాబాదు చేరుకోగల్గింది. మాలతిలో మునుపటి స్నేహం, ప్రేమ అలానే వున్నాయి.

వారం రోజులు ఏ విషయమూ చెప్పకుండా కాలం గడిపేసింది. ఆ రోజు సూట్‌కేసులో సర్దిపెట్టు తీస్తుంటే పక్కనే వచ్చి కూర్చుంది మాలతి.

"ఇంకా యివి భద్రంగా దాచావన్నమాట. నా దగ్గి సర్దిపెట్టు ఏమూల వుందో కూడ గుర్తులేదు" అంది నవ్వుతూ.

"జాగ్రత్త లేకుంటే ఎలా? ఎప్పటి కెయ్యది అవసరంబో!" అన్నది శైలజ నవ్వుతూ.

"ఏమిటా అవసరం?"

"ఉద్యోగాన్వేషణకు" శైలజ నవ్వాలని ప్రయత్నించినా ఆమె ముఖం ముకుళించుకుపోయింది.

"ఏం, సత్యమూర్తి జీతం చాలటంలేదా?" మాలతి శైలజ ముఖంలోకి గుచ్చి చూసింది.

శైలజ కిటికీలోనుంచి బయటకు చూస్తూ "కాదు. సత్యమూర్తితో నాకు సరిపడటం లేదు."

"అదేం?" మాలతి ఆశ్చర్యపడింది.

"అదేం అంటే నేను చెప్పలేను. నేను చెప్పేది వినడానికి చాల తేలిగ్గా అర్థరహితంగా అన్పించవచ్చు. కాని నేను సంవత్సరంలో ఏ ఒక్క క్షణం సంతృప్తిని అనుభవించలేదు. నేనా విరి్తప్తత భరించలేను."

మాలతి ఆవేశంగా శైలజ భుజాలు పట్టుకొని కదిపింది. "పిచ్చిగా మాట్లాడకు. వివరంగా చెప్పు. ఇష్టమొచ్చినట్లు నిర్ణయాలు చేసుకోవడానికి యివి జీవితాలు" అంది.

"అందుకేగా యింత బాధ! విందు జీవితమంతా శూన్యంగా గతకాలంటే మనసొప్పక, హాయిగ గడపాల్సిన కాలమంతా కన్నీరు వింపుకోవడం యిష్టం లేక యిలా వచ్చేను."

"ఇంతకూ ఏం జరిగిందో చెప్పు" అంది మాలతి విసుగ్గా.

శైలజ తలవంచుకొంది. "అతను మునుపటి మనిషి కాదు. పూర్తిగా మారిపోయేడు. అలా అని ఏవో దురభ్యాసాలు నేర్చుకున్నాడని కాదు. నేను



అతని కోసమే వున్నానని, అతని కోసమే అన్నీ వదులుకొని వచ్చేసేనని గుర్తించినట్లు కనిపించదు. ఎంతో యాంత్రికంగా కనిపిస్తాడు. ఉద్యోగం కోసం జీవిస్తున్నాడనిపిస్తుంది కాని జీవితం కోసం వుద్యోగం చేస్తున్నట్లు కనిపించదు. ఇంతెందుకు, మా పెండ్లికి ముందున్న వుత్సాహం అతనిలో లేదు. నాకున్నది అతడేనని—అతని ఒక్కమాట నా కెంతో శక్తినిస్తుందని గ్రహించదు. అతను కొట్టినా తిట్టినా నేనింత బాధపడేదాన్ని కాదు."

శైలజ చెప్పినదంతా విని మాలతి ఫకాలున నవ్వింది.

"ఇంత పిచ్చి వూహలు నీకు కూడ వస్తున్నాయన్నమాట. సత్యమూర్తితో నీ కున్నంత పరిచయం నాకు లేకపోయినా సమగ్రంగా అతని గుణగణాలు నాకు తెలుసు. అత నెప్పుడు ఉత్సాహంగా ఉండలేడు గనుక! అప్పట్లో ఓ మూల కూర్చుని గంభీరంగా వుండే అతనంటేనే నాకు యిష్టం అన్నావు. అల్లరిగా వుండే వాళ్ళంతా కోతిమూకన్నావు. సత్యమూర్తి మంచివాడు. ఈ పాటికి నీ వెక్కడికి వెళ్ళేవో అని కంగారు పడ్తుంటాడు. చెప్పకుండా వచ్చేవని తెలియదు. లేకుంటే కొంపలో అడుగుపెట్టనిచ్చేదాన్ని కాదు."

శైలజ ఉక్రోశంగా ముక్కుపుటా లెగరేసింది. "చెప్పడం చాలా తేలిక రక్తిలేని జీవితం ఒక్కక్షణం గడపలేను నేను."

మాలతి అనునయంగా అంది. "పోనీ అతన్ని కాదని యిక్కడ నీ జీవితంలో నువ్వు పోగొట్టుకున్నది సంపాదించగలవా?"

"ప్రయత్నిస్తాను" అంది శైలజ బింకంగా.

"ఈ ప్రయత్నాలు, యీ ఆవేశాలలో మీకు తెలియకుండానే మీ మనసులు ఎంత విరిగిపోయేది ఆలోచించేవా?"

శైలజ మాట్లాడలేదు.

"ఉద్యోగం చేసి నువ్వు ఆర్థికంగా స్వతంత్రురాలివి కావొచ్చు. మానసికంగా నువ్వు చాలా కృంగిపోతావు. ఉద్యోగాలు నువ్వనుకున్నంత తేలిగ్గా దొరికేవి- నువ్వూహించినంత సుఖప్రదమైనవీ కావు. పరిస్థితుల రీత్యా తప్పితే ఉద్యోగాలు సున్నితమయిన యే ఆడది చేయడానికి మనసారా అంగీకరించదు."

శైలజ మాలతివైపు ఆశ్చర్యార్థకంగా చూసింది.

"ఉద్యోగం చేయడం తప్పయితే మరిప్పుడు చేసేవాళ్ళ సంగతి."

మాలతి నవ్వింది. "అక్కడే నీవు పొరబడుతున్నావు. చేయడం ఎప్పటికీ తప్పు కాదు కాని మనం అనుకున్నంతగా మన సమాజం ఎదగలేదు వేషభాషల్లో నాగరికత పెంపొందించుకున్నామే గాని సంస్కారంలో మనం ఒక్కడుగు ముందుకెయ్యలేదు. పొరిగింటి ఆడపిల్లను హేళనగా మాట్లాడే ప్రతి మగవాడు తన ఆడవాళ్ళని యితర్లు గౌరవించాలని ఆరాటపడ్తాడు. అక్కడే మన సమాజపు సంస్కారపు వేరు కుళ్ళిపోయింది గత్యంతరం లేక గడపదాటొచ్చిన ఆడపిల్లలెంతమంది యీ కుసంస్కారుల చేతుల్లో పడి బాధపడ్తున్నది వెళ్ళి అడిగితే నీకే తెలుస్తుంది."

శైలజ మొండిగా అంది. "ఏమో, నేను మాత్రం తిరిగి వెళ్ళలేను. 'నే వెళ్ళిపోతాను' అంటే నాకెవ్వరూ లేరని తెలిసికూడ నీ యిష్టం అన్న వ్యక్తి దగ్గరికి నేను వెళ్ళలేను."

మాలతి కోపం దిగమ్రింగడానికి ప్రయత్నించింది. "నీకు విచక్షణజ్ఞానం కూడ పోయింది. ఎందరాడవాళ్ళు నువ్వాశించిన తృప్తి లభించక వీధిన పడ్డారో చెప్పు అందువల్ల వాళ్ళంతా లోపరహిత జీవితాలు గడుపుతున్నట్లేనా? ఒక బంధానికి ముడిపడి కాలం గడుపుతున్నారు. నువ్వే అసలు సత్యమూర్తిని తప్పుగా అర్థంచేసుకున్నావని ఎందుకనుకోకూడదూ! నీ వ్యక్తిత్వాన్ని గుర్తించినవాడు కాబట్టే నే వెళ్ళిపోతానంటే నీ యిష్టం అన్నాడు."

శైలజ విసుగ్గా "దయచేసి సత్యమూర్తిని పొగడటం తగ్గించి యీ

సర్టిఫికెట్లు మాధవరావు కిచ్చి వాకేదైనా వుద్యోగం చూసిపెట్టమను." అంది.

మాలతి ఓడిపోయినట్లు చూసింది. మాట్లాడకుండా కాఫీతెచ్చి శైలజ కిచ్చింది. ఇద్దరూ కాఫీ త్రాగినతరువాత మాలతి మెల్లిగా అంది. "క్షమించు శైలజా! నువ్వు కోరబడి వస్తే నేను గుడ్డిగా ఉద్యోగం చూసిపెట్టి మీ యిద్దరి మధ్యా దూరం పెంచలేను. నువ్వు తిరిగి వెళ్ళడం మంచిదని మరోసారి చెబుతున్నాను. ఈ విషయంలో నువ్వు నన్నెలా భావించినా నేను చేసేదేమీ లేదు."

శైలజ చాలాసేపు మాట్లాడలేదు. అలా శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. ఈ లోపున మాధవరావు ఆఫీసునుండి హడావుడిగా వచ్చి కేంప్ కెళ్ళాలంటూ మాలతిని తొందరపెట్టేడు. సూట్ కేసు, హోల్డాలు సర్ది మాలతి ప్యూన్ చేత జీప్‌లో పెట్టించింది.

మాధవరావు శైలజ దగ్గర కొచ్చేడు. "నేను కేంప్‌కు వెళ్తున్నానండీ. బహుశా నేను రావడానికి అయిదారు రోజులు పట్టొచ్చు. ఈ లోపున మీరెళ్ళి పోతారేమో! మూర్తిని అడిగినట్లు చెప్పండి."

అతను వెళ్ళిపోతుంటే నిలబడి చూస్తుండిపోయింది శైలజ.

• • • •

మర్నాడు ఉదయమే శైలజ ప్రయాణానికి సిద్ధమైంది.

"ఏమైనా తొందరపడి మాట్లాడివుంటే మరేమీ అనుకోవుగా! మూర్తిని అడిగేనని చెప్పు." అంది మాలతి టాక్సీదగ్గర నిలబడి.

శైలజ నిరర్థకంగా నవ్వింది. "నీ ఆతిథ్యానికి థాంక్సు. మళ్ళ బ్రతికి బాగుంటే కలుస్తాను" అంది.

గుమ్మంలో టాక్సీ దిగుతున్న శైలజని చూసి శంకర్రావు ఆశ్చర్య పడ్డాడు. "మార్వలెస్! మీరు నిజంగా వస్తారనుకోలేదు." అన్నాడు.

"ఏం, నిజంగా రాకూడదనుకున్నారా?"

"ఎంత మాట! లగేజీతో సహా వచ్చేరు కాబట్టి మా ఆతిథ్యాన్ని మీరు స్వీకరిస్తారన్నమాటేగా!"

శైలజ ఇల్లంతా కలయజూస్తూ నిలబడిపోయింది.

"కూర్చోండి. నిలబడిపోయేరు."

"మీరు కేంప్‌లో వుంటారని భయపడ్డాను." అంది శైలజ కూర్చుంటూ

"నిజమే. వారంలో ఒక్కరోజూ కూడా నేను యింట్లో వుండను. నా

అదృష్టంకొద్దీ నేను సెలవులో వున్నాను." అన్నాడతను తల ఒక పక్కకి ఒరిగించి నవ్వుతూ.

"ఆ అదృష్టం నాది."

"ఇద్దరిదీ అయితే మరీ మంచిది" అన్నాడతను ఫ్లాస్కులో పాలు వంచి నెస్‌కేఫ్ కలిపి బిస్కట్లు ప్లేట్లలో సర్దుతూ.

ఆ రోజు ట్రెయిన్‌లో తన బాధలోనూ, చీకటిలోనూ సరిగా చూడ లేదు కాని.... 'అందమైనవాడే' అనుకుంది శైలజ.

ఆరోగ్యమైన శరీరంపై అందమైన దిట్టల పొందిక మరీ విందుదవాన్ని యిచ్చిందనుకొంది.

వరసగా ఇంగ్లీషు, తెలుగులో మాగజైన్సు తెచ్చి ముందు పెట్టేడు శంకర్.

"ఇవి చూస్తుండండి. నేను వన్ మినిట్‌లో వస్తాను" అతను హడావుడిగా స్కూటర్ మీద వెళ్ళిపోతుంటే శైలజ లేచి నిలబడి వళ్ళు విరుచుకొని గదులు పరిశీలించడం మొదలుపెట్టింది. అందమైన రెండు గదుల్లో ఒకటి డ్రాయింగ్ రూమ్, మరొకటి బెడ్‌రూమ్. అందంగా అమర్చిన నిర్మల్ పెయింటింగ్సు, టేబుల్‌పై కొండపల్లి బొమ్మలు- అతనికి కళపట్ల వున్న మక్కువ తెలుపుతున్నాయి. బెడ్‌రూమ్‌ను ఆనుకొని వున్న బాత్‌రూమ్ చూడగానే కావలసి పోయినట్లు ఫీలయింది.

తలస్నానం చేసి పొడవయిన కురులు ఆరబెట్టుకుంటే టకటక బూటు చప్పుడు చేసుకుంటూ శంకర్, ఆతని వెనక కారియర్ తీసుకుని పనిక్కుర్రాడు వచ్చేరు.

'అరె మీరా? శైలజ వెళ్ళిపోయి శకుంతల కాని వచ్చిందేమిటి చెప్మా అనుకున్నాను" అన్నాడతను శైలజను పట్టిచూస్తూ. శైలజ సిగ్గుపడింది.

భోజనాలనంతరం "బ్రహ్మచారిగాణ్ణి, అతిధ్యంలో లోపాలుంటే మన్నించాలి" అన్నాడు ఎదురుగా కూర్చుంటూ.

"మిమ్మల్ని యిబ్బంది పెట్టడానికి కాదు నేను వచ్చింది."

"మరి ?"

"మీరు ట్రెయిన్‌లో చెప్పినట్లు మీ నుండి సహాయం పొందడానికి వచ్చేను. నాకు వుద్యోగం చేయాలని వుంది. మీ రేదైనా రికమండ్ చేస్తారని...."

"ష్యూర్ ! ఏం వుద్యోగం చేయగలరు మీరు!"

"బి.ఏ పాసయ్యేను శైపు వచ్చ"

"చూద్దాం" సర్టిఫికెట్ను అందుకున్నాడు శంకర్.

"మీకు లోర్కొట్టించడం నా కిష్టం లేదు. అందుకే టివోలిలో 'పేంట్ పెబుల్స్'కి టికెట్లు రిజర్వ్ చేయించాను. రెడీ అవ్వండి" అన్నాడు సాయంత్రం అవుతుండగా. "శైలజ మనసెందుకో అకారణంగా గువ్వలా ఎగిరి వుత్సాహపడుతున్నది. శైలజ డ్రెస్సయి బయటకు వచ్చింది. శంకర్రావు కూడ తయారు ముగించి టాక్సీ పిలిచేడు.

దారిలో యిద్దరూ అంతగా మాట్లాడుకోలేదు.

హాల్లోకి వెళ్ళగానే పిక్చరు మొదలయ్యింది. శైలజ అప్రయత్నంగా ప్రక్కకు చూసింది. శంకర్ సినిమా చూడ్డంలో నిమగ్నమయ్యేడు.

ప్రొజెక్టరు వెలుగులో అతని ముఖం శిల్పంలా మెరుస్తోంది. పల్లటి సన్నటి క్రాపు అందంగా తళతళలాడుతున్నది. వంపు తిరిగిన పెదవులపై చివరి వంకు పెంచిన సన్నటి మీసం అతని చిరువవ్వుకి వగిషీ పెట్టినట్లుంది.

అనుకోకుండా అతను శైలజవైపు తిరిగి చూసేడు. శైలజ గభాలున తల త్రిప్పుకొంది.

"మీరు పిక్చరు చూస్తున్నట్లు లేదు" అన్నాడు.

శైలజ సిగ్గుపడింది. తన ప్రవర్తన మీద తనకే వెగటు పుట్టినట్లు తల వంచుకుని కూర్చుంది. ఆ తర్వాత శంకరదేం పట్టించుకోనట్లు ఏవేవో కబుర్లు చెబుతున్నాడు. భోజనం ముగించి హాల్లో బెడ్ వేసుకున్నాడు శంకర్.

గదిలో మంచంమీద పడుకున్న శైలజకు పాత సమస్యలకు సమాధానం- దొంకక్కపోగా క్రొత్త సమస్యలు కొనితెచ్చుకుంటున్నానేమో అన్పించింది.

ఆమె మనసు శంకర్కి, సత్యమూర్తికి మధ్య అంతరాలు కొలిచి, కొలిచి చూడ్డం ప్రారంభించింది.

శంకర్! అణువణువునా ఉత్సాహం తొణికిసలాడే మనిషి. అలాంటి వ్యక్తి దగ్గర జీవితం విసుగనిపించే క్షణాలుండవు. మనిషికేం కావాలో పెదవి విప్పి చెప్పకుండానే కని పెట్టగల సమర్థుడు. బాధలు కూడా తియ్యగా వర్ణించగల చతురుడు. ఏ అదృష్టవంతురాలికోసం వేచివున్నాడో! మూర్తి తలపుకి రాగానే ఆమె విసుగ్గా నిట్టూర్చింది. శంకర్లో వున్న వుత్సాహంలో

అనువున్నా కావిలా దారులు వెదుక్కోవలసిన అగత్యం ఏర్పడేది కాదు' శైలజ శాలువా కప్పుకొని నిద్ర కుపక్రమించింది.

* * *

శైలజ మనసు ఉల్లాసంగా ఉంది

శంకర్ ముఖం కడుక్కొచ్చేసరికి శైలజ కప్పుల్లో కాఫీ కలిపింది.

శంకర్ నవ్వుతూ కప్పు అందుకొన్నాడు "ఎంత కొట్టిపారేసినా ఇంటికి అడదే మున్నాటికీ అందమని ఒప్పుకోక తప్పదు"

శైలజ నవ్వుతూ "మాటలకేం గాని ముందు నా ఉద్యోగం సంగతి ఆలోచించండి" అంది.

"ఉద్యోగం అంత తొందరగా అవసరమా?"

"కాదా, మనం ఎంత సన్నిహితులం అయినప్పటికీ నేనిలా మీకు భారంగా వుండటం ఏం బాగుంటుంది? లోకం ఏమనుకుంటుంది?"

శంకర్రావు టకాలున కప్పు టీపాయ్‌మీద వుంచి అరక్షణం శైలజవైపు చిత్రంగా చూసేడు. "ఒక్కొక్కప్పుడు మీరు చాల గంభీరంగా ప్రవర్తిస్తారు కాని అప్పుడప్పుడు ఒట్టి బేలలా మాట్లాడుతారు."

"ఏం?" అంది శైలజ అమాయికంగా

"చూడండి, స్నేహానికి అర్థం ఏమిటి? అలాంటి పవిత్రమయిన స్నేహితులమై వుండి ఒకరికొకరు భారం కావడం ఎలా వీలవుతుంది? కాబట్టి మీ మొదటి మాట శుద్ధ అర్థరహిత మైందంటే మీరేమీ అనుకోరుగా! ఇక ఇప్పుడీ లోకం మీదకు దండెత్తుదాం. లోకం అనేదేమిటి? మీలాంటి నాలాంటి నలుగురు మనుష్యులు కలిస్తే ఏర్పడేదేగా! అందులో అందరూ చదువుకున్న వాళ్ళు, సంస్కారులు వుంటారనే గట్టి నమ్మకమేమీ లేదుగా. ఇకపోతే తప్పు చేస్తున్నదీ లేనిదీ ఏ మనిషి కామనిషికి తెలిసినట్లు యితరులకి తెలియదని నా భావన. ఇక యీ లోకం చేసే పనేమిటంటే యిద్దరు స్త్రీపురుషుల అనుబంధాన్ని అసంబద్ధంగా నిర్ణయించి, ముద్రవేసి గాలికి వదిలిపెట్టటమే. ఏ పరిస్థితుల్లో ఎవరి కెలాంటి అనుబంధం ఏర్పడిందో, అది ఎలాంటిదో కొంచెం కూడ ఆలోచించడానికి ప్రయత్నించదీ లోకం. సంఘం దృష్టిలో దోషులుగా నిర్ణయించబడి చేయని తప్పులకు బలిఅయి నవాళ్ళు మనకు చరిత్రలో కోకొల్లలుగా కన్పిస్తూనే వున్నారు

ఇక యీ సంఘం-భర్త అన్యాయానికి బలయ్యే భార్యలని, స్వార్థంకోసం

కల్పించుకున్న కులమత విద్వేషాల ఒరలో ఒదుక్కున్న దీనుల్ని కన్నెత్తి చూడదు అసలు సంఘానికి సమస్యలు సృష్టించడమే గాని వాటిని పరిష్కరించట చేతగాదంటే మీరేమంటారు?''

''మీరు రియలిస్టిక్‌గా మాట్లాడుతుంటే నే నేమనగలను!''

''అలా ఒప్పుకున్నారు బాగుంది! ఒక్క విషయం అడుగుతాను ఏమనుకోరు కదా!''

''అడగండి'' శైలజ కనురెత్తి చూసింది.

''ఎంత కాదనుకున్నా నా కొక్క అనుమానం. మీరెందు కంతగా వుద్యోగ ప్రయత్నం చేస్తున్నారో నా కర్థంకాలేదు.''

శైలజ కాస్సేపు మౌనం వహించింది. ఆ క్షణం ఆమెకు శంకర్‌ను మించిన ఆప్తులీ ప్రపంచంలో దొరకరనే అనుభూతి కల్గింది. బొటనవ్రేలు నేలకు రాస్తూ నెమ్మదిగా తన అసంతృప్తి వెల్లడించింది శైలజ

''ఆయన పేరు?''

''పేరు, వూరు ఏమైతేనేం లెండి. అతను నా భర్త. ఇంతకు మించి చెప్పలేకపోతున్నందుకు క్షమించండి.''

''ఫర్వాలేదు. ఇంతకూ అతనిలో పరివర్తన రావాలని మీరాశిస్తున్నారా?''

''రావడం హర్షదాయకమేగా. కాని నేను అభిమానం చంపుకుని మాత్రం అతని గడప త్రొక్కను''

ఈ నిరీక్షణలో మీ జీవితం కరగిపోతే చివరకు మీకు మిగిలేది?''

శైలజ తల్లడిల్లి చూసిందతని వైపు.

శంకర్ గట్టిగా నవ్వేడు ''మీరు మీ జీవితాన్ని ప్రేమిస్తున్నారు. జీవితం నుండి మీరెంతో ఆశించేరు. అది మీకందకపోవడం మీరు సహించలేరు. ఆ తృప్తి పూర్తిచేసుకోవాలనే కాంక్ష లేకుంటే శూన్యమనన్కయి మీరు అతని దగ్గరే గుట్టుగా జీవితం వెళ్ళబుచ్చేవారు. అలాకాక యిలా యిల్లు వీడి రావడంలో మీకు మీ ఆశలపై, జీవితంపై గల గాఢ మక్కువ అర్థమవుతుంది. ఇలాంటప్పుడు ఏ క్షణమో మీ భర్తలో కలిగే మార్పు కోసం మీరు కాచుకూర్చోవడం పూర్తిగా అసందర్భం. చివరకు అతనిలో మార్పువచ్చి కథ సుఖాంతం అవుతుందని నమ్మడ మెట్లా?''

''మీ రాలోచించుకోవలసింది ఒక్కటే విషయం. మీరు జరిగినదానికి నల్లరంగు పూసి, భవిష్యత్తు వెదుక్కోవడం— అంటే మీ ఆశయాలకు తగిన వ్యక్తి

మరొకణ్ణి ఎన్నుకోవడం, లేదా కిమ్మనకుండా అతని దగ్గరకి వెళ్ళిపోవడం, లేదా వుద్యోగం చేస్తూ జీవితం హారతి కర్పూరంలా కరిగించుకోవడమో" శంకర్రావు టవల్ తీసుకుని బాత్రూమ్‌వైపు వెళ్తుంటే శైలజ దిగ్భ్రమగా చూస్తూ కూర్చుండి పోయింది.

ఆ తర్వాత శంకర్ ఏమీ జరగనట్లు మామూలుగానే ప్రవర్తించేడు. కాని శైలజ మాత్రం మామూలుగా వుండలేకపోయింది. శంకరం మాటలు ఆమెలో తీవ్ర సంచలనాన్ని కల్గించేయి. ఆమె మాటల్లో జంకు, చూపులో అవిశ్చలత ఏర్పడింది. అంతకుముందు కన్నా బలమైన ఆకర్షణలో ఆమె యిరుక్కు పోయింది.

* * * *

నాలుగు రోజులనంతరం "నాకు టూర్ ప్రారంభమైంది. మీరు నాతో రండి, ఇక్కడ ఏం చేస్తారు?" అన్నాడు శంకర్ సూటుకేస్‌లో బట్టలు సర్దు కుంటూ.

"ఎక్కడెక్కడకు?" అంది శైలజ ఆసక్తిగా.

"అటు పీలేరు— యిటు నాగార్జునసాగర్. మధ్యలో మన కిష్టమైన చోట మరో హాల్టు .." అర్థవంతంగా నవ్వేడు శంకర్

శైలజ కిమ్మనకుండా బట్టలు సర్దుకుంది.

అందమైన కాశ్మీరు పట్టుచీరపై ఎర్రటి స్వెట్టర్ ధరించింది శైలజ. మెడచుట్టూ గుండ్రంగా తిరిగిన ముడికి ఒకప్రక్క ఎర్రగులాబీ చెవులకి ముత్యాల దిద్దులు, పెట్టకుని ముచ్చటగా వుంది కాటుక దిద్దిన కన్నుల్లో ఏదో భయం అస్పష్టంగా గోచరిస్తున్నది.

రాత్రి ఏడు గంటలకు ప్లాట్‌ఫారమ్‌మీద పూరి ఎక్స్‌ప్రెస్ రెడీగావుంది.

"టిక్కెట్లు ముందే రిజర్వ్ చేయించేను పదండి" అన్నాడు ముందుకి దారితీసి ఫస్టుక్లాస్ కంపార్టుమెంటులోకి కారిడార్‌లోంచి వెళ్ళి ఒక కూపేలోకి దారితీసేడు. అతన్ని అనుసరించింది శైలజ.

శంకర్ హోల్డాల్ విప్పి బెర్తుమీద పరిచేడు. శైలజ కిటికీ ప్రక్కగా కూర్చుంది.

"ఇది వింటరని మరచిపోతే ఎలా?" శంకర్ గ్లాసుడోర్ మూసి పక్కనే కూర్చున్నాడు.

"వారం రోజుల క్రితం మనం పరిచయస్తులుగా ప్రయాణం చేసేం.

ఈరోజు ఎంతో ఆత్మీయులై వెళ్తున్నాం. ఈరోజు మన జీవితంలో ఓ తీయని అనుభూతి కావాలని ఆశిస్తున్నాను."

శైలజ మాట్లాడకుండా అతనివైపు చూసింది.

"నిజంగా నాకీ రోజు ఎంతో సంతోషంగా వుంది. ఈ ప్రపంచంలో నేను ఏకాకిని కానని నాకూ ఒక తోడూ నీడా వుందని, నేను బ్రతకాలని గట్టి ఆశ కల్గుతోంది. నిజం చెప్పు. నీకు నా మీద సానుభూతి కల్గటం లేదూ!" శంకర్ శైలజచేయి తన చెంప కానించుకుని ఆమె కళ్ళలోకి చూసేరు,

శైలజ చేయి తీసుకోవటానికి ప్రయత్నించలేదు. శంకర్ ఆకర్షణ నుండి తప్పించుకోలేని బలహీనత ఆమె హృదయమంతా నిండిపోయింది. 'తన జీవితంలో మరో మలుపు తిరిగిపోతున్నది. కనీసం కానాశించినది యిప్పుడైనా లభ్యమైతే . ' ఆమె మళ్ళీ ఆశలల్లుకోవడం ప్రారంభించింది.

వైజాగ్‌లో దిగినప్పుడు శైలజ కొంచెం భయపడింది.

ఎక్కడైనా సత్యమూర్తి కన్పిస్తే... ?

శంకరిదేం పట్టించుకునే స్థితిలో లేడు. అతడు హుషారుగా ఈలవేస్తు న్నాడు. అతని కళ్ళలో క్రొత్త తళుకు !

సీలేరు చేరగానే టి.బి.లో దిగి నీటుగా తయారయి "మరి రాణీగారు శెలవిస్తే వీడు ఉద్యోగ ధర్మం నిర్వహిస్తాడు" అన్నాడు నవ్వుతూ బేగ్‌తో.

శైలజ నవ్వుతూ తల వూపింది.

"నే వచ్చేటప్పటికి టాయిలెట్ ముగించి రెడీగా వుండు. నా ఫ్రెండు నెవర్నయినా అడిగి జీప్ తెస్తా. ప్రాజెక్టు చూద్దువుగాని" అంటూ వెళ్ళిపోయేరు.

శైలజ టి. బి. ఆవరణలో లిల్లీపూలు కోసుకుని తయారు కునక్ర మించింది, కెంపుల సెట్టు బయటకి తీసి, తెల్లటి ఎర్రంచు జరీ పట్టుచీర తీసి స్టాండుపై వేసింది.

మంచమ్మీద కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయిన శైలజ బయట శంకర్ కంఠధ్వని విని వులిక్కిపడింది.

"మీ మిసెస్‌ని కూడ తీసుకొచ్చేవా?" పరిచయమైన కంఠధ్వనిగా తోచి కర్టెను వెనకే వుండిపోయింది.

శంకర్ కంఠం తగ్గించి వ్యంగ్యంగా అన్నాడు "మిసెస్ కాదులే. ఓ వన్నెలాడి" శైలజ తన కాళ్ళక్రింద భూమి కృంగిపోతున్నట్లు కళ్ళుమూసు కుని గోడకు జేరబడింది.

"ఇంకా నువ్విలాంటి పనులు మానలేదా?"

"ఇందులో ఏముంది? ఈవిడకి పాపం భర్త దగ్గర భరించలేని అసంతృప్తి. పారిపోయి వచ్చింది పంజరం నుంచి తప్పించుకుని ఎగిరివచ్చిన పక్షి. ఎక్కడయినా వాలుతుంది. ష్! తయారవుతున్నట్లుంది. వస్తుంది చూద్దువుగాని" అన్నాడు శంకర్ గొంతు తగ్గించి.

శైలజ వంట్లో రక్తం మరిగిపోయింది. చివాలున కర్టెన్ తొలగించుకొని రాబోయిన ఆమె పాదాలు తక్కున ఆగిపోయేయి.

ఆ వెంటనే హృదయ విదారకంగా వినవచ్చిన కేకకు యిద్దరూ గదిలోకి పరిగెత్తేరు.

శైలజ అడ్డంగా నేలమీద పడివుంది.

"మైగాడ్! స్క్రూడ్రైవర్ ప్లగ్‌లో పెట్టి కరెంటుషాకుతో సూయిసైడ్ చేసుకున్నట్లుంది" అన్నాడు ఆవేదనగా.

సత్యమూర్తి అతని మాటలు విన్పించుకోలేదు. "శైలూ" అంటూ ఆమె ప్రక్కన కూలబడ్డాడు.

ఆ వెంటనే అతని కళ్ళు నిప్పులు కురిపేయి. "దుర్మార్గుడా, చివరికి నా శైలు కూడా నీపాలబడిందా?" అన్నాడు ఆవేదనగా.

శంకర్ నిర్లక్ష్యంగా తల యెగరేసాడు.

"ఆమె ఒక్క క్షణం అయినా జీవితంలో సంతృప్తి చవిచూసిందంటే అది నా దగ్గర కాని నీ దగ్గర ఎంత మాత్రమూ కాదు."

సత్యమూర్తి ఆవేశంగా "అమాయకుల్ని దారి తప్పించడం నీ ధర్మమా? మరి నీ భార్య గతేమిటి?" అన్నాడు.

"ఓహ్! ఆమె కిలాంటి కర్మ ఎప్పటికీ పట్టదు. అసంతృప్తి అనేది తలెత్తినప్పుడు కదా, అడ్డమైన దారులు వెదుక్కోవడం! నేను ఏక పత్నీ వ్రతుణ్ణి కాకపోయినా, నా భార్య శైలజకన్న ఎక్కువే సుఖపడుతుంది ఆమె నన్ను ప్రేమిస్తుంది. నేనామెను గుర్తిస్తాను. అసంతృప్తి అంటే తెలియనివ్వను. జీవితంలో రక్తి చూపిస్తాను. ఇలా దూరపుకొండల నిగనిగలు చూసి భ్రమసి పరిగెత్తే అవసరం రానివ్వను." శంకర్ నిశ్చింతంగా వెళ్ళిపోతుంటే చేతలుడిగి శాశ్వతంగా నిద్రపోతూన్న శైలజ ప్రక్కన కూర్చుండిపోయేడు సత్యమూర్తి.

---



విలేఖరి అవాలని చిరవాంఛ. కాని యీ మద్‌ఫోర్ట్ స్థానిక విలేఖరిత్వానికి పదముగ్గురు పోటీచెయ్యడంవల్ల ఆ కోరికని బురదకోట మద్దివీధి బురదలో కలిపేయక తప్పలేదు.

అన్నట్టు- 'బురదకోట' అన్నాను కదూ! విన్నామొన్నటిదీ కాదు, రాజమహేంద్రీపురవరాన్నేలిన వీరభద్రారెడ్డి నాటికే ఉన్నట్టు శాశిఖండం చతుర్థాశ్వాసాంతం అధారిటీ! ఈ గ్రామోత్తమ ఖండంలో నాలుగు వణుకురాళ్ళున్న చోటల్లా ఎప్పుడో ఎవరో బురదతో రాళ్ళు పేర్చి కట్టిన బ్రహ్మాండమైన కోట శిధిలాలంటూ ఆనవాలుగా చూపుతుంటారు.

ప్రస్తుతం పంచాయితీ ధర్మమా అని వీధివీధినీ పుష్కలంగా ఉన్న బురదతో, ముఖ్యంగా యీ మద్దివీధి బురదలో పిల్లకాయలు క్లేమాడలింగు కళ తర్ఫీదవుతూంటారు ఇంటింటా వెలసిన ఊదొత్తు కంపెనీల పుణ్యాన బొగ్గుగుండతో కలసిన బురదబండి కాటుక లాగ నిగనిగలాడుతూ పిల్లల వాలకాన్ని శోభాయమానంగా తీర్చిదిద్దుతూంటుంది.

మా గరిడీమేన్- వర్షకి బొమ్మరిది అవుతాల్లెంది- చిన్నమాటుంది రమ్మని ఏటి అవతలి గట్టుమీదికి తీసుకెళ్లాడు. పచ్చటి చెరుకుతోటలు, నీలపు కొండచాటుకు దిగుతున్న రవిబింబం, ఎండిపోతున్న నీటిపాయ, సంధ్యాసమయం అంతా బాగానే ఉంది.

సాము, గరిడీ, కుస్తీ మొదలైనవి చేస్తూంటాడేమో మావాడు గరిడీమేన్‌గా పేరుపడ్డాడు. ఫ్రెండ్సూ గ్రిండ్సూ అంతా కలిసి మావాడికి 'బురదకోట గ్రామసింహం' అనే బిరుద ప్రదానోత్సవం బ్రహ్మాండంగా జరుపుతామని తయారయ్యార్డు. కొండవీటిసింహం

అనకాపల్లిలో బాగా ఆడుతూన్నది, కొండపీటిసింహం లాగ బురదకోట గ్రామానికి సింహాన్నన్న మాట!—

అహ్! మావాడు అలాగనుకుని చంకలు గుద్దుకుంటూ ఇంటికెళ్ళి చెప్పాడు. అంతా ఆలకించి మావాడి సతీమణి "ఇందులో ఏదో తిరకాసుంది మావా! నీన్నాపేరు కొండవీటిగ్రామ సింహం అని లేదుగా మరి...." అందిట.

"గ్రామసింహం అంటే బేపి-కుక్క-కదూ!" అనడిగాడు మా గరిడీమేన్. ఔనన్నట్లు తలాడించి ఊరుకున్నాను.

"అద్గదీ, అదీ సంగతి! దొంగనా కొడుకులు, ఫ్రెండ్సూ గ్రిండ్సూను, నాలుగు తగల్నిస్తా.... బుర్రంటే అదీ బుర్ర! యీ బురదకోట ఆడోళ్ళ బుర్రల్లో బురదేగాని నెవడు లేదంటూండే వోణ్ణిగాని, నీ సెల్లెలు తెలివైందే అంటావా లేదా...." అని అంటున్నాడు. నా కాలికి ఏదో కుట్టింది! కుట్టిందో కరిచిందో పొడిచిందో, చలిచీమో, కొండ తేలో, పామో, పురుగో యేదో.... నా కంతే తెలుసు....

ఆ తర్వాత నా కంతా తెలుసు- ఏ బాధాలేదు, చలిచీమే అయ్యుంటుంది అంతే అంతే, చీకటిలో ఎవరో దగ్గిరికి వస్తున్నారు- ఎవరో ఏమిటి, మా గరిడీ మేనే అనుకుంటూంటే "స్వాగతం, సుస్వాగతం! రండి సార్ రండి, మా లోకం, మా రాజ్యాంగం, మా సంస్కృతి, మా కళలు, మా పాటలు-టక్కు అన్నీ మీరు మీ దిన వార పత్రికా సంయుక్త పత్రికా రాజం నిండా తెగ పొగుడుతూ ఫోటోల్తో- మా సూపర్ సైకోకలర్ ఫోటోలతో సహా ఎక్కించేయాలి!

"మా జంబూలోకం జంబుకేశ్వర ఉద్భవలాపంగా ఏర్పడిందనీ జంబో నేరేడుచెట్లు విస్తారంగా ఉన్నందువల్ల ననీ, అబ్బే అవేమీ కాదు- జంబుకాలు-అంటే నక్కలు- ఊరియలుచేస్తే ఏర్పడి నందువల్లనే జంబూలోకం అనే పేరొచ్చిందనీ నలుగురూ నాలుగు విధాల అంటూంటారు, మొత్తానికి అసల్ సిసల్ పాతాళబిలలోకం మాది!

మాది స్వేచ్ఛాలోకం మా భాష స్వేచ్ఛాభాష! నీళ్ళు నమల్తూ మాటాడ్డం మాకు తలనెప్పి. భాషామాధుర్యం, లెస్సపలుకు లాంటి పిచ్చి మాకు లేదు. భావోద్వేగం ప్రధానం. అసలే ఇది స్వేచ్ఛాయుగం-భాషామాధుర్యం కవితా కోమలం మొదలైన నాబ్బొడు వ్యవహారంతో మాకు పనిలేదు, ఒకరి అభిప్రాయా లొకరికి తెల్పడానికే భాష, అంతేకాని చెల్లో కప్పలమేళంలాగ వాక్యం రెండుసార్లు పలికితే చాలు కవిత్వం అయిపోతూం దనే కవిసమ్మేళనాలూ అవీ మా లోకంలో లేవు...." అంటూన్నాడు.

"ఆగు, ఇంత స్వేచ్ఛగా మాట్లాడేస్తున్నావు గాని, నీ స్వేచ్ఛ అందుకోలేను, ఇంతకూ నువ్వెవరు? ఆ దినవార

యుశిక్షనంపత్రి కిక్కి స్థానిక బురదకోట విశేషరిగా నెగ్గిన అబ్బాయివి కదూ?!" అన్నాను.

"పొరబడ్డున్నార్సార్! నేను జంబూలోక ఏకైక రిసెప్షనిస్టుని" అన్నాడు.

"నేనిప్పుడెక్కడున్నాను?" అన్నాను.

"విధాన్ బోరియ, నానాప్రదేశ్-జంబూలోక్- ఇదీ మీ ప్రజెంటడ్రస్."

"ఇక్కడికెలాగవచ్చాను?" నా ప్రశ్న.

"మా గేట్‌వే ఆఫ్ జంబూలోక్ దగ్గిర తెలివితప్పి పడున్నార్స! మా గూఢచారి నంబర్ నైట్‌వన్‌నైట్ మీరెవరో దారితప్పిన టూరిస్టు అనుకొని యీ నానాప్రదేశ్‌కి చేర్చాడు, రండి! మా జంబూలోక్ అంతా నాతో కలిసి చూద్దురుగాని. మనకోసం పన్నెండు జతల కండచీమల శక్తిశకటం సిద్ధంగా ఉంది!" అన్నాడు జంబూకేయుడు.

"ఏమిటీ! కండచీమలా?!!" ఆశ్చర్యపోయాను.

"కావ్సార్! మామూలు కండచీమలు కావు, పెద్ద పెద్ద డీసెల్ ఇంజన్లు వాటి ముందు తీసికట్టు. పెట్రోలు కొరతవల్ల వీటిని ఉపయోగిస్తున్నాం" అన్నాడు జంబూ

"బాబ్బాబు, నేనిప్పుడు మీతో మీ లోకయాత్ర చెయ్యటానికి తీరదు. బోలెడు పనులున్నాయిగాని ఇందాకేవో ఫోటోలన్నావు అవి చూస్తే చాలు, కాస్త వాటిని చూపెయ్యి!" అన్నాను.

"ఓ యస్! ఆరంటే ఆరు, కలర్ ఫోటోలు ప్రింట్స్ యిస్తున్నాను, ఇవి ఆరుగురు ప్రముఖ జంబూలోక మహా వ్యక్తులవి. ఆరుగురూ ఆరు కోణాల నక్షత్రంలాగ, షట్కోణ చక్రంలాగ మా లోకచక్రాన్ని గిర్రున తిప్పేస్తున్నారు" అంటూ ఆల్బమ్‌నుంచి ఆరు ఫోటోలు తీసియిచ్చాడు జంబూ స్వాగతకారుడు.

అవి ఫోటోగ్రాపుల్లా లేవు, వ్యంగ్య చిత్రాల్లాగో, కార్టూన్లలాగో, కార్టూనుల్లాగో ఉన్నాయి. పేర్లు మరీ విడ్డూరంగా ఉన్నాయి. రాష్ట్రపతి ప్రప్రధానివివి, ముఖ్యమంతిరి, ఆఫీచరు, సర్పంచీచీ, రాజకీయనాయాకుడు....!!! ఏంటీ అపభ్రంశప్పేర్లు? అన్నట్లు చూశాను.

"ఆ పేర్లంతే సార్, మేం అలాగే ఉచ్చారణ చేస్తాం, అర్థం అయితే చాలు, ఇది అపశబ్దం, అది తప్పు సమాసం మొదలైన పట్టింపులు మాకు నో! అవి మా ఎలక్ట్రానిక్ బ్రెయిన్ సైకో కేమరా తీసినవి. మీకు తెలీని విశేషమేమిటంటే, ఆ కామెరా క్లిక్ నొక్కితే ఆటోమాటిక్‌గా శాస్త్రీయ మౌలిక, తాత్విక రూపాల్ని ఇట్టే గుర్తించి ఫోటో దించుతాది. ఇప్పటికి మా జంబూలోక్ కేంద్ర ఎన్నికలు, ప్రదేశ్‌ల రాష్ట్రాల ఎన్నికలు వేసార్లు జరిగాయి. జరుగుతున్నాయి. జరుగుతాయి. శాస్త్రీలు మారుతున్నా ఒక్కలాగే ఫోటో దిగుతున్నారు. మా సైకో

కామెరా తప్పు చూడదు అంటే వాళ్ల వాళ్ల మామ్మూలు రూపాల్లోగాని, పేర్లతోగాని సైకోకి పనిలేదు. అంచేత వాళ్ల పేర్ల ప్రసక్తి లేదు. ప్రత్యేకించి ఫోటో తీయించాల్సిన పనికూడా తగ్గిపోయింది." అన్నాడు జంబూ.

"అరె! వీట్నిబట్టి చూడగా అంతా అమానుషంగా కనిపిస్తున్నారే! ఇలాంటి వాళ్లా మీ జంబూలోక ప్రముఖులు?!!" అన్నాను.

"ఏం చేస్తాం సార్! మీలాగే మాలో కాస్త ఆలోచించేవాళ్లు ఆ ఆరుగుర్నీ అరిషడ్వర్గం అని పేరెట్టారు. మా లోకానికి దాపురించిన ఆరుగురు శత్రువులన్నమాట, అలాంటి వాళ్లకే ఓట్లు వేస్తున్నారు, ఎన్నుకుంటున్నారు మా జంబూప్రజ. ఏం చేస్తాం సార్?!"

"మీ రాజ్యాంగం మార్చుకోకూడదూ?"

"అదీ లాభంలేకపోయింది. ఓట్లు లాగిపారేద్దామంటే ప్రజాస్వామ్యమో అని ఏడుస్తారు, ఎన్నికలెడితే ఇలాంటి ప్రముఖుల్నే ఎన్నుకుంటున్నారు జంబూ ప్రజానీకం. మా జంబూప్రజ మారాలి, చైతన్యం, వివేకం ఓటర్లకి రావాలి. అంతవరకూ జంబూలోక చరిత్ర ఇంతే సార్." అంటున్నాడు జంబూ. నాకేదో మైకం దిగిపోతున్నట్లుంది

"అసలే ఇది స్పీడుయుగం నా కవతల బోల్డంత పని, మా లోకసభ్యసమావేశం ఇటు నానాప్రదేశ్ నానా వర్గ సమ్మేళనం, చోర్నాడ్ తులాభారం, వీర్నాటక ప్రదర్శన, ఇంకా ఇంకా ఒకటా రెండా వల్లమాలినన్ని!.. వస్తా సార్- టా టా టా- అన్నట్టు కలర్ ఫోటోలు, స్క్వ్యేర్ సైకో కలర్ ఫోటోలు జేబులో పెట్టారు కదూ, భద్రం సార్!" జంబూ మాటలు దూరంగా అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

కళ్లు తెరిచాను, పాముల కన్నారావు పక్కనే ఉన్నాడు. గరిడీ మేన్ హమ్మయ్య! అంటున్నాడు.

"మరేం కాదు, చలిచీమల్లో కొన్ని రకాలు, కొన్నిరకాల కీటకాలు కుట్టితే మైకం కమ్మి నిద్రవచ్చేస్తుంది. అలాంటి దేదో జరిగింది, అంతే. మరేం ఫర్లేదు. అయినా మంత్రం వేశా, పసరు పూశా," అన్నాడు కన్నారావు. నేను తెలివితప్పి పడిపోవడంచూసి గరిడీమేన్ ఏం చెయ్యాలో తోచక తెంబేలు పడుతూంటే సమయానికి కన్నారావు పనిమీద వెళ్లి ఆ దార్నే వస్తూన్నాట్ట.

బాగా చీకటిపడింది. లేచాను. నిద్ర మైకం పూర్తిగా వదిలింది. ముగ్గురం బయల్దేరాం. బంగార్లా ఇంటికి నడిచాను- 'పావనం' చేరుకున్నాం.

వంటింట్లో మాకాయ్, మంగాయ్ ఘర్షణపడుతున్నార్లా ఉంది. వసంత్, పావన్ లిద్దరూ కీచులాడుతూ అల్లరి చేస్తూన్నారు. అవేవీ సరిగ్గా వినిపించలేదు గాని 'కలర్ ఫోటోలు- సైకో కలర్ ఫోటోలు భద్రం సార్!' జంబూ హెచ్చరిక చెవుల్లో గింగురుమంటూన్నట్లే ఉంది.

---



# ఎండిపోయిన కొమ్మ

'నిఖిల్'

జనం వస్తున్నారు-పోతున్నారు. వింతగా చూస్తున్నారు- బాధపడినట్టు కనపడుతున్నారు. గుమికూడుతున్నారు – చెదరిపోతున్నారు....ఎంతోమంది....

అందమైన అమ్మాయిలు దూరం నుంచి, ముసలివాళ్లు దగ్గరి నుంచి లోలోపలే సానుభూతి వ్యక్తంచేస్తూ నిట్టూర్పులు విడుస్తూ—విలుచున్నారు.

కొందరు అలా ఒక చూపు పారేసి అది తమ పాపం కాదనుకొంటూ యాంత్రికంగా నడచిపోతున్నారు.

పైన.... పైనలు పరచుకున్న గోనె పంచికి పైగా వేలాడుతున్న శవం. పది అడుగుల ఎత్తు చెట్టుకొమ్మకు గాలిలో వేలాడుతున్న మనిషి. కాళ్ళు ముడతపడి మెడఒకవైపు వేలాడి-నోట్లోరక్తంకారి-వాలుక రక్తంతో ఎండి, బయటికి వేలాడి గాలిలో ఊగకుండా—వున్న శవం!

ఆపైన పచ్చపచ్చగా ఆకుపచ్చని ఆకులు.... ఇంకా ఎండకు ఎండిపోని ఆకులు.

కుడి - ఎడమల ఇద్దరు పోలీసు జవాన్లు.

ఒక పోలీసు ఎదుట ఇద్దరు ముగ్గురు

మాట్లాడుతూ ఆ శవం వేలాడిన పద్ధతి గురించి తర్కించుకుంటున్నారు.

"ఇంత చిన్న చెట్టుమీదికెళ్ళి కిందికి ఎట్లా పడతండి? కింద కాళ్లు అనితే గొంతు బిగుసుకపోతదా?" అని ఒక ముసలి మనిషి అనుమానం.

"లేధండీ, ఏముంది తాగిన విషాలో కాళ్ళు ముడుచుకుని పడివుంటాడు." అని మరో మనిషి సమాధానం.

"అది ఎట్లా సాధ్యం? పైకీ కిందికీ శరీరం తిన్నగా వేలాడితేనే కదా చావు సాధ్యం." మరొకరి సంశయం.

"ఇగో ఆదంతా పాతకాలం మాట, ఇప్పుడు చావుదలచుకున్నాడు గిట్లనే చస్తడు!" అని-సాధికారంగా అందరి తర్కాల్ని ఎగరగొట్టేసాడు పోలీసు.

డబ్బులు పోగుచేస్తూ శవాన్ని ఎట్లా తీసుకెళ్ళాలో పక్కనే వాదించుకుంటున్న ఇద్దరు రైల్వే పోర్టర్లు.

కింద కంకర రాళ్లు గీసుకుంటూ పారలకింద వొరసుకుంటూ చప్పుడు.... గ్యాంగ్ కూలీలు అరుస్తూ కిందికి పట్టాం కిందికి పారలు దించుతున్నారు.

దూరంగా కనబడిన ట్రైన్ను చూసి కూలీల కేకలు

రైలు వచ్చి ఆగింది.

లోకల్ ట్రైన్ ప్రయాణీకులు ఎవరి మానాన వాళ్ళు డబ్బాల్లోకి! ఆ రైలు పెట్టెల్లోంచి కొందరు ఆశ్చర్యంగా బయటకి చూస్తూ. కొందరు లోపలే వాడు అట్లా ఎట్లా ఉరిపోసుకున్నాడా అని తర్కించుకుంటూ....

రైలు కదిలింది.

విద్యానగర్ స్టేషన్ను వదిలిపెడుతోంది.

కొంత జనం తరలింది.

రైల్వే కూలీల గ్యాంగు తిరిగి పట్టాం పైకి విరుచకపడింది

చెట్టుకొమ్మకు వేలాడుతున్న ఆ ఊపిరిలేని వెంకయ్య శరీరం శవంగా మారిపోయి అక్కడే అలాగే వేలాడుతున్నాడు.

వెంకయ్య నిన్నటి సాయంత్రం వరకు స్టేషన్ బయట నిలుచున్న రిక్షా వాడు. ఈరోజు ఉదయమంతా కొమ్మకు వేలాడుతున్న కట్టెలాంటి కాయం!

ఎన్నో వేలమంది రిక్షావాళ్ళల్లో ఒకడు వెంకయ్య. రోజూ బుద్ధిగా రిక్షా తొక్కే మనిషి. సాయంత్రం కాగానే ఎక్కడో అక్కడ కాసిన్ని కల్లునీళ్ళు లేదా చిన్న పీసాడు గుడంబా పట్టించే మంచివాడు తన కష్టంతో తానే పొట్ట నింపుకొని కండరాల కష్టాన్ని మరచిపోవాలని తాగేవాడు. మంచిగా సుఖంగా నిద్రపడుతుందని తాగే వెంకయ్య నిన్న రాత్రి అట్లాగే శాశ్వతంగా నిద్రపోయాడు. మత్తులో చచ్చిపోయాడు. రక్తం కక్కుకుని కళ్లుమూసుకొన్నాడు.

అర్ధరాత్రి ప్లాట్ఫారమ్ మీది చెట్టు కొమ్మపైకి చేరుకున్నాడు. ఎందుకు చేరు




తున్నాడు? ఎట్లా చేరుకున్నాడు? మరు సటి రోజు ఉదయం వరకు గాని తెలిసి రాలేదు. అప్పుడే అనుమానపడిన జనం మనస్సులు ఇప్పుడు కుదుటపడ్డాయి.

"రిక్షా వానరు లంజాకొడుకుల్ని నమ్మితే ఇదే గతిరా!" అని గ్యాంగ్ కూలీల్లో ఒకడు తిడుతున్నాడు.

"ఎవర్ని ఎట్లా నమ్మితే ఏం లాభం? రోజూ వేలాదిమందిని మెల్లమెల్లగా, చిన్నచిన్నగా ఈ క్షత్రీసరుకులు చంపడం లేదా? రోజూ పెద్దోళ్లు చిన్నోళ్ళ కష్టాన్ని పిప్పిచేసి పండుగ చేసుకోడం లేదా? పేదోళ్ళ పేదరికాన్ని తొలగిస్తామని పేదోళ్ళనే మింగేయడం లేదా? వెంకయ్యను ఇంకో రామయ్యో, రంగయ్యో చంపితే ఎవరిదా తప్పు?" అని అందరి ముందు సిగ్నల్ చూపే జెండా పట్టుకుని ఊపుతూ అరిచాడు ముసలి ముకద్దమ్- గ్యాంగ్ కూలీల మేస్త్రీ.

చిన్న రెండు వందల రూపాయలు చీటీ పాడి డబ్బు తీసుకొన్న వెంకయ్య ఏం కలలు కన్నాడని? పాపం బక్కోడు మంచోడు. ఏం కలలు కనగలడు? ఊరికెళ్లి ఒక మంచి పిల్లను చూసి పెళ్ళాడి కొంచెం సుఖం అనుభవించా లనుకొన్న వెంకయ్య కలలు ఆ రాత్రికే చీకట్లో ముక్కలై పోయాయి.

వెంకయ్య చాలా రోజుల్నుంచి కూడ బెట్టిన డబ్బుల్ని రిక్షా వోనరు రంగయ్య నాయుడి దగ్గర దాచిపెట్టాడు. తనకు అవసరమైనపుడు తీసుకొంటానన్నాడు.

రిక్షాలనాయుడు రిక్షాలు తొక్కేవాళ్ళ పేర్లమీద అప్పులు పుచ్చుకొని మరికొన్ని బండ్లను పెంచాడు. వెంకయ్యలాంటి వాళ్ళ డబ్బు వాడు కొని జల్సా చేసాడు.

మొన్నగాక మొన్న తాను ఊరు వెళ్ళి పెళ్ళిచేసుకోవాలని కూడబెట్టిన డబ్బు ఇమ్మని వెంకయ్య నిలదీసాడు.

రంగయ్య రేపు మాపు ఇస్తానని వాయిదాలు వేసాడు.

చివరికి ఒకరోజు నాయుడి మను ష్యులు వెంకయ్యతోబాటు తాగారు.... చిత్తుగా తన్నారు.

తొక్కలని మాత్రమే సున్నం చేస్తా మన్న వాళ్ళ ఉద్దేశం ఆయువుపట్టు లోనికివెళ్ళి తాకింది.

ఆ దెబ్బకు వెంకయ్య ప్రాణం వదిలాడు.

ఆ మనుషుల యజమాని రంగయ్య తెలివిగా ఆలోచన సప్లైచేసాడు. అంతే తెల్లారేసరికి చెట్టుపై శవం వేలాడింది.

మరునటి రోజు ఎట్లాగో ఒకడు, ఆ తరువాత మరొకడు దొరికిపోయారు. సాక్షిదారాలు లేవని ఆ తర్వాత విడుదలై పోయారు.

రంగయ్యనాయుడు మాత్రం రిక్షా వాళ్ళ చెమటవాసన వేసే డబ్బును పోలీసు జేబుల్లో కుక్కాడు. తను మాత్రం హాయిగా తప్పించుకున్నాడు.

భయంకరమైన మామూలు దృశ్యం ఇప్పుడక్కడ లేదు. చెట్టు ఆ శవం మోతకు కూలలేదు. బాధకు, ఏడ్పుకు దాని ఆకులు ఎక్కడా రాలలేదు.

చెట్ల మధ్య చల్లని గాలికి పడక కుర్చీలో ఊగేవాళ్ల నిద్రపోతూనే వున్నారు.

ఇంటి బయట తెల్లని బొచ్చుకుక్క, పిల్లల్ని షికారుగా తిప్పుతూనే ఉన్నారు.

ఆ చెట్టు ఈనాడు దేశమంత పెద్దది. కాని నీడ కొందరంటే కొందరిదే. పండ్లు, ఆకులు, బలవంతులని మాత్రమే.

వెంకయ్యలు శవాలుగా వేలాడినప్పు డల్లా ఎండిన కొమ్మలు మాత్రమే దక్కుతున్నాయి.

---

సీరియల్

# సౌందర్యదీపం

ఆర్. సంధ్యాదేవి

(గత సంచిక తరువాయి)

కృష్ణమోహన్ పేరుని బట్టి నర్సింగ్ హోమ్ బాగానే నడుస్తుంది అని చెప్పాలి.

ఓపెన్ చేసిన కొత్తలో మెల్లగా ఒక్కొక్కళ్ళు ఆ ఆస్పత్రికి రాసాగారు.

మొదట్లో అలా తిరిగ్గా కూర్చునేది. అలా కూర్చోవటం ఆమెకు విసుగ్గా ఉండేది.

అలా రానురాను కొద్దికొద్దిగా జనం రాసాగారు. కొద్దిరోజులకి అంబిక మంచి డాక్టర్‌గా పేరుతెచ్చుకోసాగింది.

కృష్ణమోహన్‌కి ఇప్పుడు సంతృప్తిగా అనిపించసాగింది.

ఆనాటి అంబికకు ఈనాటి అంబికకు ఎంత తేడా! అప్పుడు ఎంత అమాయకంగా కనిపించేది. ఇప్పుడు ఎంత హుందాగా కనిపిస్తుంది!

ఎప్పుడూ చిన్న చిరునవ్వు అలా పెదవులమీద నాట్యంచేస్తూనే ఉంటుంది.

డాక్టర్‌కి మారుపేరు ఓర్పు,సహనం, ఇవి ఆమెకు ఉన్నాయి.

తను అనుకున్నది సాధించాలి అంటే ఎలా!

కృష్ణమోహన్ ఆలోచించసాగాడు.

అంబికకు ఈ విషయాలన్నీ చెప్పేస్తే!

ఊహూ. ఇప్పుడుకాదు సమయంరావాలి! ముందు రాజుతో ఆలోచించి అప్పుడు చెప్పాలి అనుకున్నాడు.

## 22

ఫోన్ రింగ్ అయితే రిసీవర్ అందుకుంది అంబిక. "హల్లో డాక్టర్ అంబికారాణి స్పీకింగ్" అంది హుందాగా.

"డాక్టర్‌గారా నమస్తే అండీ" అవతలి కంఠస్వరం వినయంగా పలికింది.

"నమస్తే మీరు...." అంటూ క్షణం సేపు ఆగింది.

అవతలి కంఠస్వరం ఫక్కుమంది.

"ఎవరూ! సుమతీ!" అడిగింది ఆతృతగా.

"అ గుర్తుపట్టారన్నమాట."

"ఊ ఏమిటి సంగతులు! మీ జయ

రామ్‌గారి సంగతులు ఏమిటి? వాళ్ళు వచ్చారా!"

"వచ్చారు" ఆమె గొంతుకలో ఏదో తెలియని బాధ ధ్వనించింది.

"అయితే సంబంధం నిశ్చయం అయినట్టేనా" ఉత్సాహంగా అడిగింది అంబిక, స్నేహితురాలి పెళ్ళి అనగానే మనస్ఫూర్తిగా సంతోషిస్తూ.

"నిశ్చయం చేస్తున్నారు అంబికా! నా కేమిటో భయంగా ఉంది జయరామ్ లాంటి వ్యక్తిని నేను భర్తగా భరించ గలనా! ఆయనకి నేను మంచి భార్యను కాగలనా. నా మనస్తత్వం వేరు ఆయన మనస్తత్వం వేరు. నా ఆశలు వేరు నా ఊహలు వేరు. నా భర్త కూడా ఒక డాక్టర్ కావాలని, ఇద్దరం డాక్టర్లం అయితే ఒకర్ని ఒకరం అర్థంచేసు కుని ఇద్దరి వృత్తి ఒకటి కాబట్టి ఇద్దరం కలిసి ప్రజాసేవ చేస్తాం. అదే అదొక్కటే నా కోరిక" అంది బరు వుగా నిట్టూరుస్తూ,

"మరి ఇప్పుడెలా!" అంబిక ప్రశ్నించింది.

మమతి అదోలా నవ్వింది. "ఎలా అంటే ఏముంది. నా ఆశలని నా మనసు లోనే దాచుకుని పెద్దల మాటకి తల వంచవలసిందే" అంది.

"ఎలా! నీకు ఇష్టం లేకుండా...." అంటూ మాట సగంలో ఆపేసింది.

"అందరికీ వాళ్ళ ఇష్టా ఇష్టాలమీద పెళ్ళిళ్ళు జరుగుతున్నాయా! ఆ దుర దృష్టవంతుల్లో నేను ఒకర్తెను. ఆయన్ని నేను మార్చుకోగలనా? సంతోషమే లేదా! నేను డాక్టర్‌గా నా వృత్తిలో పూర్తిగా లీనం అయిపోతాను. ఆయన విషయాలు ఏమీ నేను పట్టించుకోను. లోకం దృష్టిలో మేము భార్యాభర్తలుగా ఉంటాం, అంతే" అంటూ నవ్వింది. ఆ నవ్వులో బాధ అంబిక అర్థంచేసుకుంది. అయినా ఆమె స్నేహితురాలికి ఏమీ చెప్పలేకపోయింది.

వారి సంభాషణలు మరోవైపుకి మళ్ళాయి. వాళ్ళ ఫ్రెండ్స్‌గురించి మాట్లాడుకున్నారు చాలాసేపు.

• • •

అంబికకు చాలాసేపు మమతి మాటలే చెవుల్లో మారుమ్రోగసాగాయి.

మమతి జయరామ్‌ని చేసుకొనడానికి అసలు ఇష్టపడటంలేదు. అతను అంత మూర్ఖుడా!

జయరామ్‌ని తను తప్పకుండా చూడ వలసిందే అని మనసులో అనుకుంది.

తన ఆలోచనకి తనే నవ్వుకుంది.

అంబిక యింటికి వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదిగంటలు అయింది. ఆమె యింట్లో అడుగుపెడుతూనే నాకర్ని రోజూ మొదటిసారిగా వేసే ప్రశ్నే ఆరోజూ వేసింది.

"అయ్యగారు యింటికి వచ్చేశారా! భోజనం చేశారా! లేదా!"

"లేదమ్మా. అయ్యగారు ఇంకా

రాలేదు." అంటూ నౌకరు జవాబు ఇవ్వటం మామూలే.

"ఇంకా రాలేదా! ఏమిటి ఆలశ్యం! అంత అర్జంటుపని ఏదైనా ఉంటే భోజనంచేసి మళ్ళా వెళ్ళొచ్చుగా" ఆమె తనలో తాను గొణుక్కుంటూ తెచ్చిపెట్టుకున్న విసుగుతో తన గదిలోకి వెళ్ళిపోయింది.

రోజూలాగే ఆమెకూడా భోజనం చెయ్యకుండా అతనికోసం ఎదురు చూడసాగింది.

పదిగంటలు అవుతూండగా కృష్ణ మోహన్ యింటికి వచ్చాడు. స్నానంచేసి బట్టలు మార్చుకుని డైనింగ్‌హాలులోకి అడుగుపెడుతూనే "అమ్మాయిగారు యింటికి వచ్చేశారా!" అడిగాడు.

"తొమ్మిదిగంటలకే వచ్చేశారండి." నౌకరు వినయంగా చెప్పాడు.

"భోజనం చేశారా!" అడిగాడు డైనింగ్‌టేబుల్‌వద్ద కూర్చుంటూ.

"లేదండీ. ఆరు ఎప్పుడూ మీరు భోజనం చేస్తేగాని చెయ్యరుకదండీ.మీరు వచ్చేవరకూ అలా కూర్చుంటారండీ."

"అరెరె! అవును కదూ" అంటూ నొచ్చుకుంటూ "వెళ్ళి అమ్మాయిగార్ని పిలుచుకురా" అన్నాడు.

నౌకరు వెళ్ళి పిలుచుకువచ్చాడు

అంబిక డైనింగ్ హాలులోకి అడుగు పెడుతూనే అతనివైపు చూసింది.

అప్పుడే అతనూ చూశాడు.

ఒక్క క్షణం ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

ఇద్దరూ ఒకర్ని ఒకరు పరిశీలనగా చూసుకున్నారు.

ఇద్దరి చూపుల్లో స్నేహం, ఆత్మీయత పెనవేసుకున్నాయి.

"నువ్వు ఇంకా భోజనం చెయ్య లేదా!" అడిగాడు.

"మీరు ఇంకా రాలేదని చూస్తున్నాను." అంటూ నవ్వుతూ అతనికి ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"చూడు అంబికా! నేను ఎన్నో పనులమీద తిరుగుతూ ఉంటాను. నాకు యింటికి రావడానికి ఒక టైము అంటూ ఉండదు. నీవు నాకోసం ఇలా కూర్చున్నావంటే నీ ఆరోగ్యం దెబ్బ తింటుంది. ఇప్పుడు కొత్త కాబట్టి నీకు కొంచెం తీరిక దొరుకుతుంది. తరువాత నీకు అసలు తీరికే ఉండదు. అప్పుడు కూడా ఇలాగే నాకోసం ఎదురుచూద్దా మంటే కుదరదు. నేను రోజూ నీకు ఈ విషయం చెప్పాలనుకుని కబుర్లలో పడి మర్చిపోతున్నాను. మన జీవితం ఇంకా ఎంతో ఉంది. మన టైము అంతా ఈ భోజనం విషయంలో పాడుచెయ్య కూడదు. ఇంతవరకూ ఎవరూ సాధించ లేని, సాధించవలసిన పనులు ఎన్నో ఉన్నాయి. మన దృష్టి అటు ఉండాలి" అంటూ నవ్వాడు.

"ఏమిటా పనులు!" అంబిక కూడా నవ్వింది.

కృష్ణమూర్తి క్షణంసేపు తటపటా యించాడు. అప్పుడే ఆమెకు జరిగిన కథ అంతా చెప్పెయ్యాలనుకున్నాడు. కాని చెప్పడానికి ఇది సమయం అవునా కాదా అని ఆలోచించసాగాడు.

వంటఆకడు వడ్డిస్తుంటే లేచి అంబిక తను స్వయంగా అతనికి వడ్డించసాగింది.

కృష్ణమూర్తి ఆమె వడ్డిస్తుంటే చాలు అన్నట్టు చేతులు అడ్డుగా పెట్టాడు. "ఏమిటి అలా వడ్డించేస్తున్నావు! నేను తినగలనా లేదా అని ఆలోచించటంలేదు నువ్వు" అంటూ నవ్వాడు.

"మీరు తినగలిగినంత వడ్డించటం నాకు తెలుసు. ఉదయం వెళ్ళి రాత్రికి వస్తారు. కొంచెం తింటే ఆకలి వెయ్యదా? అందరి ఆరోగ్యాల గురించి మాట్లాడు తారు...." అంటూ నవ్వుతూ అతనికి బల వంతంగా వడ్డించి తనూ వడ్డించుకుని భోజనం చెయ్యసాగింది.

"అంబికా!" ఒక్క క్షణం ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె తల ఎత్తి ఏమిటి అన్నట్టు చూసింది.

"నేను ఎన్నిరోజులనుండో నీకు ఒక విషయం చెప్పాలనుకుని చెప్పలేకపోతు న్నాను" అంటూ ఆగాడు.

ఆమె చేతిలో అన్నం మెల్లగా జారి కంచలో పడింది. భోజనం చెయ్యటం ఆపి అతనివైపు క్షణంసేపు చూసి కను రెప్పలు క్రిందకు వాల్చేసింది.

"ఏమిటో ఈరోజు తప్పకుండా చెప్పండి" అంది మెల్లగా.

"ఇదొక కథ కాని కథ. అందుకే నేను చెప్పలేకపోతున్నాను. సమయం వచ్చినప్పుడు చెప్పాలనుకుంటున్నాను."

"మీరు చెప్పటం మొదలుపెడితే ఆ సమయం ఇప్పుడే వచ్చినట్టు కదా" అంటూ నవ్వింది.

అంబిక మనసు గాలిలో దూది పింజెంలా ఎగరసాగింది.

ఆయన ఏదో మనసులో అనుకుంటు న్నారు. అది తనకి చెప్పటానికి సందే హిస్తున్నారు ఏమిటి! తియ్యని తలపు లతో మనసు అంతా మత్తెక్కిపోయింది.

పైకి ఏమాత్రం తొణక్కుండా అలాగే ఉండిపోయింది.

"చెప్తాను" అంటూ గాఢంగా నిట్టూ ర్చాడు. అతని మనసు అంతా బాధగా బరువుగా ఎలాగో అనిపించసాగింది.

మానవజన్మ ఎత్తనే కూడదు. మాన వుడుగా జన్మ ఎత్తాడో అన్నీ బాధలే, అన్నీ సమస్యలే. నాది- నా వాళ్ళు అనే తాపత్రయం, పంతం పట్టుదలలు, ఉన్నది చాలదని ఇంకా ఇంకా సంపా దించాలనే ఆశ కోరికల మధ్య వేలా డేది మానవుడు. కృష్ణమూర్తి ఒక్క క్షణం ఆలోచించి ఆమెవైపు చూస్తూ "నే చెప్పింది చాలా జాగ్రత్తగా వినాలి" అంటూ భోజనం ముగించి లేచి సింక్

దగ్గర చెయ్యి కడుక్కుని అక్కడ రింగుకి ఉన్న టవల్‌తో చెయ్యి తుడుచు కుని ఇటు తిరిగాడు.

అంబిక కూడా భోజనం ముగించి అతని వెనకాల నడిచింది. ఇద్దరూ హాలు లోకి వెళ్ళారు.

జరిగినది అంతా ఆరోజు అంబికకు చెప్పేయాలనే నిర్ణయించుకున్నాడు.

అప్పుడే ఫోన్ రింగ్ అయింది.

రిసీవర్ అందుకుంటూ "హల్లో కృష్ణమౌళి హియర్" అన్నాడు హుందాగా.

"సార్ మీరా! నేను ఊర్వశి హోటల్ ప్రొప్రయిటర్ అనంత స్వామిని. మీతో అర్జంటుగా మాట్లాడా లని ఉదయం నుండీ ఫోన్‌చేస్తూనే ఉన్నాను. మీరు యింటివద్ద లేరని చెప్పారు. సారీ ఫర్ ద డిస్టర్బెన్స్ ఐ యామ్ గివింగ్ వర్ యూ" అంటూ నొచ్చుకున్నట్టు చెప్పాడు.

"నొ వాట్ ఎటాల్. వాట్ డు యు వాంట్ ఫ్రమ్ మి" అంటూ అడిగాడు.

"మీతో కొన్ని విషయాలు మాట్లా డాలి. ఇప్పుడు మీ యింటికి రమ్మం టారా?"

"ష్యూర్. యు కెన్ కమ్ నౌ. ఐ యామ్ ఫ్రీ" అని అతనికి చెప్పి రిసీవర్ పెట్టేస్తూ అంబికవైపు చూశాడు, అంతా విన్నావు కదా అన్నట్టు. "ఇప్పుడు అనంతస్వామి ఏదో అర్జంటు విషయం మాట్లాడడానికి వస్తున్నాడు. నేను చెప్పా లనుకున్న విషయం తాపీగా తీరికగా చెప్పాలి. ఇలా తొందరగా కాదు" అంటూ నవ్వాడు. అతనూ ఆమెవైపు అదోలా చూశాడు విషయం చెప్పలేక పోతున్నానే అన్నట్టు.

అంబిక నిరాశగా చూసింది. మళ్ళీ తాను సర్దుకుని "ఈరోజు కాకపోతే రేపు చెప్దురుగాని" అంటూ నవ్వి తన గది వైపు దారితీసింది.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ క్షణం సేపు అలా ఉండిపోయాడు.

ఏమిటీ ఆ విషయం అంబికకు చెప్పాలంటే సమయం కుదరటంలేదు. అదే చిత్రంగా ఉంది అనుకున్నాడు మనసులో కృష్ణమౌళి.

## 23

ఇంద్రసేన ఆ రోజు మహా హుషారుగా ఉంది. డ్రస్సింగ్ టేబుల్‌వద్ద కూర్చుని ముస్తాబు మొదలుపెట్టింది.

పింక్ కలర్ స్నో ముఖానికి పట్టించి ఆపైన పింక్ కలర్ ఫేస్‌పౌడరు వేసు కుంది. పౌడరు ఎక్కువైనచోట మెల్లగా పఫ్‌తో తుడిచేసింది. విశాలమైన అందాల కళ్ళకు కాటుక రేఖలు తీర్చి దిద్దింది.

పెదవులకి లిప్‌స్టిక్ వేసుకుంది. నుదుట మెరూన్ కలర్ షింగార్ కుంకుమబొట్టు గుండ్రంగా పెద్దగా తీర్చి

దిద్దింది. ఉంగరాల జుత్తుని పైకితీసి అందంగా చిన్న శిగ చుట్టింది. ఆ శిగకు మెరూన్ కలర్ మెరుస్తున్న నైలాన్ నెట్ వేసింది చెవులమీదుగా జుత్తు ఉంగరాలు తిరిగి పడ్తూ వింత అందా న్నిస్తున్నాయి.

జుత్తుని పైకితీసి శిగ చుట్టటం జుత్తు చెవులమీద పడటం చూస్తుంటే ఎవరైనా దూరాన్నుండి ఇంద్రవేణికి బాబ్డ్ హెయిర్ ఏమో అనికూడా అనుకుం టారు. అంత అందంగా ఉంది ఆమె హెయిర్ స్టయిల్.

ఇంద్రవేణ ముస్తాబు ముగించి బీరు వాలో హేంగర్‌కు ఉన్న చీర తీసుకుని కట్టుకుంది.

మైసూర్ జార్జిట్ మీద జరీదారాలతో చీరంతా కుట్టుపువ్వులున్న మెరూన్‌కలర్ చీర కట్టుకుంది. అదేరంగు మెరూన్ కలర్ స్లీవ్‌లెస్ జాకెట్ వేసుకుంది.చీరపై సిల్వర్ జరీపూలు దగ్గర దగ్గరగా కుట్టి ఉండటం మూలాన ఆ చీర ఆమె కట్టుకో గానే తళతళా మెరిసిపోసాగింది.

చీరకు తగినట్టు చెవులకి ప్యూర్ సిల్వర్ జూకాలు పెట్టుకుంది. మెడలో లతల్లా చెక్కుడుతో ఉన్న పెద్ద లాకెట్‌తో ఉన్న పొడవు గొలుసు ప్యూర్ సిల్వర్‌ది పైటమీదుగా వేసుకుంది. ముక్కుకి అందంగా నోస్‌రింగ్ పెట్టింది. ఎడంవైపు నడుంమీదుగా ప్యూర్ సిల్వర్ గొలుసు పెట్టుకుంది.

ముస్తాబు అయి అద్దం ముందు నిల బడి తన అందాన్ని, ముస్తాబుని మరో సారి తృప్తిగా చూసుకుని ఆ గదిలోంచి కదిలింది. ఆమె సంతోషానికి కారణం కాబోయే వదిన సుమతితో, అన్నగారితో సినిమాకు వెళ్తుంది.

తండ్రితో వాదించి పట్టుపట్టి సుమతి వాళ్ళ నాన్నగారికి ఫోన్‌చేయించి వాళ్ళ అమ్మాయిని తమతో సినిమాకు పంపించ డానికి ఒప్పించింది. గణేష్‌రావుగారు సుమతి తండ్రికి ఫోన్ చెయ్యడానికి సందేహించారు. ఆ అమ్మాయి ఎంత చదువుకుంటే మాత్రం పెళ్ళి కాకుండా తమ కొడుకుతో సినిమాకు పంపించమని అడగటం ఏం బాగుంటుంది అని ఆలో చించారు.

తమ గారాల కూతురు ఇంద్రవేణ అందుకు ఒప్పుకోలేదు. ఆయనకి ఫోన్ చేసిందాకా ఊరుకోలేదు.

కూతురి పోరు పడలేక ఫోన్ చేశారు.

సుమతి తండ్రి ఏమనుకున్నారో ఏమో అలాగే తీసుకెళ్ళమనండి అన్నారు.

గణేష్‌రావుగారు తేలిగ్గా నిట్టూర్చారు. మాట వినని గారాల కూతుళ్ళు ఉంటే అంతే మరి అనుకున్నారు మనసులో.

సుభద్రమ్మకు మాత్రం నచ్చలేదు.

ఏమనుకుంటారో అని పాపం వాళ్ళు ఏమీ అనలేకపోయారు గాని పెళ్ళి కాకుండా అమ్మాయితో సినిమాకు పంపి

స్తారా వాళ్ళ అమ్మాయిని. సంబంధం నిశ్చయం అయిపోయినట్టే. నిజమే. పెళ్ళికి ముహూర్తం పెట్టించలేదు. పెళ్ళి ఇంకా కాలేదు. ఆ అమ్మాయి ఎంత డాక్టర్ అయితే మాత్రం అబ్బాయితో వెళ్ళడానికి సిగ్గుపడదూ. ఇందూ ఉన్నదే దానివి అన్నీ కోతి బుద్ధులే. అన్నగార్ని బలవంతంగా లాక్కెళ్తుంది. అని మనసులో విసుక్కుంది.

గణేష్‌రావుగారు ఒక విధంగా కూతుర్ని చూసి గర్వపడ్డారు కూడా.

తన కూతురికి ఎంత పట్టుదల! ఎంత పంతం! అనుకున్నది సాధించి తీరుతుంది అనుకున్నారు.

జయరామ్ చెల్లెలితో కారులో సుమతి యింటికి వెళ్ళి ఆమెను తీసుకుని సినిమాకు వెళ్ళాడు.

అతనికి సుమతితో సినిమాకు వెళ్ళటం ఇష్టంలేదు.

పెళ్ళి అంటే పెళ్ళి. అంతే. అతని దృష్టిలో అమ్మాయి అందంగా ఉండాలి అలా ఉండాలి ఇలా ఉండాలి అని ఆలోచించలేదు అతను ఎప్పుడూ.

తల్లి, తండ్రి, చెల్లెలు సుమతిని చూసి చాలాబాగుంది అన్నారు. సరే అన్నాడు.

పెళ్ళి నిశ్చయం అయిపోయింది.

సుమతి ఆర్గండీ వాయిల్ చీర, తెల్లని అదే డిజైన్ ఉన్న జాకెట్ వేసుకుంది.

సినిమా హాలులో అడుగుపెడుతూనే హౌస్‌పుల్ బోర్డ్ వాళ్ళని వెక్కిరించింది.

ఇంద్రసేన అందరికంటే ముందుగా ఉడికిపోయింది.

మరో సినిమాకు వెళ్దామా అని అడిగాడు చెల్లెల్ని.

ఇంద్రసేన సుమతి ముఖంలోకి చూసింది. ఆమె ఏటూ చెప్పలేదు. వాళ్ళ ఇష్టానికే వదిలేసింది ఆ విషయాన్ని.

"వద్దు. ఇక ఏ సినిమాకు వెళ్లొద్దు. క్వాలిటీకి వెళ్ళి ఐస్‌క్రీమ్ తిని అలా తిరిగివద్దాం" అంది.

జయరామ్ అలాగే అని తల ఊపి కారుని క్వాలిటీవైపుకు పోనిచ్చాడు.

అక్కడ ఐయిస్‌క్రీమ్ తిని మెల్లగా కబుర్లు చెప్పుకుంటూ ఇవతలికి వచ్చారు.

(సశేషం)





# మరో ప్రస్థానం

వేమకోటి సీతారామ శాస్త్రి

"ఇంకా విడిచి పెట్టవా? ఎన్నాళ్ళిలా వుండాలనుకుంటున్నావ్...."

ఆ ప్రశ్నకు అవతలి సమాధానం, మమత వదలని బేలచూపు.

"అవును. యింకా యేం మిగిలింది, చేయవలసినదంతా చేయించావు. యింకా చేయవలసినది ఏమీలేదు. చేయాలనుకున్నా నీవేం చేయలేవు. ఎల్లప్పుడూ రోజులు నీవి కావు...."

ఆ మాటకు అహంకారం అంకుశంలా పొడిచింది.

"ఏమిటి నీ యిష్టం వచ్చినట్లు మాట్లాడుతున్నావు. ఎవరు నీవు........ హుంకరించింది. దానికి సమాధానమే పెద్ద నవ్వు. సముద్రంలో ఎగసి విరగని కెరటంలా వుందా నవ్వు.

"నే నెవరో నీవు పోల్చుకోలేదంటే.."

"ఉపోద్ఘాతం అనవసరం. సూటిగానే చెప్పలేవా..."

"నీ అజ్ఞానాన్ని ఏమనాలో తెలియటం లేదు. అడిగావు కాబట్టి చెప్పాలి. నేను యింతకాలం నీలోనే వుండి యిప్పుడే కోటేశ్వర్రావు అనే దేహంతోగల ఆత్మ అనే వస్తువునుండి యిప్పుడిప్పుడే విడిపోయిన అంతరాత్మని...." అంది.

"విడిపోయావు మంచిదే. కాని నన్నెందుకు యాగీచేస్తున్నావ్. నా పాట్లు నన్ను పడనీ. ఎలా వదులు

కుంటాను యివన్నీ. చూడొక్కసారి'' అంది అత్త.

''అర ఎకరం ఆవరణలో వేల రూపాయలు ఖర్చుతో ముద్దుతో పెంచిన పచ్చగడ్డి పరుపులు, ఇంద్రభవనంలాంటి మేడ, మరో ప్రక్కన గేటులో పశువుల డయిరీఫారం.... మరొకచోట కోళ్ళ ఫారమ్, అందమయిన ఫారిన్ కార్లు, ఎయిర్ కండిషన్ గదులు, గదుల్లో ఫారిన్ విస్కీ బాటిల్సు........ యివన్నీ నేమా నీతో కలిసి యిష్టంలేక పోయినా ఇంతకాలం చూశాను....''

గర్వంగా నవ్వింది అత్త.

''నవ్వకు. మానవ చరిత్రలో యే కొద్దిమందికో తప్ప ప్రతి గొప్పవాడి వెనుక ఒక నేరం వుండితీరుతుంది. ఆ నేరానికి శిక్ష వుండదు....''

''అదంతా నీ కుళ్ళుమోత్తనం. నా కోటీశ్వర్రావు అదృష్టం నీకు నేరంగా కన్పిస్తుంది. ఏమంటావ్.''

బిగ్గరగా నవ్వింది.

''మళ్ళా అదే నవ్వు.... యెందుకా నవ్వు.... యెందుకా అపహాస్యం——''

''నీ అమాయకత్వానికి నాకు జాలి వేస్తోంది. నీ కోటీశ్వర్రావు పుట్టినపుడు బంగారు చెమ్చాలతో పుట్టలేదు. కోట్లకు పడగలెత్తిన జమీందారీ వంశంలోనూ పుట్టలేదు. మామూలుగా మురికివాడలో పుట్టాడు. అవునా....''

''అవును. యేం? అందులోనే పెరిగాను. చదువుకోవడానికి అవకాశంలేదు. ఉదయం లేస్తే ఆకలి, చిరిగిపోయిన గుడ్డలు. బ్రతుకు కొండచిలువతో సమరం చేయాలి కోటిగాడు.

''బ్రతుకు సమరం చాలా పెద్ద పదం ఉపయోగించావు. వీరుడి లక్షణాలు అంట గడుతున్నావు నీ కోటీశ్వర్రావుకి. బ్లాకు మార్కెట్టులో సినిమా టిక్కెట్లమ్మడం, బ్రాకెట్టాట ఆడడం, జేబులు కత్తిరించడం, దొంగతనాలు చేయడం, యివన్నీ వీరోచితమైన పనులేనా....''

''దాని వెనకాతల కథ నీకు తెలియదు. పుట్టుకతోనే పిల్లాడేడుస్తాడు యెందుకో తెలుసా. వాడికి ముందు ఆకలి ప్రారంభమవుతుంది. పాలకోసం ఏడుస్తాడు అది సహజం. కానీ దేశంలో చాలా కుటుంబాలు ఆకలితో ఏడుస్తున్నాయి. కూటికోసం రకరకాల వ్యసనాలకి బానిసలై పోతున్నారు. ఆకలికోసం కోటిగాడి తండ్రి కన్నకూతుర్ని మురికివాడలో వేశ్యగా చేసి దాని పచ్చని జీవితాన్ని బలితీసుకున్నాడు. పనిచేయాలంటే బలం వుండాలి. బలంగా వుండాలంటే తిండి వుండాలి. నీకు తెలుసు కదా! ఎముకల కోటిగాడు రోడ్డుమీద పులివిస్తరాకుల్లో అన్నంకోసం కుక్కలతో పోరాడి కరుస్తున్న కుక్కలం బారినుండి పట్టెడు పులుసు మెతుకులు తెచ్చుకునే వాడు. గుడిసెలో పడుకోవడానికి చోటు వుండేది కాదు. అలాంటప్పుడు పార్కు

లోనూ, పేవుమెంట్లమీద బ్రతుకు గడిపే వాడు. సినిమా టిక్కెట్లు కొని బ్లాకులో అమ్మేవాడు."

"ఇలాంటి అవినీతి పనులు చేయడం కన్నా ఏ బస్సుస్టాండు దగ్గరో మూటలు మోసుకుని బ్రతకవచ్చు కదా!"

"వాడింక అలా బ్రతకలేడు. సప్త వ్యసనాలకు బానిసయిన తండ్రిని, ఉబ్బసరోగంతో బాధపడుతున్న తల్లిని పోషించాలి ..."

"అందుకని- అదేం గొప్ప విషయం కాదే ... ఏదో ఒక సాకు చెప్పి నీవు సమర్థించాలని చూస్తున్నావు...."

"నిజమే. ఏం చేస్తాను. పరిస్థితుల ప్రభావం. వ్యభిచార నేరానికి కొట్టు వుని అరెస్టుచేసి దాన్ని చిత్తుగా అనుభ వించి, మురికి చెర్లో పారేశారు. కూతురి స్థితికి తామే కారణమని మనోవేదనతో వాడి తల్లిదండ్రులు చచ్చిపోయారు...."

"మిగిలింది వాడొక్కడే.... ఆ మాత్రం బ్రతుకు నీతిగా బ్రతకలేడా!"

"అసలు చచ్చిపోదామనుకున్నాడు ఆ కుటుంబానికి పెద్ద కోరికలేవీ లేవు. పూట ఆకలికోసం వాళ్ళు దరిద్రంతో పోరాడి ఓడిపోయారు. కోటిగాడు చావా లనుకున్నా కోరిక తన్ని కసి మరింతగా కాటువేసింది. భయంకరమైన బతుకు కొండచిలువను ఎదుర్కోవాలను కున్నాడు...."

"అందుకని రౌడీగా మారాలా "

"ఒక్కొక్క సంఘటన జీవితాన్ని ఎంత బలీయంగా తిప్పి ప్రభావితం చేస్తుందో నీకు తెలిసినా గూడా వన్న దుగుతున్నావు"

"నిజమే! న్యాయంగా అభ్యర్థించ వలసిన ఓట్లను బెదిరించి అడిగాడు. అసలు వాడికి మునిసిపల్ కౌన్సిలర్‌గా నిలబడ్డానికి అర్హతలు వున్నాయా...."

"వాడికుండే అర్హతల్లా గూండా యిజమే. అందుకనే పట్టణంలో ఒక వర్గంలో చైర్మన్ కావాలనుకున్నవాడు, వీడికి డిపాజిట్ కట్టి నిలబెట్టాడు...."

"నిజమే. గెల్చిన తర్వాతేం చేశాడు. డిపాజిట్ కట్టినవాడికి ఓటువేసి చైర్మెన్ చేశాడా- లేదు. పాముకు పాలుపోస్తే కాటువేస్తుంది. అంతే చేశాడు... "

"అక్కడే పొరపడ్డావు. జీవితం పరమపద సోపానం లాంటిది. కోటి ఓటు ఒక్కడే చైర్మెన్ భవిష్యత్తు నిర్ణయిస్తుంది. అపతల పార్టీవాళ్ళు పల భయి వేలు యిస్తామన్నారు. అమ్ముడయ్యా అన్నాడు. చాలదేమో అనుకుని వాళ్ళు ఏభయి వేలు చేసుకోమన్నారు. నీతనేం రామాయణ భారతాలు చదవలేదు భారత దేశ స్వాతంత్ర్య చరిత్ర, యివేం తెలి యవు. అప్పుడేం జరిగిందో తెలుసా...."

"ఏం జరిగిందో కాదు. ఏం చేశావో చెప్పరా. పిచ్చివాడా! లక్ష్మీదేవి నీ ముంగిట నిలిచి తలుపు తడుతోంది అన్నాను. అంతే వాడు మనసు మార్చు




టున్నాడు. అసలు తెలుగు పదకోశంలో విశ్వాసం అనే పదం తీసివేయమని భాషావేత్తలకుచెప్పాలనుకుంటున్నాను."

"అవును. ఏ విశ్వాసం అతనికి తిండి పెట్టలేదు అవకాశవాదం అతన్ని అందలం ఎక్కించింది...."

"నిజమే! స్వామిద్రోహం. ఇవతల పార్టీకి ఓటువేసి గెలిపించాడు. అవతల పార్టీవాళ్ళు సామాన్యులా. కోటికి తమ పార్టీలోకి వస్తే వైస్-చైర్మెను చేస్తా మన్నారు... మళ్ళా అటువేపు వెళ్ళి పోయాడు."

"అది అతని తప్పు కాదు. ఆశ ."

"ఆశ కాదు.... దురాశ."

"ఏదయినా అనుకో. అలా చేయ బట్టే ఇరుపార్టీలవాళ్ళు తగువులు పడుతుంటే రాజీ అభ్యర్థిగా మరో ఆర్నెల్ల తర్వాత చైర్మెను పదవి అలంకరించాడు."

"చూడు.... చూడు.... ఎవరో ఆడ వాళ్ళూ పిల్లలూ వస్తున్నారు.. అయ్యో మరి వాళ్ళెందుకు ముందింటి గజాల తలుపులు వేస్తున్నారు "

"వేయాలి మరి లేకపోతే మేమే కోటేశ్వర్రావు ఆస్తికి వారసులమంటూ వచ్చేస్తారు "

"అంటే యిప్పుడు ఆ ఇంట్లోవుండే ముగ్గురు కొడుకులూ అసలు భార్య రుక్మిణమ్మ సంతానమా....

"నీకు పేరు గుర్తుందే."

"పేరే కాదు ఆ మహాసాధ్వి భర్త

చేసే అనాచకాలు భరించలేక, పెరట్లో నూతిలో పడి చచ్చింది అది గూడా గుర్తుంది."

"నుదుట వ్రాసిన వ్రాత తప్పించ గలరా! అర్థం. అవిడకేం లోటని! పనసపళ్ళ లాంటి ముగ్గురు మొగబిడ్డలు, మహారాణి లాంటి జీవితం, సోషల్ స్టేటస్ ఏదో మొగవాడు సోషల్ సర్కిల్సులో ఆ మాత్రం సరదాగా ఆడవాళ్ళతో తిరిగినా కవి కోపంతో "

"అవు. ఎంత త్యాగమేనా చేస్తుంది స్త్రీ. కానీ తన భర్త మాత్రం స్త్రీలోలు డైతే సహించలేదు; మరి రుక్మిణమ్మ గూడా మగవాళ్ళతో నువ్వు చెప్పినట్లు సరదాగా తిరిగితే మీ కోటీశ్వరావు ఏం చేస్తాడేం. "

"చంపేస్తాడు " అరిచింది.

"కానీ ఆ పని రుక్మిణమ్మ చేయలేదు తానుచేసుకుంది...." అంతవాక్యనవ్వింది.

"ఆమె నెంతగా ప్రేమించాడో ! అందుకనే మరి పిల్లల భవిష్యత్తుకోసం, మరి పెళ్ళిచేసుకోవడం మానేశాడు" అంది దీనంగా అత్త.

"అదేం లేదు. పాలు బజార్లో దొరకు తున్నపుడు యెవ్వడూ ఇంట్లో ఆవును పెంచాలనుకోడు. రుచి మరిగిన గొడ్డు అయాచితంగా పదవి రాగానే, డబ్బు రాగానే, అతనికేం కళ్ళు కనిపింపాయా. తన దుర్భర జీవితం గడిపిన మురికి వాడలు గుర్తుకొచ్చాయా.... యిప్పటికీ ఆ మురికివాడలు అట్లాగే వున్నాయి...."

"ఈ సమయంలో యివన్నీ ఎందుకు ఏకరువు పెడుతున్నావు!"

"ఎప్పుడో వొక ప్పుడు శాసనం కావాలి కదా! నూడు! చూడు ఆ గేటవ తల జుత్తు విరగబోసుకుని రాళ్ళు విసురుతూ ఏడుసున్న స్త్రీని చూశావా!"

"చూడ్డమేమిటి! ఆమె పిచ్చి వనజమ్మ కదూ..."

"కదూ ఏమిటి వనజమ్మే. కానీ ఒకప్పుడు పిచ్చి ది కాదు. ఆమెకు కుంద నపు బొమ్మలాంటి ఆడపిల్ల. లంతంత ఆస్తి దాయాదుల పరం కాబోతుంటే, మీ కోటివి ఆశ్రయం కోరింది. ప్రతి ఫలం లేకుండా ఏం చేయడు కదా! ఆమె లొంగిపోయింది. పిల్ల అరుణ బంగారు భవిష్యత్తు కోసం. అప్పటికే అరుణకు పద్దెనిమిదేళ్ల వయస్సు. పిల్ల మెరుగు తీగలా గుండేది నీకు గుర్తుందా !"

"ఊఁ చెప్పు... "

"మీ కోటి కళ్ళు ఆమెమీద పడ్డాయి. కన్నె కలలతో అమాయకంగా అదమరచి నిద్రపోతుంటే వనజమ్మ వదుకునే గదికి గడియ పెట్టి ఆ అమ్మాయిమీద పడ్డాడు. ఊపిరాడ నివ్వలేదు. అప్పటికి బలవం తంగా ఆమె పెనుగులాడి తప్పించు కుని అచ్ఛాదనలేని రొమ్ముల మీద రెండు చేతులుంచుకుని 'మీరు నాకు తండ్రిలాంటి వారు. నన్ను విడిచిపెట్టండి అంకుల్'.... అని ప్రాధేయపడింది."

"అంకుల్ అంటే మామ గూడా అవ వచ్చు గదా!"

"పెడర్థాలు తీయకు. కామానికి దారుణంగా బలై పోతున్న కూతుర్ని కిటికీలో నుండి చూసింది. తల వూచల కేసి బద్దలు కొట్టుకుంది.... ఆ మర్నాడుదయం ఏం జరిగిందో తెలుసా...."

"బంగారు తీగె అడుగు కిర్సనాయిలు పోసుకుని నిప్పంటించుకుని మసిబొగ్గయింది.... ఆ తర్వాత వనజమ్మ కేం జరిగిందో తెలుసా....చెప్పు...."

"..........."

"ఎందుకా మౌనం. కన్నకూతురి శవాన్ని చూసి వనజమ్మ పిచ్చెత్తిపోయింది; యిదే అదననుకొని ఆమె ఆస్తిని కాజేశాడు..."

"ఏం చేస్తాం ఎవరి సొమ్ము ఎవరికి ప్రాప్తమో"

"నిజమే; యిది చాలక, మునిసిపాలిటీ నిధులలో వాటాలూ, ఎంత మంది లేడీ టీచర్లను ట్రాన్సుఫర్లు చేస్తానని బెదిరించి అనుభవించాడో...."

"అది అతని తప్పు కాదు. బలహీనత వాళ్ళలో వుంది. కాదంటావా?...."

"ఎంతకాల మిలా ఆత్మద్రోహం చేసుకుంటూ వాదిస్తావ్...."

"వాదించడానికి వోపిక లేదు. చూడొక్కసారి. కూటికి గతిలేని నిరుపేద. తనకు దొరికిన చిన్న అవకాశాన్ని ఆసరా చేసుకుని ఎంతవాడయ్యాడో.... ఏం చేసి గొప్పవాడయ్యాడని కాదు; ఎంత గొప్పగా బ్రతుకుతున్నాడనేది ఈ యుగసంధిలో కావల్సింది. చూశావా, ఈ మేడ మూడంతస్థుల భవనం. మొజాయిక్ ఫ్లోరింగ్, పాలరాళ్ళతో తయారు చేయబడిన బాత్ రూమ్స్; ఖరీదయిన విదేశీ ఫర్నీచరు, విదేశీ పెయింటింగ్సు, ఐవరీ పెలిఫోన్సు చూశావా. ఆ పూజామందిరం. మన పురాణాలలో వుండే దేవతలు, ఇప్పుడు భూమ్మీద దేవుని అవతారాలని చెప్పుకుని చెలామణి అవుతున్న దేవుళ్ళు అందర్నీ ఆ గదిలో వుంచి సుమధుర పరిమళాలతో ముంచెత్తి పూజించేవాడు"

"నిజమే; మీ కోటి చేసిన పాపాలకు ఏ ఒక్క దేవుడు కోపం తెచ్చుకోలేదు. వాళ్ళను గూడా లంచగాళ్ళను చేసేశాడు .... అవునా...."

"కాదు. కర్మణ్యేవాధికారస్తే...."

"వద్దులే ఆ శ్లోకం. నీలాంటిదే పిరుక్కి బియ్యానికి పొకచే మంత్రం వల్లించిందట .."

"సరేలే ... ఇంకా చూడు యివ ప్పెబ్బై ఉండే గదులు. ఆ కోడళ్ళ మెడలు చూడు తెగ్రిపోతంత బంగారు ఆభరణాలతో.... వాళ్ళ గదులుచూశావా ప్రతీ కొడుకు గదీ ఒక విదేశీ మద్యాల బార్, ఖరీదయిన టేప్‌రికార్డర్లు .... ఇంకా బయటికి రా.... అక్కడ చూడు.... ట్రాక్టర్లు రెండు, కార్లు రెండు....చూడు

జెర్సీఆవులు, గేదెలు, ఆ కంచె ప్రక్కనే గులాబీల తోట.... లోపల ఆవరణలో చూడు జనం ఎలా నిల్చున్నారో...." అని గర్వంగా చెబుతోంది అత్త.

"అవును నిల్చున్నారు! ఎప్పటికీ చావ దేం అన్నట్లు చూస్తున్నారు అతని యిలాకా స్త్రీలందరూ, తమకేమైనా ఆఖరి క్షణాలలో చరాస్తిని ముట్టజెబుతాడా అన్నట్లు చూస్తున్నారు. ఒకరి మీద ఒకరు పగబట్టి త్రాచుల్లా మనసులోనే కొట్టుకుంటున్నారు... "

"వాళ్ళకి తెలియదు. ఇతని ఆస్థిని ముగ్గురు కొడుకుల కూపం చేశాడు" అంది గర్వంగా అత్త.

"నీకు తెలుసునో లేదో మంచి త్రాగుడు మైకంలో వుండగా యితను వుంచుకున్న ఆడవాళ్ళందరూ తలో ఖాళీ స్టాంపుడు పేపర్లమీద సంతకాలు పెట్టించేసుకుని దస్తావేజులు రాయించు కున్నారు...."

"అవీ ఫోర్జరి...." ఖండించింది అత్త.

"ఏమో ఆ సంగతి కోర్టు తేలుస్తుంది. అయినా మన కెందుకు ముందు జరగ బోయేది చూడు. చూడు ఎలా చూస్తు న్నడో మీ కోటేశ్వర్రావు.... చూడు.... చూడు...."

• • •

టేలగా తన హయాంలో కట్టబడిన మూడంతస్థుల మేడ చూస్తున్నాడు కోటే శ్వర్రావు. అలా మూడు రోజుల నుండి చూస్తున్నాడు. అంతకు ముందు అసలే అతని శరీరం వ్యాధుల పుట్ట. తల పండినా తలపులు పండలేదు. లెజిస్లే టివ్ ఎలక్షన్లు వస్తున్నాయి. అధికార పార్టీ టిక్కెట్టుకు హైద్రాబాద్ వెళ్ళాలి. అక్కడ నుండి ఢిల్లీ వెళ్ళాలి.... శాసన సభ్యుడు, ఆ తర్వాత మంత్రి అవ్వాలి.. ఆ తర్వాత ముఖ్యమంత్రి- వీలుంటే కేంద్రంలో స్థానం....చాలా పెద్ద కార్య క్రమాలు బుర్రనిండా పెట్టుకున్నాడు. కానీ యింటికి రాగానే గుండెపోటు ప్రారంభమయింది. నోటమాట పడి పోయింది. డాక్టర్లు టెలిఫోన్ల మీద వచ్చారు; పెదవి విరిచారు.

"డాక్టర్లు గార్లూ! ఈ మహనీయుడి సేవలు యింకా దేశం అందుకోవాలి. ఈయన కోసం ఏం చేయమంటే అది చేస్తాం. ఓ బుల్లి విమానం తక్షణం తెప్పించి మీరు ఏ దేశం తీసుకెళ్ళమంటే ఆ దేశం తీసికెడతాం.... అంతేకానీ ఈ పుణ్యాత్ముణ్ణి మాకు దూరం చేయ కండి... " అని ప్రాధేయపడ్డారు భజం త్రీలూ, వూళ్ళో గోముఖవ్యాఘ్రాలూ.

"ఏమండోయ్ యిలా రండి" అంది పెద్దకోడలు భర్తను పిలిచి.

"ఎందుకు పిలిచావే.. " అన్నాడు గాభరాగా.

"ఏంలేదండీ! మీ నాన్నగారు చావడం ఖాయం. మా నాన్నగారికి టెలిఫోన్

చేసి తెప్పించండి. యిప్పుడే అస్థులు రామకోవాలి లేకపోతే ప్రమాదం. మీ నాన్నగారి యిలా కాలో ఎంతమంది ఆడవాళ్లున్నారో...." అంది. మిగతా కోడళ్లు యిద్దరూ గూడా తమ తల్లి దండ్రులను తెప్పించుకున్నారు. అందరూ పెదాలమీద సభ్యతకోసం మర్యాద నటిస్తూ లోపల అవకాశం దొరికితే అణిచేద్దామన్నట్లుగా చూస్తూ ఆ యింట్లో ప్రవర్తిస్తున్నారు.

దస్తావేజులు తయారయ్యాయి.

"నేను బ్రతికుండగానే నా ఆస్థిని పంచేసుకుందా మనుకుంటున్నార్రా...." అని అరవాలనుకున్న కోటీశ్వర్రావు లేక గుండె గొంతుకలోనే కొట్లాడింది. పెద్దకొడుకు బలవంతంగా సంతకం పెట్టించాడు.

ఆ సాయంకాలమే డాక్టర్లు పరిస్థితి విషమిస్తోందని చెప్పారు.

"అల్లుళ్ళూ! మీ నా న్న గా రు ఈ మేడలో చనిపోతే అరిష్టం పడుతుం దయ్యా" అన్నారు మామలు ముక్త కంఠంతో.

"అవును బాబూ!" రా బో యే ధనిష్టాపంచకాలు కూడాను. ...."అన్నాడు అప్పుడే పిలిపించబడిన పురోహితుడు.

"అయితే ఏం చేద్దాం" అన్నాడు రెండో కొడుకు.

"చేసేదేం లేదు. గుమ్మం అవతల పడెయ్యటమే...." అన్నాడు మొదటి వియ్యంకుడు.

"క్రింద నేలా పడుకుంటాడు. ఒళ్ళంతా నొప్పులు పుట్టదూ! డన్‌లప్ బెడ్ తెస్తాను" అంటూ చిన్నకొడుకు లోపలకి వెళుతూంటే-

"నీకేం మతిపోయింది మరిదీ! పది హేను వందలు ఖరీదుచేసే డన్‌లప్ బెడ్ ఆయన చస్తే చాకలివాడు తీసు కుంటాడు..." అంది పెద్ద కోడలు పక్కకి పిలిచి.

"పరుపులూ గిరుపులూ యేం వెయ్య గూ డ ద య్యా అల్లుడూ! దానిమీద మీనాన్న ప్రాణంపోతే స్వర్గానికి బదులు నరకానికే పోతాడు. ఇంతకాలం చేసిన పుణ్యం వృధా అయిపోతుంది...." అని అపాడు

ముగ్గురు వియ్యంకులూ, ప్రజల సొమ్ము అనేక రూపాల్లో తిని తెగబలిసిన కోటీశ్వర్రావు భారీ శరీరాన్ని బయటకు తెచ్చి వరండాక్రింద గచ్చుమీదపడేశారు.

"ఒరేయ్, ఇది నా మేడరా! నేను కట్టించుకున్నానురా! చివరకు నా మేడలో నేను చా వ డా ని కి గూడా హక్కు లేదర్రా...." కోపంతో నిస్పృహాయమైన చూపుల్తో బయట పరచిన పంచమీద పడవేసిన కోటీశ్వర్రావు మదనపడుతు న్నాడు. ఎండ పడకుండా రెండు దుప్పట్లు కట్టారు. డాక్టర్లు వస్తున్నారు. పోతున్నారు. ఎప్పటికీ చావదేం అన్నట్లు విసుగు చూపిస్తున్నారు. కోటీశ్వర్రావు

దృష్టి వాళ్ళచ్చే మందులమీద లేదు. ఆ మూడంతస్థుల అధునాతనమైన మేడ మీదే వుంది. అతను విపరీతమైన బాధ పడిపోతున్నాడు అతన్ని ఒకవేపు తిప్పి చూస్తే చూసినవాళ్లకి మూర్ఛ తప్పదు. అతని వీపంతా పురుగులు కొరికేశాయి; చుట్టూ కలరా వుండలా, ఫినాయిలు వాసన. మేడ లోపల గదుల్లో, కొడుకులు ఎవరి మావల్తో, బంధువుల్తో త్రాగుతూ, రాబోయే అస్థుల వివరాలు, తండ్రి తర్వాత వారసత్వంగా సంక్రమించాల్సిన పదవులు వీటన్నిటి గురించి బేరీజులు వేసుకుంటున్నారు.

"ఎప్పుడూ నీ శరీర సౌఖ్యాలు, నీ ఆనందాలు, నీ పదవులు, వాటిని కాపాడుకోవడానికి సామదాన భేద దండోపాయాలు వాటిలోనే జీవితమంతా మునిగిపోయావు. నీ పిల్లలకి ఎప్పుడైనా ప్రేమలు, ఆప్యాయతలు, అభిమానాలు, సెంటిమెంట్లు ఎలా వుంటాయోచెప్పావా? అందమైన దివ్య భవనాన్ని కట్టించావు గానీ మమతానుబంధాలు, మానవతా దృక్పథం గల బంగారు కుటుంబం తయారుచేసుకున్నావా? చేసుకుంటేయివాళ నీ కీ గతి పట్టేదికాదు. సమాజానికి చీడపురుగుల్ని తయారు చేశావు" అని అంతరాత్మ నిరసించిన సంగల్లో ఘోషించింది.

మూడో రోజు దాటుతోంది.

"అంతిమ క్షణాలు సమీపించాయి" అన్నారు డాక్టర్లు వూపిరి పీల్చుకుంటూ, వెక్కుతున్న రోగిని చూసి.

"కానీ చావడేం" అన్నట్లు చూశారు ముగ్గురు కొడుకులూ భార్యలతో పాటు. ఇంతలో పెద్దల్లుడ్ని సంజ్ఞచేసి పిలిచాడు లోపలికి.

"అల్లుడూ తాళాలువేయి యినప్పెట్టెల గదులకి" అన్నాడు కొత్త తాళంకప్ప చేతిలో పెట్టి.

కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు పెద్దకొడుకు, మామ వంక. మరో క్షణంలో ఆ నాలుగు గదులకు మూడేసి తాళం కప్పలు వ్రేలాడాయి. ఎవరు మాత్రం తక్కువ తిన్నారు. అక్కడికక్కడే అంతర్యుద్ధం ప్రారంభమయింది.

"ఏమిటిది అవతల మనిషి ప్రాణాలు పోతూంటే మీరిక్కడ ఘర్షణ. బాగుండదు. పదండి" అన్నాడు యింటికొచ్చిన దూరపు చుట్టం.

"కాశీ గంగ వుంటే తెప్పించండి బాబూ, అవసానదశ ప్రాప్తించేసింది. శ్రీరామ....రామ... "అంటున్నాడుపురోహితుడు.

చిన్న కోడలు పూజామందిరంలోకి వెళ్ళింది. యిదివరలో మామగారు చేసిన పాపాలు ప్రక్షాళనం చేసుకుందికి కాశీ రెండు మూడుసార్లు వెళ్ళాడు. అప్పట్లోనే వెండి బిందెనిండా కాశీ గంగ సీలుచేసి పూజామందిరంలో వుంచారు. దాని



పీలు కత్తిపీటతో కన్నం చేయబోతూంటే పెద్దకోడలు వచ్చింది.

"ఏమిటి చెల్లీ అది. నిక్షేపం లాంటి బిందెలో గంగను పాడుచేస్తున్నావు!"

"అదికాదు. మామగారికి" అర్ధోక్తిలోనే ఆగింది.

"మిగతా గంగ పాడయిపోదూ"

"మరెలా" అంది అమాయకంగా ముఖంపెట్టి.

"మన కొళాయి నీళ్ళే తీసికెళ్దాం పద. కాశీ గంగో కాదో అని ఎవరైనా పోల్చారా చచ్చారా" అంటూనే సిల్వరు గ్లాసులో నీళ్లు తీసికెళ్ళింది. విస్మయంగా అనుసరించింది చిన్న కోడలు.

బయట జనం ఒక్కసారి గొల్లుమన్నారు. కాశీ గంగ అనబడే కుళాయి నీరు కోటీశ్వర్రావు గొంతు దిగలేదు. అన్ని పార్టీలవాళ్ళూ మృతశరీరానికి పూలదండలు వేశారు. ఖరీదయిన పూదొత్తులు వెలిగింపబడ్డాయి.

"మిగతా సన్నాహాలు కానివ్వండి" అన్నాడు పెద్ద వియ్యంకుడు. బ్రతికుండగానే కోటీశ్వర్రావు కుళ్ళిపోయి వాసన వేస్తున్నాడు. ఇప్పుడు మరీనూ....

"అయ్యో చప్పున గడ్డి తెప్పించండి పాడె మీదకి" అరుస్తున్నాడు పురోహితుడు. పాలేరు పరిగెత్తారు సాలలోకి. ఫోటోగ్రాఫర్లు కెమేరాలు సర్దుకుంటున్నారు.

చొప్పగడ్డిని తీసుకెళ్తున్న పాలేరును అడ్డేసింది రెండో కోడలు.

"నీకేం పోయేకాలంరా పచ్చవి

యింట్లో గడ్డి తీసుకెళ్ళి శవం కింద వేస్తున్నావు. అమ్మో.... అమ్మో.... యింకేమయినా వుందా పిల్లలుగల వాళ్ళం ... ఛీ.... ఛీ.... వీధిలో ఎవరిదగ్గరయినా అడుగు...." అని వాడి చేతిలోది లాక్కొని గడ్డివాముమీద విసిరేసింది.

"మరి పైవాళ్ళకి మాత్రం పిల్లా జెల్లా వుండరమ్మగోరూ..." అని అందామనుకున్న పాలేరు మాటలు గొంతుకలోనే వుండగానే పసిగెట్టాడు.

* * *

"బ్రతికివుండేటప్పుడు కోటీశ్వరరావు సమాజాన్నీ, సంపదనూ, సదనీ, మంచితనాన్నీ కాకుండా సర్వాన్ని సంపాదాల్ని దోపిడీచేశాడు. జయించానన్న గర్వంతో ఇప్పుడు ముంచుకొచ్చిన మృత్యువుని జయించమను. ఆయుష్షును దోపిడీచేసుకోమను..." గట్టిగా అరిచింది, అంతరాత్మ.

"చివరకు నీ మాట ప్రకారమే విడిచేశాను" అంది ఆత్మ.

"విడిచిపెట్టకేం చేస్తావు. ప్రాణంలేని కట్టె, కట్టెలు కాల్చబోయే కట్టెలో వుండి ఏంచేస్తావు. చూశావా ఏం జరిగిందో జీవితానికి. అందమయిన మేడ కట్టించుకున్నాడు. కానీ అందులో హాయిగా చివరి వూపిరి పీల్చుకోలేకపోయాడు. ఎన్నో భూములు సంపాదించి వ్యవసాయం చేయించి పండించాడు. చివరకు తన ఆస్తిలో గడ్డిపరక ముక్క కూడా శవం క్రింద వేయనివ్వలేదు. ఒక కోటీశ్వరరావు జీవితమే కాదు ప్రతివాడి జీవితమూ అంతే. జాతస్య మరణం ధృవం. అయితే అయ్యో! ఒక మంచి వ్యక్తి చనిపోయాడే అన్న మనోవేదనతో ఏ ఒక్క కన్నీటిబొట్టు విడిచినా ఆ జీవితం ధన్యాతి ధన్యమయ్యేది. స్వర్గ ప్రాప్తి లభించినంతగా తృప్తి కలిగేది...."

"అయ్యో! శవాన్ని పాడెమీద పెట్టారు..."

"ఎవరు మోస్తున్నారో చూశావా. కన్నకొడుకులు కాదు. కంపును భరిస్తూ కిరాయి మనుషులు మోస్తున్నారు ఆ కుళ్ళిన శవాన్ని..."

ఆత్మ అంతరాత్మలు మధ్య క్షణం సేపు నిశ్శబ్దం.

"ఇంకెందుకూ పద." అంది అంతరాత్మ.

ఆశ్చర్యంగా చూసింది ఆత్మ.

"ఎక్కడికి...."

"మరో ప్రస్థానానికి."

---



# కాంప్లెక్స్

ఇచ్ఛాపురపు రామచంద్రం

గడియారంవేపు చూస్తూ కూర్చున్నాను.

నా ఓటమి కింక పావుగంట వ్యవధి మాత్రమే ఉంది. ఔను. నేనూ మనిషినే. నా సహనానికి హద్దులున్నాయి. సైకియాట్రీ చదివిన నేరానికి యీ మూడు నెలలనుంచీ నే ననుభవిస్తున్న శిక్ష తక్కువేమీ కాదు. సాయంత్రం నాలుగయ్యేసరికి రూము తలుపు తెరవడమూ- ఒంటరిగా గదిలో కూర్చుని- ఎవరైనా వస్తారేమో అని ఆశగా ఎదురుచూడడమూ- ఏడుగంటలయ్యాక నీరసంగా తలుపులు మూసుకుని వెళ్లడమూ. బోర్డు కట్టాక- నేనొక చేదునిజం తెలుసుకున్నాను. ఈ మనుషులకి సూదిమందుల డాక్టర్లతోనే తప్ప సైకియాట్రిస్టులతో కొత్తగా అవసరం ఉండదని. జనరల్ మెడిసినో, సర్జరీయో చదివితే నా అదృష్టం మరోలా ఉండేది. బోర్డు కట్టి మూడునెలలయినా ఒక్కరూ రాలేదంటే- యిక చెప్పడానికేముంది? పేషెంట్లు లేక పోవడంకంటె డాక్టరుకి అవమానం ఏముంటుంది?

ఈ చివరిరోజు... మరోపావుగంట... అంతే. సైకియాట్రిస్టుగా ఓడిపోయి మరో అవతారం ఎత్తే ప్రయత్నాలు ప్రారంభిస్తాను.

"బాబూ."

ఆశగా చూశాను అటువేపు.

ప్చ్... సూదిమందు కేసే. మనిషిని చూస్తేనే తెలిసిపోతూంది, నాకోసం వచ్చి ఉండడని. అతను- ఒక ఉత్తరం అందించాడు. కవరుమీద అడ్రసు నాదే. మూర్తి- సైకియాట్రిస్ట్. ఆశగా ఆత్రుతగా చదివాను

"డాక్టర్!... దయచేసి వీడితో రండి. మీతో ముఖ్యమైన పనుంది." అంతే ఉత్తరం.

ఉత్సాహంగా బయలుదేరాను రూము లాక్‌చేసి. రోడ్డుమీద- నాకోసం కారు!

పది నిముషాలలోగానే నేనొక బ్రహ్మాండమయిన భవనం చేరుకున్నాను.

వివరంగా తెలియదు కానీ అది జమీం దారులదని విన్నాను.

నౌకరు నన్నొక గదిలోకి తీసుకు వెళ్లాడు. ఒక గోడమీద పులిబుర్ర.. మరోదానిమీద లేడికొమ్ములు.. ఒకపక్క పాతకాలపు చిత్రాలు... పైకప్పుకు వేలాడుతున్న చాండ్లియర్.. ఆ గది విలక్షణంగానే ఉంది. సోఫాలో- భారీ విగ్రహం.. నన్ను చూసి కొంచెం కదిలింది.

"నా పేరు రాజా బహదూర్ రంగారావు."

"నమస్కారం. నేను- మూర్తి.... సైకియాట్రిస్ట్."

"కూర్చోండి.. మీతో ఒక విషయం మాట్లాడాలి"

నౌకరు- ట్రేతో టీలు తీసుకువచ్చాడు.

"మా ఏకైక పుత్రిక యశోధర. చాలా చక్కనిది. కొంచెంసేపట్లో చూద్దురుగాని. ఆమె వయసు ఇరవై. ఆమెకు పెళ్లి చేయాలని మా సంకల్పం.."

"మంచిది.."

"ఈ ఫోటోలు చూడండి-" దగ్గరగా ఉన్న టేబులుమీది ఆల్బమ్ అందుకుని చూపారు. ఆరేడుగురు యువకుల ఫోటోలున్నాయి ఆల్బమ్‌లో. రూప వయోలావణ్యాలలోనే కాకుండా మిగిలిన కోణాలనుంచి కూడా వాళ్లందరూ జమీందారుకి అల్లుడు కాగలిగే యోగ్యత ఉన్నట్లే అనిపించారు.

"అందరూ- ఎవరికి వారే చాలా యోగ్యులు. వచ్చి యశూని చూశారు. అందరికీ మా యశూ నచ్చింది. కాని- దురదృష్టమేమిటంటే- యశూ కెవరూ నచ్చలేదు" భారంగా మారిపోయిందాయన గొంతు.

"ఎందుకని?"

"అదే మీరు తెలుసుకోవలసింది."

నిరాశ కలిగింది నాలో. నేను చేయవలసింది సైకియాట్రీ కాదు, పెళ్లి రాయబారం!

నా వృత్తి అది ఎంతమాత్రమూ కాదు.

లేవబోయాను.

"దయచేసి కూర్చోండి. యశూ మనసు సరిగా లేదేమో అని నా అనుమానం—"

ఈ సారి నాలో ఉత్సాహం వచ్చింది.

"ఆమె మనసు మీరు సరిచెయ్యాలి. ఔను. జరిగిన సంఘటన- చిన్నదేమీ కాదు" నిట్టూర్చారాయన

"ఏం జరిగింది?" ఆత్రంగా అడిగాను.

"మూడునెలలౌతుంది.. అమ్మాయీ నేనూ ఆగ్రా వెళ్తున్నాం, ఫస్ట్‌క్లాస్‌లో. యశూకి ఏసీ యిష్టముండదు. మా ఎదుట సీటు ఖాళీగా ఉంది. తరువాత ఎక్కడో అది నిండుతుందని చెప్పాడు అటెండెంట్.

నేను నిద్రపోయాను త్వరగానే. యశూ ట్రాన్సిస్టర్ పెట్టుకుంది. ఆమెను



కూడా త్వరగా పడుకోమని నేను నిద్ర లోకి జారిపోయాను. ఎంతసేపు నిద్ర పోయానో తెలియదు.

కెవ్వున కేక. తృళ్లిపడి లేచాను. కంటపడిన దృశ్యం... కోపం తెప్పించింది.

అమ్మాయీ, అతనూ ఎదురెదురుగా నిలబడి ఉన్నారు.

యశూ కళ్లు అగ్నికణాలు కురిపిస్తున్నయ్. అతను- వాడు- దోషిలా తల వంచుకుని నిలబడ్డాడు.

"ఏమైంది యశూ?"

"ఈ బ్రూట్ నన్ను బుగ్గమీద...."

"రాస్కెల్!" అంటూ వాడిమీదకు లంఘించాను. ఎన్ని దెబ్బలు కొట్టానో పిచ్చికోపంలో నాకే తెలియదు. వాడు ఎదురుతిరగలేదు. నా దగ్గర ఆ క్షణంలో తుపాకి ఉంటే వాడినక్కడే షూట్ చేసేవాణ్ని. అంత కోపం వచ్చింది. ఒక జమిందారుగారమ్మాయిమీద అత్యాచారం తలపెడతాడా! ఎన్ని గుండెలు.

కోర్టుకీడ్చి వాడికి బుద్ధొచ్చేలా జైల్లో పెట్టించాలని అడ్రస్ సంపాదించాను. ప్రయాణం మధ్యలోనే వెనక్కి వచ్చే

కాము. లాయర్‌తో సంప్రదించగా- జరిగిన విషయం వంశగౌరవాన్ని పెంచేదికాదనీ దానిని రచ్చకీడ్చితే మన పరువే బజారుపాలౌతుందని చెప్పాడు. అదీ నిజమే అనిపించి ఆ ప్రయత్నం మానుకున్నాను. యశూకి పెళ్లిసంబంధాలు చూడసాగాను. వరులను రప్పించి యశూకి చూపాను. కాని- ఒక్కరూ ఆమెకు నచ్చలేదు! నా ఉద్దేశం- యశూ మనసు సరిగా లేకనే ఎవరూ నచ్చడం లేదేమో అని."

"కావచ్చు." అన్నాను సీరియస్‌గా ఆలోచిస్తూ.

"వెళ్లి- యశూని చూసి- మాట్లాడి రండి."

నౌకరు నన్ను మేడమీద గదిలోకి తీసుకువెళ్లాడు.

"రండి... నమస్కారం-" అద్భుతమయిన అందం ఆమెది. కళ్లు చెదిరాయొక్కసారి.

"నమస్కారం.....నేను-" ఏం చెప్పాలా అని సందేహించాను.

ఆమె నవ్వుతూ- "నాకు తెలుసు. మీ రెందుకు వచ్చారో, మీరెవరో అన్నీ తెలుసు." అంది.

"థాంక్స్. నాకు చాలా శ్రమ తగ్గించారు. యశోధరా!.... మనం కొంచెం మాట్లాడుకుందాం...."

"అలాగే చెప్పండి. ఉండండి.." అంటూ నౌకరుని టీ తెమ్మని పుర్మా యించింది.

"రోజులు మారిపోతున్నాయి. ప్రపంచం మారిపోయింది. మనుషులలో మానవత్వం క్రమంగా నశించిపోతూంది. మానభంగాలు, హత్యలు, దోపిడీలు.. సజీవ దహనాలు.. పేపరు తిప్పితే దాని నిండా యివే. ఏమంటారు!"

"ఊఁ."

"ఏ విషయాన్నయినా సీరియస్‌గా తీసుకుంటే- బ్రతకడం కష్టం. మారే ప్రపంచంతో మనమూ మారాలి. పరిస్థితులకి, వాతావరణానికి సర్దుకోడం నేర్చుకోవాలి. లేకపోతే క్లిష్టమౌతున్న యీ ప్రపంచంలో బ్రతకడం బహు కష్టం. ఏమంటారు!"

"నిజమే."

"చూడండి.. మీ నాన్నగారికి మీరంటే చాలా ప్రేమ-"

"ప్రాణమే."

"ఆయన మీకు చాలా చక్కని సంబంధాలు తెచ్చారు. వీళ్లలో చక్కని పర్సనాలిటీ కల యువకులున్నారు. మీకు తగినవారు కాదనుకోను. అవి- చాలా మంచి సంబంధాలు."

"ఔను."

"కాని, మీకు వారిలో ఒక్కరూ నచ్చలేదు!"

"అది కాదు. వాళ్లలో ఒక్కరికీ నేను నచ్చినట్లులేను."




"అదేమిటీ! మీ నాన్నగారు మరోలా చెప్పారే!" ఆశ్చర్యంగా చూశాను.

"ఎవరు చెప్పింది నిజమో మీరే తేల్చుకుందురుగాని. ఆ వేళ- రైలు పెట్టెలో జరిగినది మీకు వివరంగా తెలుసా?"

"నాన్నగారు చెప్పారు—"

"ఆయన చూడని- అసలు విషయం నేను చెబుతాను. వింటారా?"

"తప్పకుండా. చెప్పండి." కుతూహలంగా చూశాను

"మొదట- నా ప్రశ్నకు జవాబు చెప్పండి. నేను అందమైన అమ్మాయి నేనా?"

"మీది- మామూలు అందం కాదు. చాలా అరుదైన... అద్భుతమయిన సౌందర్యం."

"పెళ్లిచూపులకు వచ్చిన యువకులలో ఒక్కరూ యీ మాత్రపు మాటయినా అనలేకపోయారు, ఏకాంతంలో కూడా."

"అందానికి మీటర్ లేదు, ఎదుటివారి హృదయం తప్ప. భావం అంతటినీ ప్రకటించేందుకు భాష చాలదు చాలా సమయాల్లో. పెళ్లికొడుకుల విషయంలో అదే జరిగుంటుంది."

"భావప్రకటనకు భాషకు మించిన సాధనం ఉంది. ఎమోషన్... యాక్షన్..."

నిరుత్తరుడినయ్యాను. ఈ అమ్మాయి అందమైనదే కాని అమాయకురాలు కాదు.

"నా ఉద్దేశంలో- నేను- జగదేక సుందరి క్లియోపాత్రా కోవలోకి చేరే సౌందర్యవతిని."

"నిస్సందేహంగా." అనేశాను. అందుకు నేనేమీ ఆత్మవంచన చేసుకోవలసిన అవసరం లేకపోయింది. నిజంగా ఆమె చాలా అందమైనది.

"రైలుపెట్టెలో-

నైట్ డ్రెస్‌లో నిద్రపోతున్నాను. హటాత్తుగా మెలకువ వచ్చింది ఎవరిదో

స్పర్శతో. లేచి- కోపంగా చూశాను.

"క్షమించండి. మీరు ఆకుపచ్చ సిల్కు-లో వనసుందరిలానే కనిపించారు. మీ వదనం వికసించడానికి సిద్ధమౌతున్న గులాబి మొగ్గలాగే కనిపించింది నీలి దీపపు కాంతిలో- మీ నిరుపమాన సౌందర్యం నన్ను విభ్రాంతుణ్ని ఉన్మత్తుణ్ని చేసింది. అందుకే మీ ముఖాన్ని చేతులలోకి తీసుకుని, మీ బుగ్గలమీద ముద్దుపెట్టుకోకుండా ఉండలేకపోయాను-"

నేను ఆ క్షణంలో మూర్ఖుగాలినీ, ముందుచూపు లేనివాడినీ కాకపోతే అనవసరంగా గోలచేసి నాన్నగారిని లేపి ఉండేదాన్ని కాను."

తెల్లబోయాను. యశోధర మాటల తర్థమేమిటి?

"అతని పేరు చక్రవర్తి. నేనెంత పొరపాటుచేశానో తరువాత తెలిసి వచ్చింది. ఎందరో యువకులు నన్ను చూశారు కానీ ఎవరూ చక్రవర్తిలా నా సౌందర్యానికి తగిన అభినందనలంద జేయలేకపోయారు. వీళ్ల కనులు సౌందర్యానికి స్పందించే హృదయమే లేదేమో అని నా అనుమానం-"

మెల్లగా యశోధర అర్థమౌతూంది.

ఆమె చిత్రమయిన అంతర్యం కటతెల్లమౌతూంది.

"నా సౌందర్యాన్ని నిజంగానూ చక్కగానూ చూడగలిగిన యువకుడు చక్రవర్తే. అతన్ని మరచిపోడం నా తరం కాదు. ఇంతమంది 'పెళ్లికొడుకులలోనూ ఒక్కరూ చక్రవర్తికి దగ్గరగా ఐనా రాలేకపోయారు దురదృష్టవశాత్తూ."

పూర్తిగా అర్థమైపోయింది.

యశోధర అందానికి సరయిన అభివందన నందించగలిగినవాడూ, ఆమె అహాన్ని తృప్తిపరచగలిగేవాడూ చక్రవర్తే. ఆమె మనసు అతనిమీదే లగ్నమయింది.

"కాని.. యశోధరా... మీ నాన్నగారికి చక్రవర్తి అంటే చాలా కోపం."

ఆమె నవ్వింది. "చూడండి.. మీరు నా అందాన్ని చూస్తూ ఆనందించేరా?"

దొరికిపోయిన దొంగలా తలవంచుకుని- "ఊఁ." అన్నాను ఒప్పేసుకుంటూ.

"ఓ చక్కని అమ్మాయి సమస్యను పరిష్కరించగలిగితే- మీకు గర్వంగానూ, తృప్తిగానూ అనిపించదూ?"

అప్రతిభుడినై- "ఔను. ప్రయత్నిస్తాను... తప్పకుండా..." అంటూ కదిలాను జమీందారు గదివేపు.

జరుగుతున్న చిత్రమయిన నాటకంలో నా పాత్ర ఏమిటో నాకే అర్థం కావడంలేదు. సైకియాట్రీ పుస్తకాలు మళ్లీ తిరగెయ్యాలనుకున్నాను మనసులో.

———

## సీరియల్

# అగ్నిశిఖ

### వాసిరెడ్డి సీతాదేవి

(గతసంచిక తరువాయి)

"చిత్తూరు కనకం నాకు అనసూయ అని పేరు పెట్టింది."

"లే! నోరుమూసుకొని పద!" రెక్కపట్టుకొని లాగాడు పాపారావు.

భావన ఉసిగా పాపారావు చేతిమీద కొట్టింది.

"వదులు" పిచ్చిగా అరిచింది.

పాపారావు చెయ్యి వదిలేశాడు.

నాగమణి విస్మయంగా చూస్తూ కూర్చుంది.

"అక్కడ్నుంచి ఈ అయ్య నన్ను కొనుక్కొచ్చాక..."

భావన పాపారావునూ నాగమణినీ మార్చిమార్చి చూసింది.

"నా పేరు పావిత్రి అని పెట్టారు. వీళ్లు ఇలాంటి పేర్లు పెడ్తారా అండీ- మరేమో వోలీవోళ్లు- మీకేం పొయ్యేకాల మొచ్చిందే ముండల్లారా అన్నీ పతివ్రతల పేర్లే పెట్టుకుంటారని తిడ్తారండీ."

అమాయకంగా చెప్పుకుపోతున్న ఆ పిల్లను చూస్తుంటే హిరోషిమా, నాగసాకిలో '45లో పడినట్టు ఈ దేశంమీద కూడా ఏ హైడ్రోజన్ బాంబో ఒక్కసారిగా పడ్తే బాగుండుననిపించింది.

"నువ్వు ఎక్కడుంటున్నావ్?"

"అదంతా నీ కెందుకే భావనా?" తల్లి కసిరినట్టుగా అన్నది.

ఆ పిల్ల జవాబు చెప్పలేదు. చెప్పడం ఇష్టంలేక కాదు. తను ఉండేది ఎక్కడో కూడా తెలియనట్టుగా ఉంది ఆ వాలకం చూస్తుంటే.

"ఇక్కడి కెందుకొచ్చావ్?"

ఆ పిల్ల ఆశ్చర్యంగా భావన ముఖం లోకి చూసింది.

'నీకు ఇంతమాత్రం తెలియదా?' అని జాలిగా చూసినట్టుగా తోచాయి భావనకు సావిత్రి చూపులు.

"ఆ బాబు...."

పాపారావు చెయ్యిపట్టుకొని బరబర ఆ పిల్లను బయటికి ఈడ్చుకుపోయాడు. తల్లి భావనను పట్టుకొన్నది. భావన పెనుగులాడింది కాని తల్లి పట్టునుంచి విడిపించుకోలేకపోయింది.

పాపారావు ఆ పిల్లను రిక్షా ఎక్కించి పక్కనే తనూ ఎక్కి కూర్చున్నాడు.

తల్లి భావనను వదిలేసింది.

భావన తల్లిముఖంలోకి చూసింది.

ఆమె అపరాధిలా దిక్కులు చూడ సాగింది.

"నువ్వు కాలేజీనుంచి ఇంత త్వరగా వస్తావనుకోలేదు." తలవంచుకొనే వంగి వంగిగా అన్నది నాగమణి.

"అంటే నేను లేనప్పుడు రోజూ ఇక్కడ——"

"అబ్బెబ్బె! అలా లేదమ్మా! ఈ అబ్బాయి అక్కడకు వెళ్ళనన్నాడు. వెయ్యి రూపాయలదాకా ఇస్తానన్నాడు—"

"ఛీ! ఇక మాట్లాడకు."

గిర్రున తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది.

మంచంమీద పడబోయి ఆగి చూసింది. పక్క నలిగి ఉంది.

కసిగా ఆ బట్టలు తీసి బయటికి గిరాటు వేసింది.

తను పడుకొనే నులకమంచం తీసి బయటపారేసింది.

తల్లి చూస్తూ ఉండిపోయింది.

తలుపు బిగించుకొని నేలమీద పడుకొన్నది.

శరీరం అలసిపోయింది.

బుర్ర అలసిపోయింది.

శరీరానికి కదిలే శక్తి లేదు.

బుర్రకు ఆలోచించే శక్తి లేదు.

కళ్ళు మూసుకొని పడుకొన్నది.

కొంతసేపటికి కళ్ళు తెరిచింది. టైంపీసు ఆరున్నర చూపిస్తున్నది.

గబగబ లేచి పెట్టె సర్దుకొని బయలుదేరింది.

తల్లి భావనను చుట్టుకొని బావురుమన్నది.

భావన "ఛీ! నన్ను ముట్టుకోకు!" అసహ్యించుకుంది.

నాగమణి గోడకు తల బాదుకొంటూ ఏడవసాగింది.

"నువ్వు చదువుకున్నావ్! నువ్వు పెరిగిన వాతావరణం వేరు. నా గురించి ఆలోచించు. నేను ఎక్కడ పుట్టాను? ఎలా పెరిగాను? నా బిడ్డను గొప్పదాన్ని చెయ్యాలని ఎన్ని ఊహించాను? మీ నాన్నగారుండగా నేను ఎలా ఉండే దాన్నో ఒక్కసారి ఆలోచించు. ఇప్పుడు— ఇప్పుడు— నేను ఏంచెయ్యను?




నువ్వు ఈ గడపదాటిన క్షణం నేను గొంతు కోసుకొని చస్తాను." మళ్లీ గోడకు తల బాదుకుంటూ పిచ్చిగా ఏడవ సాగింది.

భావనశిలా ప్రతిమలా ఉండిపోయింది.

తల్లిని వారించాలని లేదు.

గిర్రున తిరిగి గదిలోకి వెళ్ళిపోయింది.

పెట్టె పక్కనపెట్టి నేలమీద వాలిపోయింది.

నిద్రేపోయిందో, స్పృహే పోయిందో తెలియని స్థితిలో ఉండగా తల్లి వచ్చి కుదిపి లేపింది.

చేతిలో కాఫీ కప్పుతో నిల్చుని ఉంది తల్లి. తల్లి ముఖంలోకి పరిశీలనగా చూసింది.

పచ్చటి ముఖం. పెద్ద కుంకంబొట్టు. ఉప్పాడ జరీచీరలో హుందాగా, దాబా ఇంట్లో తిరిగి పనిచేసుకొంటూ ఇంటికే వెలుగులా ఒకనాడు కన్పించిన తల్లి రూపం కళ్లల్లో మెదిలింది.

ఇప్పుడో- ఆ ముఖంలో అపవిత్రత లేదు. కళ్లు పీక్కుపోయి, ముఖం పాలిపోయి, తమలపాకులతో గారపట్టిన పళ్లతో, నల్లపడిన పెదవులతో, చౌకబారు సిల్కుచీరలో సినీమాల్లోని వేశ్యమాతలా....

అయినా ఆమె ఒక తల్లి! తన తల్లి!

ఒకనాడు తనకు నీతికథలూ- పతివ్రతల కథలూ చెప్పి నిద్రపుచ్చిన తల్లి-

తనను డాక్టర్ను చెయ్యాలనీ, కలెక్టరుకు పెళ్లాన్ని చెయ్యాలనీ కలలుకన్న తల్లి-

కాని ఈనాడు ఇలా....

"కాఫీ!"

తలెత్తకుండానే తల్లి చేతిలోనుంచి కాఫీ తీసుకున్నది.

"అమ్మా! భావనా!"

"నాతో మాట్లాడకు. నా కేమీ చెప్పకు. లేకపోతే వెళ్ళిపోతాను."

"మళ్ళెప్పుడూ ఈ ఇంట్లో... "

చేతిలోని కాఫీకప్పు గోడకుపోయి కొట్టుకుని ముక్కలుగా చెల్లాచెదరైంది.

"ఆ చచ్చినోడికి ఎన్నో చెప్పానమ్మా... "

"అదిగో మళ్ళీ.... ఆ సంగతి ఎత్తవద్దు."

నాగమణి పింగాణీ ముక్కలు ఏరి పారేసింది.

మరో పదినిమిషాల్లో కాఫీకప్పు ఉన్న చేతిని ముందుకు చాపింది.

ఆ తల్లి ముఖంలో కోపం లేదు.

ఏ భావమూ లేదు.

భావన కప్పు అందుకుంది.

నాగమణి బయటికి వెళ్ళిపోయింది.

భావన కన్నీటిబొట్లు ఆమె తాగుతున్న కాఫీలో పడుతున్నాయి.

* * *

ఆ రాత్రి పాపారావు ఇంటికి రాలేదు.

తల్లి కడుపునొప్పితో మూలుగుతోంది.

భావన తల్లి మూలుగును వినకూడదని చెవులు మూసుకున్నది. కాని శరీరంలో ఎన్నో చెవులు మొలిచినట్టు భావనకు తల్లి మూలుగు నరనరానికి సూదుల్ని గుచ్చుతూనే ఉన్నది. అయినా లేచివెళ్ళి పలకరించాలని లేదు.

సంధ్యచీకట్లు కమ్మాయి. లేచి లైటు వెయ్యాలనే ధ్యాసకూడా లేదు.

కొంతసేపటికి తల్లి మూలుగు వినిపించలేదు. భావన చివ్వున లేచి మంచం దిగింది. లైటువేసి బయటికి వచ్చింది. తల్లి జాడ కన్పించలేదు. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి.

ఎక్కడికి వెళ్ళింది?

ఆ బాధ భరించలేక....

ఏ అఘాయిత్యం అయినా చేసుకొంటే?

వీధి తలుపులు తెరిచింది. గడపలో కూలబడింది.

అనేక కళంకలు మనసును చుట్టేస్తున్నాయి.

అలా ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు.

వాకిలిముందు రిక్షా ఆగింది! తల్లి రిక్షాలోనుంచి దిగింది. ఒక చేతిలో సీసా ఉంది. అది నాటుసారా సీసా అని భావనకు తెలుసు. భావన చివ్వున లేచి లోపలకు వెళ్ళింది.

తలుపులు లోపలినుంచి గడియ వెయ్యటం వినిపించింది. మూలుగుతూనే తాగుతున్నట్టు భావన ఊహించింది. కొంతసేపటికి తల్లి మూలుగు ఆగిపోయింది.

"తల్లీ! ఇది తిని పడుకో!" అంటూ

రెండు పొట్లాలు భావన మంచంపక్కన ఉన్న టేబుల్ మీద పెట్టింది నాగమణి.

ఆ పొట్లాలు తీసి తిరిగి వెళ్తున్న తల్లి వీపుమీదకు విసరాలనిపించింది.

మరో అర్ధగంటలో తల్లి గురక విప్పించింది.

ఎక్కడో దూరంలో ఏడుస్తున్న ఒంటరి కుక్క ఏడ్పులా తల్లి గురక భావనకు వినిపించింది. వెన్నెముకలో ఏదో చలి కుదుపులా వచ్చింది

నిద్రపోవడానికి ప్రయత్నించసాగింది. కడుపులో ఆకలితో పేగులు మెలి చుట్టుకుపోతున్నాయి. భావన లేచి పొట్లాలు విప్పి ఆత్రంగా తిని గ్లాసుడు మంచినీళ్లు గటగట తాగింది.

భావనవచ్చి తల్లిని చూస్తూ నిల్చుంది.

తల్లి ముఖంలోకి చూస్తూ నిల్చుంది–ఆమె బాధపడుతున్నా తను పలకరించ లేదు. అంత బాధలోనూ కూతురు ఆకలి గురించి మర్చిపోలేదు. తల్లిప్రేమ అంటే ఇదేనా!

తల్లిమీద ఎక్కడలేని జాలి ముంచు కొచ్చింది. తనమీద తనకే అసహ్యం వేసింది.

కొన్ని బంధాలను వంటిమీది బట్టల్లా విప్పి పారెయ్యవచ్చును. ఒకప్పుడు ఆ బట్టల్ని ఎంత అపురూపంగా చూసు కొన్నా వాటిని పారెయ్యడానికి అంతగా బాధ కలగదు. ఒక్కోసారి రిలీఫ్‌గానే ఉంటుంది.

కాని.... కొన్ని బంధాలు- శరీరం లోని రక్తనాళాలలోని రక్తంలాంటివి. ఆ రక్తం కలుషితం అయినా జీవించి ఉన్నంతవరకూ దాన్ని శరీరంనుంచి వేరుచెయ్యడం సాధ్యం కాదు. అది ఉన్నంతవరకే జీవితం కూడా ఉంటుంది. అలాంటి బంధమేనేమో ఇది?

మరికొన్ని బంధాలు శరీరంమీద ఏర్పడే తామరపొడల్లాంటివి. వాటిని భరించడం దుర్భరం. గోళ్ళతో గీకి పారెయ్యాలనిపిస్తుంది. కాని గీకినకొద్దీ ఆ క్రిములు శరీరంలో ఇంకా లోతుగా వ్యాపిస్తాయి అలాంటి బంధమే ఈ పాపారావులాంటివాళ్ల బంధం

ఇనుపకడ్డీల వెనుక ఉన్న బందీ ఏనాటికైనా వాటిని విరగ్గొట్టి పారిపోగల నన్న ఆశను పెంచుకోగలడు. కాని తను ఈ రక్తమాంసాలతో బంధించ బడిన తను- ఈ బంధాలను తెంచుకొని వెళ్ళగలదా?

మళ్లీ తల్లి ముఖంలోకి చూసింది ఆ ముఖంలో ఎన్ని ముడతలు? ఒక్కొక్క ముడత ఎన్ని జీవిత సత్యా లను తెలియచేస్తున్నదో? తన తల్లికి ఇలా బతకడం ఇష్టమా?

ఆమె వేశ్య. తనో? ఆమె కూతురు?

మనిషి బతకాలి. ఆ బతుకుకోసం ప్రతి వ్యక్తీ పాకులాడతాడు ఎన్నో అన్యాయాలు చేస్తాడు, మోసాలు చేస్తాడు. తనకు కావల్సిన దానికోసం తన దగ్గర ఉన్నదాన్ని అమ్ముకుంటారు. పెద్ద పెద్ద డాక్టర్లు- రోగి ఆఖరుక్షణాల్లో ఉన్నాడని తెలిసీ, డబ్బుకోసం పీల్చు నంత గుంజుతంకోసం తను నేర్చిన విద్యను అమ్ముకోవడంలేదూ?

న్యాయాలయాల్లో జరిగే దేమిటి? న్యాయవాది తన ఫీజు తీసుకొని హంతకుడ్ని నిరపరాధిగా నిరూపించడానికి ప్రయత్నించడంలేదూ? అవసరం అయితే నిరపరాధిని శిక్షించడానికి తన తెలివి తేటల్నీ వాగ్ధాటినీ అమ్ముకోవడానికి ఏ న్యాయవాది ముందుకు రాడు?

నిన్న మొన్నటిదాకా గాడిదలా చాకిరి చేసి రిటైరయిన గుమాస్తా పెన్షన్ పేపర్లు కదిలించడానికి చెయ్యిచాచేవాళ్లు ఎందరు లేరు?

ప్రజల ఆకలి తీర్చడానికి, ప్రజల కడుపులు కొట్టే నాయకులు- పదవుల కోసం- పరువుకోసం- ప్రజాసేవనే వృత్తిగా చేపట్టటంలేదూ?

ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయి?

మనిషి తను సుఖంగా జీవించడం కోసం, తన అవసరాలకోసం, బతకడం కోసం డబ్బును సృష్టించాడు. కాని చివరకు జరుగుతున్నదేమిటి? ఆ డబ్బును సృష్టించిన మనిషే, దానిచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నాడు. తాను జీవిస్తున్నదే డబ్బుకోసం అనే భ్రమలో పడిపోయాడు. డబ్బుకు బానిసగా మారిపోయాడు.

మళ్ళీ తల్లికేసి కన్నార్పకుండా చూసింది.

ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు చూస్తున్నది. ఆమె వదులుగా ఉన్న పొట్ట కొలిమితిత్తిలా ఉబ్బుతూ, ముంచించుకు పోతూ ఉన్నది. అవును అది కొలిమి తిత్తే! సారా అగ్నిలా పనిచేస్తున్నది. ఆమె సారా తాగుతోంది. ఆమె రక్తాన్ని సారా తాగుతోంది.

అలా తల్లిని చూస్తున్న భావన కళ్ళల్లోకి, కొలిమిలా కాలుతున్న తల్లి అగ్ని వేది ప్రవేశించినట్టుగా అయింది. కణకణలాడే బొగ్గుపొయ్యిమీద ఉడుకుతున్న పప్పులా ఆమె కళ్ళలో ఏదో ఉడుకుతోంది పప్పులో పొంగు వచ్చింది. భావన కళ్ళల్లో అగ్నిశిఖలు రెపరెపలాడాయి.

ఈమె ... ఈమె తన తల్లి.... ఈమెను తను అసహ్యించుకుంటోంది. 'అమ్మా' అని పిలవలేకపోతూంది. కారణం?

ఈమె ఇంతకంటే బాగా బతకాలని కోరుకోవటంలేదా? అయినా ఎందుకు ఇలా చేస్తుంది?

ఆకలి.... ఆకలి అన్ని విజ్ఞానాలకంటే గొప్పది. బలవత్తరమైంది. మనిషి ప్రాథమిక అవసరాలముందు, పరువూ ప్రతిష్ఠా, సమాజం, హిపోక్రసీ ఇవన్నీ నిలబడలేవు.

మనిషి ఎంత కృత్రిమంగా మారాడు? తనను తనే మోసంచేసుకోవడానికి వస్తువులకు రంగు వేసి చూటానికి ప్రయత్నిస్తున్నాడు.

మరి తనో! వాస్తవాన్ని గ్రహించ డానికి తన మనసు ఒప్పుకోవటంలేదు

ఈమె.... ఈమె దగ్గర ఏముంది వ్యాపారం చేసి జీవించడానికి?

ఆకలికోసం- జీవించడంకోసం- చావలేక బతకడంకోసం.... తన దగ్గిర పెట్టుబడిగా ఉన్న ఆ శరీరాన్ని అమ్ముకొనే ఆడది చెడిపోయిన ఆడది- మరి శరీరాన్ని కొనే మగవాడు...?

భావనకు బయట ఏదో అలికిడి వినిపించింది. చెవులు రిక్కించి విన్నది. నిశ్శబ్దం! అంతా తన భ్రమ!

తన గదిలోకి వెళ్ళి పడుకొన్నది. లైటు తియ్యాలంటే భయంగా ఉన్నది. కళ్ళు మూసుకొన్నది.

వింత శబ్దం— గోడమీద ఎవరో గోళ్ళతో గీరుతున్నట్టు శబ్దం—

కళ్ళు తెరిచింది.

లేచి కూర్చుంది.

భయం భయంగా గదిని కలయ చూసింది ఎక్కడా ఏ గోడమీదా ఏమీ లేదు.

వీపు వెనక ఉన్న గోడమీద మళ్లా ఏదో జంతువు గోళ్లతో గీరుతున్నట్టు...

భావన ఒక్క ఉదుటున మంచం మీదినుంచి దూకింది. బయటికి పరుగు తీసింది.

దూరంగా కుక్క ఏడ్పు వినిపిస్తోంది.

తల్లి పొట్టమీదగా చెయ్యివేసి, ఆమెను అనుకొని పడుకోవాలనిపించింది. తను చిన్నతనంలో అలాగే పడుకొనేది.

దూరంగా కుక్క ఏడ్పు!

మళ్ళీ వాకిలిముందు ఏదో జంతువు తిరుగుతున్నట్లూ-

తన గదిలో గోడమీద ఎవరో గోళ్ళతో గీకుతున్నట్లు-

నిండా పద్దెనిమిదేళ్ళు లేని భావన జీవితంలో ఏభైఏళ్ల చేమనే రుచి చూసింది. భయం అంటే ఏమిటో తనకు తెలియదనే ఇంతకాలం ఊహిస్తూ వచ్చింది.

కాని ఇవ్వాళ తనకేమైంది!

రాత్రి భయం! చీకటి భయం! బయట చీకటి! లోపల చీకటి!

ఆ చీకటి తెరల్ని చీల్చలేకపోతు న్నది తన తల్లి గుండెల్లో ఎగిసెగిసి పడుతున్న అగ్ని.

మళ్ళీ దూరంగా జంటకుక్కల ఏడ్పు! కుక్కలు ఎందు కేడుస్తాయి? ఎవరైనా చచ్చిపోయేముందు ఏడుస్తా యట.

భావనకు వెన్నెముకలో ఏదో స్పర్శన పాకినట్లు అయింది.

తల్లిని చూసింది.

ఒకవేళ తన తల్లి ఈ రాత్రి....

గబుక్కున తల్లిపక్కన పడు కొన్నది.

తల్లిని అనుకొని పడుకొన్నది.

నాగమణి బరువుగా కళ్లు తెరిచింది.

భావన నడుంపైదగా చెయ్యివేసి దగ్గరకు లాక్కున్నది. భావన తల్లి పొట్టలో దూరిపోయినట్టు ఆమెను అతుక్కొని, ముడుచుకొని పడుకొన్నది. నాగమణి ఏదో అవాలనుకున్నది. కాని ఆ భావం ఏదో కూతురి నడుంమీద ఉన్న చేతిస్పర్శ ద్వారానే అందినట్లుగా భావన మనసుకు తోచింది.

అశాంతిగా ఉవ్వెత్తున లేచిన కెరటం, ఒరిగి తల్లి ఒడిలో ఒదిగిపోయింది. తటం, తటాకాన్ని తన బాహువుల్లోకి తీసుకొన్నది. ఇప్పుడు తటాకానికి దారి తప్పిపోతానని భయంలేదు. చుట్టూ కవచంలా తటం దానిని కాపాడుతున్నది.

మనిషికి మనిషి కావాలి.

భావనకు పాపారావు గుర్తొచ్చాడు.

అతను ఇంట్లోఉంటే ఇలాంటి భయం కలిగేది కాదు. అతను ఏమయ్యాడు?

రేపైనా వస్తాడా?

వస్తేనే బాగుండును!

ఛ! ఇదేమిటి తను వాడు రావాలని కోరుకుంటున్నది?

అతన్ని చేరదీసిన తల్లిని అసహ్యించుకుంటూ వచ్చింది.

అతను చేస్తున్న పని చాలా భయంకరమైనదే!

కాని అతను ఎందుకలా చేస్తున్నాడు? డబ్బుకోసం!

సావిత్రి.... ఆ పిల్ల చివరి పేరు అంటే ఇవ్వాల్టి పేరు సావిత్రే గదూ!

సావిత్రి అలా కావడానికి ఎవరు కారణం?

మనిషి సృష్టించిన డబ్బా?

లేక మనిషిని సృష్టించిన భగవంతుడా?

భగవంతుడు వున్నాడా?

ఉన్నాడో లేడో!

లేడు! ఆ భగవంతుడ్ని కూడా మనిషే సృష్టించాడు. తన స్వార్థంకోసం అమాయకుల్ని భయపెట్టాలి. తన సుఖాలకోసం డబ్బును సృష్టించాడు. ఆ డబ్బును కాపాడుకోవడానికి భగవంతుడ్ని సృష్టించాడు. ఆ భగవంతుడు బలహీనుడు కాకుండా ఉండేందుకు కర్మసిద్ధాంతాన్ని ప్రచారం చేశాడు.

భావన ఆలోచనలనుంచి తెలతెల వారుతుండగా నిద్రలోకి జారిపోయింది.

* * *

"తల్లీ! లే!" నాగమణి తట్టి లేపింది భావనను.

భావన తృళ్లిపడి లేచింది.

కిటికీలోనుంచి పడుతున్న సూర్యకిరణాలు నుదుటిని చురుక్కున తాకాయి.

"చాలా ఎండెక్కింది. ముఖం కడుక్కో! ఉప్మా చేశాను. తిని కాఫీ తాగుదువు గాని."

భావన కళ్ళెత్తి తల్లి ముఖంలోకి చూసింది.

ఆమె ముఖంలో చాలాకాలంగా కన్పించని ప్రశాంతత ఏదో కన్పించింది.

చాలాకాలంగా నాగమణికి కూతుర్ని పలకరించాలంటే జంకు ఉంటున్నది. ఆంతచనువుగా మాట్లాడి ఎంతకాలమైందో!

భావన లేచి మౌనంగా బాత్‌రూంలోకి వెళ్ళింది.

తల్లిని గురించి ఆలోచిస్తూ బ్రష్ చేసుకోసాగింది

తను రాత్రి ఆమె పక్కన పడుకొన్నందుకు ఆమెకు అంత సంతృప్తిగా ఉందా?

కళ్లు పక్కకు తిప్పుకొని అపరాధిలా మాట్లాడే అమ్మ ఇవ్వాళ తన ముఖంలోకి ఆప్యాయంగా చూసి మాట్లాడింది.

ఇంతకాలం తన చూపుల్లో కన్పిస్తూ వచ్చిన తిరస్కారభావం ఇవ్వాళ ఆమెకు కన్పించి ఉండదు.

భావన తల్లితో ఎక్కువ మాట్లాడలేదు. టిఫిన్ తిని స్నానంచేసి కాలేజీకి వెళ్ళిపోయింది.

ఆరోజే రాహుల్ ముందు లెటర్ను కొట్టింది.

పాపారావు ఏమయ్యాడో తెలియదు వారం గడిచింది. పదిహేను రోజులు గడిచాయి. ఇంట్లో ఒక్కొక్క సామానే మళ్ళీ వీధిలోకి వెళ్తున్నది. భావన చూసీ చూడనట్టే ఉంటూ, ముభావంగానే ఇంటి పనుల్లో తల్లికి సహాయం చేస్తున్నది.

భావనకు రాత్రి అవుతుందంటే భయం పట్టుకొనేది

నరకానికి తెరలు లేవబోతున్నట్టు, కమ్ముకొస్తున్న చీకటి తెరల్ని చూసి కంపించిపోయేది. ఏ మూలో పాపారావు వస్తే బాగుండుననేది భావన అచేతన మనసులోని కోరిక.

ఇరవయ్యోరోజు భావన కూర్చుని చదువుకుంటూ ఉండగా ఎవరో తలుపు తట్టారు.

అప్పటికే నాగమణి కడుపునొప్పితో మూలుగుతోంది.

భావన వెళ్ళి తలుపు తెరిచింది

ఎదురుగా నిల్చుని ఉన్న పాపారావును చూస్తూ ఉండిపోయింది. మనిషి సగం కాలి చితిమీదినుంచి లేచివచ్చినట్టుగా ఉన్నాడు.

"బాగున్నావా!" నీరసంగా పలకరించాడు.

భావన సమాధానం చెప్పలేదు. లోపలకు రమ్మన్నట్టు వాకిట్లో నుంచి తప్పుకొని దారి ఇచ్చింది.

"ఏమే మణీ! ఎలా ఉన్నావే!" అంటూ చాపమీద నాగమణి పక్కన అతికష్టంమీద కూర్చున్నాడు.

మోకాళ్లు వాచి ఉన్నాయి.

"ఇంతకాలం ఎక్కడ చచ్చావురా!" నాగమణి విసుగ్గా అడిగింది.

భావన లోపలకు వెళ్ళిపోయింది.

వద్దనుకుంటూనే వాళ్ళ మాటలు వినసాగింది.

"వళ్ళంతా వాయగొట్టేశారే! పోలీసు లాఠీ దెబ్బలు!"

"ఎప్పుడూ? ఎలా."

"అదే ఆ రోజు రిక్షాలో దాన్ని తీసుకెళ్ళానా? దార్లో ఓ హెడ్డు కానిస్టేబుల్ గాడికి నామీద అనుమానం వచ్చింది. స్టేషన్‌కు లాక్కెళ్ళాడు. చితగ్గొట్టారు."

"అన్నీ చెప్పేశావా?"

"ఆఁ ఒకటి తప్ప."

"అంటే?"

"ఈ ఇంటి గురించి తప్ప!"

"నీ రుణం ఎలా తీర్చుకుంటానో!" నాగమణి కంఠంలో కృతజ్ఞత వ్యక్తం అయింది

"మరి ఇన్ని రోజులు?"

"అదేనే చావబాదారు. అసలు రెండు రోజులు స్పృహే లేదనుకో. భయపడి ఆ పోలీసోళ్ళే ఆసుపత్రిలో చేర్పించారు"

"అదేమైంది?"

"ఏదో ఇవ్వాళేగా వన్ను వదిలేశారు! ఎక్కడ చచ్చిందో ఏమో? మళ్ళీ మనం ఓ నలుగుర్ని సమకూర్చుకొనేంత వరకూ...."

"వాళ్ళు ముగ్గురు కూడా...."

"చిలకలూరిపేటకు వెళ్ళిపోయారట!"

"ఆ రంగమ్మముండ మనకెక్కడ

దాపరించిందిరా! మరొకంటికి తెలియకుండా పిట్టల్ని నోటకిరచుకు పోతున్నది."

తలాతోకా లేకుండా, తెగిపోతున్న సినీమారీల్స్‌ను చూస్తున్నట్టుగా తోచింది వాళ్ళ సంభాషణ భావనకు.

"పనుకేమైనా ఉందా?" పాపారావు.

"లేదు. త్వరగా పోయి తీసుకురా!"

"నీ దగ్గర డబ్బులున్నయ్యా?"

"నా దగ్గిరెక్కడున్నయ్! అప్పు దానికి ఈ డ్రాయింగ్‌రూంలో వస్తువులే మిగిలాయి. వీటి నెవరు కొంటారు. పనికి మాలిన అలంకరణలూ — ఇవీను."

"నేను ఇప్పుడే వస్తాను. ఇవ్వాళన్నా కాస్త హాయిగా నిద్రపోవాలి" అంటూ పాపారావు బయటికి వెళ్ళిపోయాడు.

"అమ్మా! భావనా!" నీరసంగా పిల్చింది నాగమణి.

భావన మౌనంగా వచ్చి నిల్చుంది

"పొద్దుటి అన్నం ఉన్నది. తినుతల్లీ! ఇప్పుడు వంట చెయ్యలేను."

విన్నది భావన అవుననికానీ కాదని కానీ అనలేదు.

తన గదిలోకి వెళ్ళింది.

పాపారావు వచ్చాడు!

భావన మనసంతా చేదుచేదుగా ఉన్నది. వాళ్ళ సంభాషణ చెవుల్లో మళ్ళీ విన్పిస్తున్నది. ఇది సరికొత్త విషయం కాదు. అయినా మళ్ళీ ఏదో జుగుప్స ఆమె మనస్సును చుట్టేస్తున్నది.

వాళ్ళిద్దరూ ఏదో గుసగుసగా మాట్లాడుకొంటున్నారు.

రోజులు దొర్లిపోతున్నాయి.

భావనకు రాహుల్‌తో పరిచయం పెరిగింది.

మొదటిరోజు హోటల్‌లో ఒక మూలగా ఉన్న టేబుల్‌ముందు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. ఎవరికీ ఇద్దర్లో ఏం మాట్లాడాలో తోచడంలేదు.

ఇద్దరి మనసులూ, పళ్ళభారంతో మామిడిచెట్లలా ఉన్నాయి. ఆ భారాన్ని పంచుకోవాలి

ఒకరి కళ్ళలోకి ఒకరు మౌనంగా చూసుకొన్నారు.

ఇద్దరి కళ్ళల్లో ఒకే భావం, ఒకే ఆరాటం!

నాలుగుకళ్ళ తాలూకు చూపులు చాలా లోతుగా కలుసుకొన్నాయి. ఓ పవిత్ర సంగమం ఏర్పడింది. ఆ సంగమంలో నుంచి ఓ చిన్న యిల్లు పైకి తేలివచ్చింది. ముందు మనసులు కలుసుకొన్నాయి. చూపులు పెనవేసుకున్నాయి. ఆత్మలు ఊసులాడుకొన్నాయి. ఆ తర్వాతే ఇల్లు కన్పించింది.

ఆ ఇంటిముందు దానిమ్మచెట్టు ఉంది.

ఇంటివెనక కరివేపాకు చెట్టు ఉంది.

గడపలో స్త్రీ బిడ్డకు పాలిస్తూ భర్త కోసం ఎదురుచూస్తోంది.

సైకిల్‌బెల్ వినిపించింది.

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.









2
ప్యాక్‌లలో
'బ్లూ' మరియు
'శాండల్ వుడ్'

**నైసిల్ తెచ్చుకోండి
చెమటకాయల బాధ
మరిచిపోండి.
టాల్కం పౌడరు కంటే
తక్కువ ధరలో!**



ప్రత్యేకమైన ఔషధయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి నెలలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారులైన సూక్ష్మజీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

అది ఆమె చెవులకు మధురగీతంలా వినిపించింది

మనసుకు మధుర ఆలాపనలా చుట్టి వేసింది.

దూరంగా ఆకాశం వంగి క్షితిజాన్ని చుంబించింది.

వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడల్లా మాటలు తక్కువ, భావాలు ఎక్కువ- వాళ్ళమధ్య చోటుచేసుకొనేవి.

భావనకు ఎన్నో చెప్పాలని ఉండేది- తనజన్మగురించి- తనతల్లి జన్మగురించి- తన కులం జన్మగురించి. కాని చెప్పలేక పోయేది. అసలు రాహుల్ కూడా ఆ అవకాశం ఇవ్వలేదు.

భావన ఒంటరిగా ఉన్నప్పుడు ఆలోచించేది- తను కళ్ళు తెరిచే కలలు కంటున్నదా? రాహుల్ తనను వివాహం చేసుకుంటాడా? కల నిజం అవుతుందా? ఎప్పుడైనా తనలాంటిదాని కల నిజమైనట్టు ఏ చరిత్రలోనైనా రాసిఉందా?

"భావనా! నీ ప్రేమ సఫలం అవుతుందనే అనుకొంటున్నావా? నువ్వో శాపగ్రస్తవు. కలలు కనడం మానెయ్! వాస్తవంలో బ్రతుకు. నీకంటే నీ తల్లీ, ఆ పాపారావూ వాస్తవంలో బతుకుతున్నారు. సమాజం వాళ్ళకు నిర్మించిన పరిధిలోనే బతుకుతున్నారు.

కాని నువ్వు? రాహుల్ మీదవాడే కావచ్చు. కాని ఈ సమాజంలోని సంస్కారాన్ని- మధ్యతరగతి సంస్కారాన్ని జీర్ణించుకొన్న మగవాడు. నిన్ను నిన్నుగా చూడగలడా? పరిస్థితులనుంచి వేరుచేసి నిన్ను నిన్నుగా చూసే సంస్కారం అతనిలో ఉందా?

నువ్వు అతన్ని ప్రేమిస్తున్నావ్!

ఇదంతా నీ భ్రమ! ఆ భ్రమనుంచి బయటపడు." ఎవరో లోపలనుంచి హెచ్చరించేవారు.

"ప్రేమ భ్రమ కాదు. కాలేదు. ప్రేమ ఎప్పుడూ ఫలితాన్ని గురించి ఆలోచించి ముందుకు అడుగువెయ్యదు. ప్రేమకు కళ్ళు లేవంటారు బుర్రకూడా లేదు. అంటే కళ్ళేకాదు చెవులూ, ఆలోచనలూ కూడా లేవని అర్థం!

ప్రేమ వ్యాపారి ఉపయోగించే తరాజు కాదు. ప్రేమ బరువైందా లేక ప్రియుడు బరువైనవాడా అని తూచ డానికి దానికి తక్కెళ్లు ఉండవు దానికి బేరం ఉండదు. కాని గులాబీకు ఉండే ముల్లు మాత్రం ఉంటుంది. ఆ ముల్లు నిరంతరం ప్రేమించిన హృదయాన్ని గాయపరుస్తూనే ఉంటుంది ఇంకెవరో లోపలినుంచే సమాధానం ఇస్తుంటారు.

ఇలా భావన తనతో తనే నిరంతరం పోరాడుతూ ఉండేది.

శేఖర్, సురేంద్రల టీజింగ్ ఎక్కువైంది.

* * *

పాపారావు వచ్చాడేగాని ముందులా డబ్బు సంపాదించలేకపోతున్నాడు.

మధ్య మధ్య తల్లీ, పాపారావు పోట్లాడుకోవడం కూడా భావన వింటూనే ఉంది. వాళ్ల పోట్లాట చూస్తుంటే మాలిగలేవి ఎముకకోసం రెండు కుక్కలు కొట్లాడుకున్నట్టే అనిపిస్తూ ఉంటుంది.

రెండురోజులుగా వాళ్లిద్దరిమధ్యా పోట్లాటలు ఎక్కువైనట్టు భావనకు తోచింది. భావనకు అక్కడ్నుంచి పారిపోవాలని ఉంది.

మూడోరోజు రాత్రి నాగమణి కడుపు నొప్పిఅంటూ ఒకటేగోలగా ఏడుస్తున్నది.

భావనకు పరీక్షలు దగ్గర పడు తున్నాయి.

"ఒరే పాపారావ్! నేను ఈ బాధ భరించలేనురా! రైలుకింద తల పెట్టే స్తాను."

"ఆ పని చెయ్యి!" పాపారావు కంఠం వినిపించింది.

భావనకు లేచి రావాలని ఉంది. వచ్చి తను ఏం చెయ్యాలి? తల్లిని ఎలా ఓదార్చాలి?

"అడంగి వెధవా! నువ్వు అంతకంటే ఏమంటావురా? నా ప్రాణం పోతోంది. ఓ పదిరూపాయలు పుట్టించలేవురా?" మూలుగుతూనే నాగమణి అంటున్నది.

భావన ఠక్కున లేచింది. రెండు రోజుల్లో ఫీజు కట్టాలని దాచుకున్న డబ్బు పర్సులోనుంచి తీసింది. తలుపు తెరుచుకొని బయటికి వచ్చి ఓ పదిరూపా యల కాగితం పాపారావు ముఖంమీదకు విసిరికొట్టింది. వాళ్ళు మరోమాట అడిగే ముందే గిర్రున తిరిగి గదిలోకి వెళ్ళి తలుపు బిగించుకొన్నది భావన.

ఆ పదిరూపాయలతో ఆ రాత్రికి నాగమణి ప్రశాంతంగా నిద్రపోగలదని భావనకు తెలుసు.

ఆ రాత్రి పొద్దుపోయేంతవరకూ నాగమణీ, పాపారావూ మాట్లాడుకోవడం వినిపిస్తూనే ఉన్నది భావనకు. పుస్తకం పేజీలు తిరగుతున్నాయి. కాని ఏం చదువుతున్నదో ఆమెకు బోధపడటం లేదు.

"నా మాట విను మణీ! ఐదువేలు! ఒక్కరాత్రికి! కనీసం ఓ ఆరునెలలు సుఖంగా రోజులు గడిచిపోతాయి. ఆ తర్వాత.. ఒకసారి.... మళ్ళీ.. మనం పుంజుకోవచ్చు- నీ ఆరోగ్యం కాస్త కుదుటపడ్డే.... మనం ఈ ఊరినుంచే మకాం మారుద్దాం...."

మధ్యమధ్య మాటలు వినిపిస్తున్నాయి.

"సరే! నీ ఇష్టం!" ముద్దముద్దగా అన్నది నాగమణి.

ఆ తర్వాత వారంరోజులు ఇంట్లో ఏ గొడవా లేదు. డబ్బు బాగానే ఖర్చు చేస్తున్నారు. ఇంటినిండా సరకులు, డబ్బాల నిండుగా పప్పులూ వగైరా.... నాగమణి ఉత్సాహంగా ఉన్నది.

భావన గమనిస్తూనే ఉన్నది.

"ఎక్కడిది దీ డబ్బు? మళ్ళీ ఏ అమాయకురాల్ని పట్టుకొచ్చారు?" అని

తిరిచి అరిచి అడగాలనిపిస్తున్నది.

ఆ రాత్రి పొద్దుపోయింది తల్లి కూతురికి అన్నం పెట్టింది. తనూ గ్లాసు పక్కన పెట్టుకొని ఫలహారం చేసింది.

పాపారావు రాలేదు

వాగమణి చాపమీద నడుం వాల్చింది. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్టు మధ్యమధ్య వెళ్ళి తలుపుతీసి చూస్తున్నది

దాదాపు పదకొండు గంటలైంది. తల్లి గురక విప్పుతోంది

ఎవరో తలుపు కొట్టారు.

పుస్తకం మడిచి లేచివచ్చి తలుపు తీసింది భావన.

ఎదురుగా పాపారావు లేడు.

వచ్చిందెవరో తెలుసుకొనే లోపలే ఇద్దరు యువకులు భావనను లోపలకు తోసుకుంటూ వచ్చారు.

ఒకడు తలుపు గడియపెట్టాడు.

"మీరా!" భావన అన్నాననుకుంది. కంఠం పెగల్లేదు

"ఏమిటే అలా చూస్తావ్? కొమ్ములు విసురుతావా?" శేఖర్ వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

"ఆ కొమ్ముల్ని విరవడానికే వచ్చాం!" అన్నాడు సురేంద్ర.

"ఛీ! బోర్కుయ్యాండి. ముందు బయటికెళ్ళండి!" అరిచింది భావన విలువిల్లా రోషంతో దహించుకుపోతూ

"నన్ను కొడ్తావు గదూ?" అంటూ ఈ చంపా ఆ చంపా ఫెడీఫెడీమని కొట్టాడు శేఖర్.

"బాబూ అదేటి బాబూ! నా బిడ్డను కొట్టకండి!" మత్తులోనే లేచికూర్చుని ముద్దముద్దగా అన్నది వాగమణి.

"ఛీ! నువ్వు నోర్మూయ్యేశే! ఐదువేలు పోసి ఈ రాత్రి ఈ పొగరుబోతు గేదెను కొన్నాం! నువ్వు పడుకో" అంటూ ఎడంకాలితో వాగమణిని తన్నాడు సురేంద్ర.

భావన తల గిర్రున తిరిగింది.

శేఖర్ చెయ్యి పట్టుకొని గదిలోపలకు ఈడ్చుకుపోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

భావన శేఖర్ చెయ్యి గట్టిగా కొరికింది. వీధితలుపు తీసి పరిగెత్తబోయింది. సురేంద్ర బలమైన రెండుచేతులమధ్య ఇరుక్కుని నలిగిపోతున్నది.

భావన ఇద్దరు బలమైన మగవాళ్ళను చిత్తుగా తన్ని తన శీలాన్ని కాపాడుకొని పారిపోవడానికి సినిమా హీరోయిన్ కాదు. కనీసం ఆమె ప్రియుడు రాహుల్ సమయానికి వచ్చి తలుపుల ఒక్కతన్నుతో బద్దలుకొట్టి, ఇద్దరు విలన్లనూ చావబాది ఆమెను రక్షించి తీసుకెళ్ళలేదు.

(సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press,
Public Garden Road Hyderabad-500 001   Editor : A. SUDHAKARA RAO






ముఖ చిత్రం : సాంధ్యశ్రీ

2, 3, 4 కవరు పేజీ చిత్రాలు నవంబరు సంచికలోని "జంబూలోక చరిత్ర" కథలోవి.

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య.

# ఆధునిక నీతి కథలు

తాళ్లూరు నాగేశ్వరరావు

భువనేశ్వరికి భర్తపోయి ఇప్పటికి అర్ధ దశాబ్దమైంది. అయితే ఈ అయిదేళ్లలో ఆమె అందం ఆవగింజంత చెక్కుచెదర్లేదు. పైపెచ్చు మబ్బు విడిచిన సంధ్యాకాశంలా మనోజ్ఞంగా మెరవసాగింది. సెకండరీగ్రేడు టీచరైన ఆమె భర్త ఆరేళ్ల కొడుకునీ, మూడేళ్ల కూతుర్నీ తప్ప మరో ఆస్తిని మిగల్చకుండా సెరిబ్రల్ హెమరేజ్‌తో హఠాత్తుగా ఈ లోకంనుంచి వెళ్లిపోయాడు. పెద్దకర్మ అయ్యేవరకూ ఆమె కంటికీ భూమికీ ఏకధాటిగా ఏడ్చింది. ఆపైన ధైర్యం తెచ్చుకొని జీవితంపై ఆశలు పెంచుకుంది. స్కూలుఫైనల్ చదివిన విజ్ఞానంతోనే పదిమందికి ట్యూషన్లు చెప్పుకుంటూ పడిపోయిన కొంపతో కాలక్షేపం చేయసాగింది. ఒక్క సంవత్సరంలో ట్యూషన్ చదివేవాళ్ల సంఖ్య పాతికదాకా చేరుకుంది. రెండో సంవత్సరంలో ఆ సంఖ్య అయిదు పదుల్ని మించింది. తనకి బంగారు భవిష్యత్తు వుందని భువనేశ్వరి భావించింది. అయిదేళ్లలో ఆమె భావన నిజమైంది. అరవైమంది విద్యార్థులతో గ్రీన్‌వుడ్స్ కిండర్‌గార్టెన్ స్కూలు ప్రారంభించింది. దానికి ఆ వూరి సర్పంచ్, పంచాయతీసమితి ప్రెసిడెంట్ ఆర్థిక బలాన్ని చేకూర్చారు; ఉన్నత పాఠశాల హెడ్‌మాస్టరు నైతిక బలాన్ని సమకూర్చాడు.

ఒకసారి ఉన్నత పాఠశాల నూతన భవనాల శంఖుస్థాపనకు ఆ గ్రామానికి రాష్ట్ర ముఖ్యమంత్రి సాయంత్రం ఆరుగంటలకు వచ్చాడు. ఆ ఉత్సవాన్ని ఆడంబరంగా, అమితమైన వ్యయంతో, గ్రామ పరువు ప్రతిష్టలు ఇనుమడించే విధంగా, తన రాజకీయ భవిష్యత్తుకు చక్కని బాటగా ఆ వూరి ప్రెసిడెంట్ ఏర్పాటు చేశాడు. ఆ ఉత్సవానికి భువనేశ్వరి వచ్చింది— నల్లంచు తెల్లని ఆర్గంజీ చీర ధరించి. ఆ చీరలో ఆమె అందం అమోఘంగా, అత్యంతాకర్షకంగా వుంది. మీటింగ్‌కు వచ్చినవాళ్ల కళ్లన్నీ ఆమె మీదనే వాలాయి. అందులో ఏమంత అబ్బురం లేదుగానీ, గంభీరోపన్యాసం యిస్తూన్న ముఖ్యమంత్రి వాడి చూపులు హఠాత్తుగా ఆమెమీద పడ్డాయి. ఆయన మనస్సు చెదిరింది; ఆరు పదులు దాటిన వయస్సు ముసలెద్దులా వలపు వాసనతో రంకె వేసింది; కొవ్వొత్తి దీపంలా కోర్కె కాలుదువ్వింది. చూపు పట్టుదప్పటంతో, ఆలో

చనలు కట్టుతీడటంతో, మాటలు జారుడుమెట్లయ్యాయి. గొంతు గురగుర లాడింది. ఆపైన మూడు నిముషాల్లో పంచరుపడ్డ లారీ టైరులా ఉపన్యాసాన్ని ముగించాడు. మీటింగ్ అయినాక ఆ వూరి ప్రెసిడెంట్‌ను వాకబు చేశాడు— నల్లంచు తెల్లచీరలో నిగనిగలాడే సౌందర్యాన్ని నిక్షిప్తపర్చుకున్న భువనేశ్వరి గురించి.

ఆ రాత్రి ఏడున్నర గంటలకు భువనేశ్వరికి కబురొచ్చింది— ముఖ్య మంత్రిగారు మాట్లాడటానికి ఉబలాటపడుతూన్నట్టు. అదృష్టం ఆగమేఘాలమీద కాళ్లముందు వచ్చిపడ్డట్టుగా అత్యద్భుతంగా ఆశ్చర్యపడి, బంగారానికి మెరుగు పెట్టినట్టుగా మరింత అలంకరించుకొని, ముఖ్యమంత్రి సమక్షంలోకి వెళ్లి, ముకుళిత నేత్రమై నమస్కరించింది. అంతే!

కారెక్కమని కనుసైగ చేశాడు ముఖ్యమంత్రి.

రాజకీయంగా రాజధానీ నగరంలో రాణివాసం వెలిగిద్దామనుకున్న ఆ రమణి మాట్లాడకుండా కారెక్కింది.

మూడు నెలల్లో భువనేశ్వరికి అమాంతంగా మంత్రిపదవి లభించింది. ఆమె అదృష్టాన్ని చాలమంది ఆకాశంతో పోల్చారు. అందమైన ఆడది శీలం అంత ముఖ్యం కాదనుకొంటే ఏ రంగంలోనైనా రమణీయంగా రాణించవచ్చు ననేది కొత్త విషయమేమీ కాదు అనుకున్నారు కొంతమంది.

అయితే ఆడదాని అదృష్టం ఎంత చంచలమో రాజకీయాలు అంతకంటే ఆరురెట్లు అనూహ్యమైన మార్పులకు ఆటపట్టయినవి.

ఒక కారు యాక్సిడెంట్‌లో ఆ ముఖ్యమంత్రిగారు శాశ్వతంగా కీర్తి శేషులయ్యారు.

రాష్ట్ర రాజకీయాలు తల్లకిందులై, అధిష్ఠానవర్గం ఆశీస్సులతో, ఆమోద ముద్రతో ఓ అడ్రసులేని ఎం.ఎల్.ఏ. అదృష్టదేవత ఆలింగనంలోకి వచ్చి, ముఖ్యమంత్రి అయ్యాడు. కొత్త మంత్రివర్గం ప్రమాణస్వీకారం చేసింది. అందులో భువనేశ్వరి లేకపోవడం ఎవ్వరికీ ఆశ్చర్యాన్ని కలిగించలేదు.

అయితే భువనేశ్వరి నిరాశతో నిట్టూర్చిన నిప్పురవ్వ అయిపోయి స్వగ్రామం తిరిగిరాలేదు. రాజధాని నగరంలోనే ఓ ఎం.ఎల్.ఏ. క్వార్టర్సు అద్దెకు తీసుకొని కనీసం ఎం.ఎల్.సి. అయినా అవుదామనే ఆకుపచ్చని ఆశతో రాజకీయ నాయకుల్ని తన ఆకర్షణ వృత్తంలోకి లాక్కోవడానికి అన్ని విధాలా ప్రయత్నాలు చేస్తోంది.

***అరఘడియ భోగంలాంటి రాజకీయ పదవికోసం అమూల్యమైన శీలాన్ని అంగట్లో పెట్టడం అవివేకం.***

# తోడు

—టీవీయస్మూర్తి

రంగనాథంగారి చిన్నపాప రమ. వయసు ఐదేళ్లుంటాయి. మంచి చలాకీయే కాదు చూడ చక్కని బొమ్మ అనుకోండి.

నోరు తెరిస్తే మాత్రం ఎవరూ ఐదేళ్ల పిల్ల మాట్లాడుతున్నట్లుగా అనుకోరు. అంత ఆరిందాలా మాట్లాడుతుంది. ఏ విషయం కూడా వదిలిపెట్టదు తగుదునమ్మా అని.

చిన్న రమకు చక్కటి చిక్కటి ఓ ముద్దమందారంలాటి అక్క వుంది. పేరు ముద్దమందారం కాదుగానీ అలాటిదే 'పద్మ'.

పద్మ కాలేజీలో చదూతోంది యింటర్ రెండో సంవత్సరం. మరి పద్మ రోడ్డుమీదకొస్తే మాత్రం ఎన్నో జతల అబ్బాయిల కళ్లు పద్మ వెంట ఉమన్స్ కాలేజీ వరకూ మార్చ్‌ఫాస్ట్ జేస్తాయంటే అతిశయోక్తి కాదు.

ఓ రోజు రమ వాళ్లమ్మగారు బజారుకెళ్లి సాయింత్రం పేరంటానికి వెళ్లడానికి తను కట్టుకోబోయే చీరకు మేచింగ్ గాజులు తెచ్చిపెట్టమంది.

పేపర్ తిరగేస్తున్న రంగనాథంగారి దగ్గరకెళ్లి 'డాడీ! నాకు ఐదు రూపాయిలు కావాలి' అంది.

"ఏవిటి నాన్నా ఎందుకూ.. " అన్నారు ముద్దుగా.

'అర్జంట్‌గా అమ్మకి నీలంరంగు గాజులు కావాలిట, తేవాలి. .' చెప్పేసింది.

యిస్తాగానీ మరొక్కదానివే వెళ్తావా! కాసేపాగితే నేనే పోయి తెచ్చి పెడ్తాలే' అన్నారు.

'పర్లేదు నాన్నా. నే నెక్కడికి వెళ్లినా నా గురించి నువ్వేం భయపడకు " అంది ఆరిందాలా.

'ఛ వూర్కోవే. ' మరీ ఆరిందాలా మాట్లాడుతున్నావ్.. ' అన్నారు మందలింపుగా.

'కాదులే డాడీ.. నేను బయటికెళ్తే మన వీధిలో కుర్రాళ్లు రాజూ, ఆనందూ, గోపాల్, ఎదురింటి సురేష్ అంతా వెనకే వస్తారు ప్రైమ్‌మినిస్టర్ ముందూ వెనకా సెక్యూరిటీ పైలెట్స్ మాదిరిగా. మళ్లీ మన యింటిదాకా తెచ్చి వదిలి మరీ వెళతారు '

'ఛ... వూర్కోవే మరీ మాట్లాడతావే వాళ్లంతా నీ వెనకే ఎందుకు వస్తారమ్మా వాళ్లకేం పనుల్లేవా.. ' అన్నారు రంగనాథంగారు ఈసారి నిజంగానే రమ మాటలు అర్థంకాక.

'నేను పద్మ అక్కను తోడు తీస్కెళతా కదా డాడీ ఎక్కడికి వెళ్లినా ....' అసలు సంగతి చెప్పేసింది సిసింద్రీ రమ.

రంగనాథంగారు 'అఁ....' అంటూ నోరు తెరిచేరు.

## నూతన వివాహితులకు పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపరా?

